

ట్రయంఫ్ 'S —మేళవించిన షర్టింగులలో దీన్ని మించినదిలేదు.



ఎంబ్లెమ్—బుష్ షర్టింగుకు ఆదర్శమైనది ఇది.

బిన్నీ వారి మేళవించిన షర్టింగు బుష్ షర్టింగుల
దేనినిగూర్చి ఎంతైనా చెప్పుకోవచ్చు కాని అది చెప్పుకొనే,
మంచి రీతి తీరువుంది
మీరు అది తెప్పించండి ధరించండి
కచ్చితమైన పాలిస్టర్ నారు మరియు నూలు
మేళవింపును గమనించండి
ఆ తర్వాత ? ఆ బట్టే చెబుతుంది మీకు!
అందులో నేముంది తమాషా

# బిన్నీ పాలిస్టర్/నూలు మేళవించిన షర్టింగు మరియు బుష్ షర్టింగు

## బిన్నీ - బట్టలకు పెట్టినది పేరు

BL 5117

# ప్రతి ఐదుగురిలో ఒక వ్యక్తి నోటికంపుతో బాధపడుతుంటాడు.

## కాని, వారెవరనేదే ప్రశ్న!



C I B A COSMETICS

నోటి వాసనతో వచ్చిన చిక్కల్లా, ఇతరుల వాసన తెలుసుకోవటం అతి సులువు. తన వాసన తెలుసుకోవటమే కష్టమైన పని. మీ నోటివెంట చెడువాసన వచ్చే అవకాశం కలుగకుండా చూసుకోవటమే చాలా శ్రేయస్కరం. బినాకాగ్రీన్‌తో మీపళ్లు తోముకోవటం ఆరంభించండి రోజే, రోజంతా. మీరు విడిచే ఊపిరిని, తాజాగా మధురంగా ఉంచగలిగిన ప్రకృతియొక్క స్వకీయ దుర్గంధహారిణి, క్లోరోఫిల్ ఉంది బినాకాగ్రీన్‌లో.




Binaca Green

mcm/ca/14

అన్నిశుభకార్యములకు
శుభప్రదమైన
పానీయం

గోల్డ్ స్పాట్

GOLD SPOT

పార్టీ ఆర్డర్లకు ప్రత్యేక సదుపాయం నిమిత్తం సంప్రదించండి

| హైద్రాబాద్ బాట్లింగ్ కో; (ప్రై) లిమిటెడ్)<br>పంజాగుట్ట, హైద్రాబాద్<br>ఫోన్ నెం. 34615 - 38445 | విజయవాడ బాట్లింగ్ కో;<br>కామవరప్పాడు<br>ఫోన్ నెం. 84-25 - 4134 |
|---|---|

| శ్రీ సర్వరాయ సుగర్స్ లిమిటెడ్;<br>బాట్లింగ్ యూనిట్, వేమగిరి<br>రాజమండ్రి<br>ఫోన్ నెం. కడియం 45 | వైజాగ్ బాట్లింగ్ కో;<br>విశాఖపట్టణం<br>ఫోన్ నెం. ఆఫీస్ : 4473<br>రెసిడెన్స్ : 4476 | రాయలసీమ బాట్లింగ్ కంపెనీ,<br>కర్నూలు<br>ఫోన్ నెం. 375 |
|---|---|---|

హేమలతకీ, రచయిత (త్రు) లకి దసరా సందర్భంగా మా శుభాకాంక్షలు. ఎల్లా భావంప. ... వారం ధర్మపథం, ప్రశ్నావళి ... స్తున్నాము. సం॥

### ముఖచిత్రం

'చంద్రుడి మీద మనిషి' అద్భుతంగా ఉండి ఆశ గలిగించినా, అందుకు సంబంధించిన విషయం పత్రికలో ఎక్కడా కనబడక పోవడం చాలా శోచనీయం. 'పరిలిప్తం' సీరియల్ చాలా ఆసక్తికరంగా నడుస్తున్నది. పత్రికలో ... శిరీకల 'శిరి' గారి అక్షయతూణీరంగారి మరియు 'ఒకవారం విపరీతం', కె. రామలక్ష్మిగారి సమాధానాలు కథల్య ... లేదు. ముఖ్యమైనది ఏమిటనగా ఇప్పుడు మీరు వేస్తున్న కార్టూనులు ఏవీ బాగాలేవు. మంచి కార్టూనులు ఒకటే రెండైనా వరనాలేదు. అంతేగాని ... కార్టూనులు వేసి మాకు విసుగు తెప్పించవద్దని ప్రార్థన.

రమేశ్‌బాబు, సింహప్రసాద్, (మార్కాపురం.)

* * *

''చంద్రుడి మీద మానవుడు'' ముఖచిత్రం పత్రికకు నిండుదనాన్ని తెచ్చింది. పరిలిప్తం సీరియల్ చురుకుగా సాగుతున్నది. తెలంగాణా ఉత్తరాలు ఆపినందుకు చాలా సంతోషం.

వి. వి. ఎర్. శర్మ, (విజయనగరం)

### వ్యాసాలు

శ్రీ కందికొండగారిచే వ్రాయబడిన 'హిందీ నియంతృత్వధోరణి' లోని ప్రతి వాక్యము నిజాన్ని చాటుతోంది. దక్షిణ భారతీయుడు ఉత్తర భారతావనిలో అడుగుపెట్టిన కొద్ది కాలానికే హింది

# ఉత్తరాలు

భాషను నేర్చుకుంటున్నాడు. ఉత్తరదేశమువాళ్ళు అలా నేర్చుకోవాలనే ప్రయత్నమైనా చేస్తున్నారా? పైగా హిందీ గొప్పదని వాళ్ళాడిన ప్రతిమాటలో కనిపిస్తూనే వుంటుంది. ఇది మన నీరసత్వానికి నిదర్శనం. తెలుగు దేశంలో హిందీవారు గౌరవింపబడుతున్నారు. మరి హిందీ దేశంలో ...(వివరాలు మానవుని స్థాయిలో) ప్రస్తుతానికిది చర్చనీయాంశం కాకపోయినా! అసలు చాల సమస్యలకు భాష మూల కారణం. ఎవరి మాతృభాష వాళ్ళకు అమ్మ వంటిది! తల్లి పూజింపబడుతున్నట్లే మాన మాతృ భాష పూజింపబడాలి!

నన్ను నొప్పించే విషయం— తెలుగువాడు హిందీ మాట్లాడుతూ— ఎంతో గొప్పగా, నాగరికతగా ఫీలవుతుంటాడు— ఎంత బలహీనత?

మన తెలుగుతల్లికి మల్లెపూవులదండ!
మమ్ముగన్న తల్లికి మంగళారతులు!!

రఘు, (భిలాయ్ నగర్)

పై వారమే!
తెలంగాణా వారికి
ఒక ప్రత్యేక
ఆకర్షణ!


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 24–10–'69
శ్రీ సౌమ్యనామ సం॥ఆశ్వయుజ మా. శుద్ధచతుర్దశి

సంపుటము : 6౦ సంచిక : 6

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


విషయసూచిక

ముఖచిత్రం : 'మహాసురమర్దని'
చిత్రకారుడు : శ్రీ గోపి



బంగ్లా కాంగ్రెస్
ప. బెంగాల్ మార్క్సిస్టుల పాలన
మసిపూసిన మారేడుకాయ!
ఇది నువ్వే చేశావు
లేదు, నువ్వే చేశావు
సమైక్య తీర్మానం
నువ్వు సాధుజంతువు అయ్యావనుకున్నాను
భారతదేశంతో పాకిస్థాన్ బాంధవ్యం
ఆంధ్రా-తమిళనాడు సరిహద్దు
ఆంధ్రప్రదేశ్‌లో మద్యపాన నిషేధం రద్దు!
తమిళనాడులో దొంగ రవాణాదార్లకు మంచి అవకాశం!

# ఢిల్లీలో బాద్‌షాఖాన్

ఈ వారం ఢిల్లీ బాద్‌షాఖాన్ పేరుతో మారు మోగింది. కొందరు ఆయన [illegible] కోసం, ఇతర సహాయం కోసం [illegible] ఇటువంటి ఆరోపణలు అసత్యాలని ఆయన రాకతో తేలిపోయింది.

ఇక ఆయన మందలింపు మొద్దుబారిన చర్మాలు కల వారందరికీ బాధ కలిగించి ఉండాలి. గాంధిని అనుసరించని వారికి నేను ఇవ్వగలిగిన సలహ ఏమి ఉంటుందని ఆయన అడిగారు.

## సంయుక్త రాష్ట్రాలు

పాకిస్తాన్ భారతదేశంతో సంయుక్త రాష్ట్రంగా కలిసి ఉండగలదా? అనే ప్రశ్నకి ఆయన ఉండలేదనే సమాధానం ఇచ్చారు. భారతదేశంలోని హైందవుల మధ్యనే ఐకమత్యం లేనప్పుడు పాకిస్తాన్‌లో ఉండే ముసల్మాన్‌లతో ఏమి కలిసి ఉండగలరని ఆయన అడిగారు.

ఒక పత్రికా విలేఖరుల సమావేశంలో ఆయన మరొక మాట అన్నారు. భారతదేశంలో పరోపకారం కన్నా స్వార్థమే అధికంగా ఉందన్నారు. నాయకులలో చీలికలని గురించి కూడా ఆయన మాట్లాడారు. భారతదేశం గురించి ఆలోచించే వారు ఎవరని ఆయన బాధపడ్డారు.

పాకిస్తాన్ గురించి బాద్‌షాఖాన్ తమ అభిప్రాయాలు కొన్నిటిని వెలిబుచ్చారు. భారతదేశంలాగే అక్కడా బీదవారు మరింత బీదగానూ, డబ్బున్న వారు మరింత డబ్బున్నవారు గానూ మారిపోతున్నారన్నారు. పాకిస్తాన్‌లో కొందరు తనని స్వతంత్రోద్యమంలో పాల్గొన్నందుకే కోప్పడ్డారుట. బ్రిటిష్ పరిపాలన కిందనే మేము సంతోషంగా ఉండేవారం కదా, అన్నారుట!

## ప్రత్యేక దేశంకోసం కాదు

పఖ్తూనిస్తాన్ రాష్ట్రం కోసం తాము పోరాడటం లేదని బాద్‌షాఖాన్ శ్రోతలకి గుర్తు చేశారు. పాకిస్తాన్‌లో పంజాబు, బెంగాల్ వంటి రాష్ట్రంగా పఖ్తూనిస్తాన్‌నీ గుర్తించాలనిమాత్రమే కోరుతున్నామన్నారు. తమ ఆశయం త్వరలో నెరవేరబోతున్నదని అన్నారు. మాజీ పాక్ అధ్యక్షుడు శ్రీ అయూబ్‌ఖాన్ పఖ్తూన్ నాయకులతో మంతనాలు జరిపి దీనికి ఒప్పుకున్నారు. కాబట్టి తర్వాతి అధిపతి యాహ్యాఖాన్ కూడా తన ముందు వ్యక్తి మాట నిలబెట్టాలనే ఉద్దేశంతోనే అన్నారుట.

పఖ్తూనిస్తాన్‌ని కేవలం 'నార్త్ వెస్ట్ ఫ్రాంటియర్ ప్రావిన్స్' (లేక వాయవ్య ప్రాంత రాష్ట్రం) అనటం అక్కడి జనాన్ని కొండజాతి వారి కింద పరిగణించినట్లే కదా అన్నారు బాద్‌షాఖాన్. పఖ్తూనిస్తాన్ అనే పేరు అక్కడి జనం పఠాన్‌లని సూచించటానికే ఎన్నుకున్నామని ఆయన అన్నారు.

## కేంద్రం-రాష్ట్రం

సాధారణంగా రాష్ట్రాలు బలవంతంగానూ, కేంద్రం తక్కువ బలవంతంగనూ ఉండాలని బాద్‌షాఖాన్ అన్నారు. పఖ్తూనిస్తాన్ ప్రజలు బ్రిటన్‌లో ఉండే ప్రజాస్వామ్యం వంటిది కోరుకుంటున్నారని అన్నారు. పంజాబు ప్రజలు ఈ సంగతి గుర్తించకుండా అధికారాలు చలాయిస్తే విడి పఖ్తూనిస్తాన్ అవసరం అవవచ్చునన్నారు ఆయన. అయూబ్‌ఖాన్ సహకారంతో పఖ్తూనిస్తాన్ ఏర్పాటు [illegible] ఉండగా కొందరు పెట్టుబడిదారులు అల్లరులు సృష్టించి పాకిస్తాన్‌లో సైనిక పరిపాలన ఏర్పాట్లు చేశారని ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ చెప్పారు.

పరిస్థితి బాగుపడి శాంతిభద్రతలు ఏర్పడగానే ఎన్నికలు పెడతామని యాహ్యాఖాన్ అన్నారుట. ఇవి త్వరలో జరగాలని తాము కోరుకుంటున్నామనీ, తమ ఉద్యమం ఇంతకి మాత్రమే పరిమితమయి ఉందనీ సరిహద్దు గాంధిగారు అన్నారు.

## 'కూడిక కల్ల'

హిందూ—ముస్లిమ్ ఐకమత్యం లేనప్పుడు పాకిస్తాన్—భారతదేశాల కూడిక కల్ల అన్నారు బాద్‌షాఖాన్. అహింసా పద్ధతి పరమోత్తమ పద్ధతి అని తమ మతం—కాని, రెండు మతాల వారూ హింసా పద్ధతినే అవలంబిస్తున్నారు, అని ఆయన బాధపడ్డారు. ఇటీవల తాము చేసిన ఉపవాసం ప్రయోజనం ఏమిటి? గాంధి పద్ధతులతో, భారతదేశ ప్రజలకి తమ పరిస్థితి అంత బాగా లేదని చెప్పటమే.

సరిహద్దు గాంధి ధోరణి కాంగ్రెసు నాయకులకీ, అందులోనూ గాంధి మతంవల్ల లాభం పొందిన వారికీ ఎలా తోచింది? ప్రధానమంత్రి శ్రీమతి గాంధిగారు పర్యటన ఒకటి చేసి తమని విమర్శించే వారిని ఖండించారు. తమకి విరుద్ధంగా ఉద్యమం లేవదీస్తున్న వారిని వారు విమర్శించారు. ఈ ఉద్యమం స్వరూపం మారిందని వారు అన్నారు. గాంధిగారివద్ద నేర్చుకున్న ధర్మ సిద్ధాంతాలని పునరుద్ధరించాలని ఆమె చెప్పారు. సామాజిక జీవితంలో నీతి నియమాల స్థాయి పెరగాలని అన్నారు.

## 'హక్కు లేదు'

మహాత్మాగాంధిగారి ప్రాథమిక సిద్ధాంతాలకే ద్రోహం చేస్తున్న మనకి ఆయనపేర ప్రతిజ్ఞలు తీసుకునే హక్కు ఏమి ఉంది? అని ఒక రేడియో ప్రసంగంలో ప్రధానమంత్రి ఇంతకిముందే అడిగారు.

భారతదేశ ప్రధానమంత్రి అన్న ఈ మాటలని శ్రద్ధగా వినటం అవసరం. దేశంలోని పెద్ద పత్రికలని తీసుకుంటె, ప్రధానమంత్రి విధానాలని (బాంకుల జాతీయంతో సహా) విమర్శించే వార్తలు ఎన్ని కనిపిస్తాయి? 'స్టేట్స్‌మెన్' పత్రికలో శ్రీ పూరీ కార్టూనులు కనిపించటంలేదు. శ్రీ ఫ్రాంక్ మొరేస్ ఏవేవో విషయాలని గురించి రాస్తున్నారు, మేడమ్ గాంధిగారికి సంబంధించిన వాటిని మినహాయించి. అసలు జరుగుతున్న దేమిటంటె, మేడమ్ గాంధిగారు తమతో ఏకీభవించని వారితో నిర్విరామంగా పోట్లాట సాగిస్తున్నారు. ఈ పోట్లాట ని గురించి? బాంకుల జాతీయం గురించేనా? కాదు, రాష్ట్రపతి ఎన్నికని గురించి. న్యూఢిల్లీ పత్రిక 'పేట్రియాట్' అప్పుడే శ్రీ కామరాజుగారి మీద పెద్ద యుద్ధం మొదలుపెట్టింది. శ్రీ శాంతి ప్రసాద్ జెయిన్‌గారిపత్రిక 'టయిమ్స్ ఆఫ్ ఇండియా' మాజీ తమిళనాడు కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ సి. సుబ్రమణ్యం గారిని పూర్తిగా బలపరుస్తోంది. మేడమ్ గాంధి గారూ, మియాన్ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్‌గారూ, 'ప్రతిష్ఠ హత్య' గురించి ఫిర్యాదు చేస్తూ ఉంటారు. కొంతకాలం క్రితం శ్రీ మొరార్జీ దేశాయి మీద యువతురుష్కుడనబడే (ఒక మధ్య) వయస్కుడయిన తురుష్కుడు కాని భారతీయుడనే వ్యక్తి చేసిన యుద్ధం శ్రీ దేశాయి ప్రతిష్ఠని పెంచటానికి చేసినదా?

## తగ్గిస్తున్నది ఎవరు?

సామాజిక జీవితంలో స్థాయి పెరగాలని ప్రధానమంత్రి అన్నారు. ఇది చాలా నిజం అయితే ఈ స్థాయిని తగ్గిస్తున్నది ఎవరు?

మహాత్మాగాంధి గారి పేర ప్రతిజ్ఞలు చేస్తూ ఆయన సిద్ధాంతాలకి ద్రోహం చెయ్యరాదని ఆమె అన్నారు. ఇదీ నిజమే. కాని 'ద్రోహం చేసేది' ఎవరు?

ఇది మేడమ్ గాంధిగారు ఇంకా రాజకీయ నాయకులు కాని రోజుల్లోమాట. భారతదేశం పాకిస్తాన్‌కి ఇస్తానన్న రు. 55 కోట్లని ఎగకట్టి

ఉండా ఇచ్చి తీరాలని మహాత్మాగాంధీ గారు ఒక ఉపవాసం చేసి తమ మాట నెగ్గేట్లు చేసుకున్నారు. ఇది 1947 లో జరిగినది. సుమారు 20 ఏళ్ల తర్వాత భారత ప్రధాని శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి గారు తాష్కెంట్ ఒప్పందం మీద సంతకం పెట్టినందుకు ఆ ఒప్పందం వల్ల భారత దేశానికే నష్టం కలిగినప్పటికీ మాట తప్పకుండా ఉండటానికి భారతదేశం తాష్కెంట్ ఒప్పందాన్ని అమలు జరిపింది.

### సంతకం విలువ:

ఇక మేడమ్ గాంధీ గారేమో శ్రీ నీలం సంజీవ రెడ్డి గారి నామినేషన్ కాగితం మీద సంతకం పెట్టి తమ బాధ్యత నుంచి తప్పించుకున్నారు. ఇదంతా గాంధీ సిద్ధాంతాల ప్రకారం సామాజిక జీవితం స్థాయిని పెంచటమేనా? అన్నిదేశాల లోనూ, భారతదేశంలో మరీను, పైలేవారు ఒరవడి పెడ్తారు. వెల్లింగ్‌డన్ ప్రభువు వేసుకునే బూట్లనే అందరూ వేసుకొనే వారు ఎందరో, ఒకప్పుడు. బ్రిటన్‌లో రాజా, రాణి మొదలయిన వారి ఫాషన్లనే తక్కినవారు అనుసరిస్తూ ఉంటారు. ప్రతి ఆది వారం ఎలిజబెత్ రాణి చర్చిలో వెళ్ళి పాడుతుం దంటే ఎందరివో అదే పని చేయుద్దామనే కదా? బ్రిటిషు రోజుల్లో, పండిత నెహ్రూ రోజుల్లో సామాజిక జీవితంలో ఎన్నో నియమాలు ఉండేవి. పిటిష్మిస్టుని నాశనం చేస్తున్న వారే వాటిని గురించి మాట్లాడడం పెద్ద చిత్రం!

### బెక్సెర్ ఉదంతం

ఒకప్పుడు బ్రిటిషు (లేబర్) పార్టీ ప్రభుత్వంలో బెక్సెర్ అనే మంత్రి ఉండేవాడు. పోలీసు రిపోర్టుని అనుసరించి బ్రిటిషు ప్రధానమంత్రి ఒక పరిశోధన జరుపగా బెక్సెర్ ఒకరి వద్ద ఆరు సీసాలు విస్కీ తీసుకున్నట్లు రుజువు అయింది. బెక్సెర్ ఉద్యోగం ఊడింది ఆ తర్వాత ఆయన సంగతి ఎవరూ పట్టించుకోలేదు.

శ్రీ నెహ్రూ ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు శ్రీయుతులు షణ్ముఖంశెట్టి, టి. టి. కృష్ణమా చారి గారలు ఇద్దరూ లంచగొండితనం కోసం కాక విధానాలలో అనుసరించిన పద్ధతులు సక్రమంగా లేనందువల్ల రాజీనామా చేశారు.

శ్రీ కృష్ణమాచారి రెండవసారి పని మాను కున్నారంటే ఒక కేసుల తను వ్యవహారాల పరిశోధించబడటానికి అంగీకరించని కారణంవల్లనే శ్రీ కె. డి. మాలవియా మీద చేసిన పరిశోధ ఫలితాల వల్ల ఆయన ఉద్యోగం ఊడింది. ఆయన శ్రీ నెహ్రూకి స్నేహితుడు, అనుచరుడు.

### జగ్జీవన్ బాబు

ఇక నేటి పరిస్థితి — ప్రధానమంత్రిగారు బాబూ జగజీవనరామ్‌ని రక్షిస్తున్నారు, ఆయన 10 సంవత్సరాల ఆదాయం పన్ను వివరాలు కూడా దాఖలు చెయ్యకపోయినప్పటికీ, 4 సంవత్సరాల ఆస్తిపన్ను కట్టకపోయినప్పటికీ బాబూ జగజీవన రామ్‌గారు ప్రధానమంత్రిని బలపరిచారు కాబట్టి సంజాయిషీ చెప్పుకొనటం లేదు. రాజీనామా చెయ్యటం లేదు. మేడమ్ గాంధీగారు ఇప్పుడు ఆర్థిక మంత్రికూడా. బాబూజగజీవనరామ్‌కి వారు ఇస్తున్న రక్షణ ఇన్‌కమ్‌టాక్స్ శాఖకి హాని కలిగించవచ్చు.

ఆమె మాత్రం తను మీద ఉద్యమం గురించి మాట్లాడుతారు. ఆమె కూడా శాసనసభలో సంజాయిషీ చెప్పుకోవాలి కదా! ఇప్పుడు ఎన్నిక జగ్జీవన్ బాబూని వదులుకొనటం ఆమెకే మంచిది. ■

# దేవీ నవరాత్రములు

ప్రతి సంవత్సరమూ వచ్చే నవరాత్రోత్సవాల్లో వసంత నవరాత్రములు, శరన్నవరాత్రములు ముఖ్యమైనవి. వసంత నవరాత్రాలు సంవత్సరాది మొదలుకొని తొమ్మిది రోజులు. శరన్నవరాత్రాలు ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలుకొని తొమ్మిది రోజులు. ఈ శరన్నవరాత్రాలకే దేవీ నవరాత్రులనే వాడుక ఉన్నది. పదవరోజు విజయదశమి. ఈ పదిరోజులకూ కలిపే దసరా ఉత్సవాలని పేరు.

'ఆశ్వినె శుక్ల పక్షేతు
కా   నవరాత్రకం
ప్ర పదం క్రమేణైవ
యావద్వి నవమీ భవేత్,'

ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలుకొని నవమి వరకున్నూ నవరాత్రోత్సవం జరపాలని దీని భావం.

కాలస్థాన పరిస్థితులనుబట్టి చూస్తే ఇది చాలా ఉత్సాహకరమైన సమయం, వర్షాకాలంలో చినుకూ, చిత్తడిచేతా, వరదలవల్లా చికాకుతోనూ, భీతాహంతోనూ కలతపడుతూ వున్న జనుల మనస్సుకు శరత్కాలం ప్రశాంతిని కలిగిస్తుంది. పొలాలు పచ్చని సస్యాలతో కలకలలాడుతూ ఉంటాయి. ఆకాశం నిర్మలంగా వుండడంవల్ల వెన్నెల ఎంతో ఆనందాన్ని కలిగిస్తుంది.

తలపెట్టిన కార్యాలు నిర్విఘ్నంగా జరగడంకోసం జగదంబను ఎక్కువ నియమ నిష్ఠలతో ఈ నవరాత్రుల్లోనే పూజిస్తారు. ఈ తొమ్మిది రోజులూ ఉదయాన్నే స్నానాదులు నిర్వర్తించుకుని దేవీ పూజ జరుపుతారు. వారు పగలంతా ఉపవాసంవుండి రాత్రి స్నానానంతరం తిరిగీ దేవీపూజ చేసి, భోజనం చేస్తారు. ప్రతి రోజూ మధ్యాహ్నం కన్యకూ, ద్విజునికీ భోజనం పెట్టడమున్నూ ఉన్నది. ఇలా చేసినట్లయితే దేవి అనుగ్రహిస్తుందని విశ్వాసం. మర్నాడు క్షత్రియులు విజయయాత్రకు బయలుదేరితే విజయం నిశ్చయం. బిడ్డలకు ఆనాడే అక్షరాభ్యాసం చేయిస్తారు. అందువల్ల పిల్లలు విద్యావంతులు కాగలరనికూడా నమ్మకం.

జగదంబ విష్ణుమాయాస్వరూపిణి అని మార్కండేయ పురాణంలోని దేవీ మాహాత్మ్యంవల్ల తెలుస్తున్నది. పూర్వం సురథుడనే రాజు ఉండేవాడు. అతడు తన మంత్రి తలపెట్టిన ద్రోహంవల్ల ఒక యుద్ధంలో శత్రువులవల్ల పరాజయం పొంది అడవులలోకి పారిపోవలసి వచ్చింది. అక్కడ మేధ అనే ఒక మహాముని ఆశ్రమానికి పోయి తన అవస్థను విన్నవించుకున్నాడు. ఆ మునీశ్వరుడు సురథుణ్ణి ఆదరించి తన ఆశ్రమంలో ఆశ్రయమిచ్చాడు. ఆ ఆశ్రమంలో రాజునకు, తనవలెనే అనాథుడై ముని అనుగ్రహంవల్ల నివసిస్తున్న ఒక వైశ్యుడు కనబడ్డాడు. రాజు అతని వృత్తాంతాన్ని అడగ్గా, తాను గొప్ప ధనవంతుడననీ, ధనాశాపరులై తన భార్యా పుత్రులే తన్ను మోసం చెయ్యడంవల్లనూ ఇంటినుండి తరిమివెయ్యడం వల్లనూ తనకీగతి పట్టిందనీ, అంత ద్రోహం చేసినా వారిమీద తనకు మమకారం పోలేదనీకూడా చెప్పాడు. ఇది రాజుకు ఆశ్చర్యం కలిగించింది. తన సొత్తంతా అపహరించి, ఇంటినుండి తగిమివేసిన విశ్వాస ఘాతకులమీద ఇంకా మమత యేమిటి? అని ఆలోచన కలిగిందతనికి. 'ఈ విధమైన మమతకు కారణం యేమిటో సెలవివ్వా' అని ఆయన మహర్షిని అడిగాడు. దీనికంతా కారణం ఆ విష్ణుమాయయే అనీ, ఆ మాయ అనేకాలైన అవతారాలు ఎత్తుతూ వుంటూ, ప్రజలకు అనేక విధాలైన మమకారాలను కలిగిస్తూ వుంటుందనీ చెప్పాడు.

విష్ణుమాయ ఎత్తిన అవతారాల్లో ప్రధానమైనవి మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ అవతారాలు. జగదంబ అనే పేరు ఈ ముగ్గురికీ చెల్లుతుంది. ఈ నవరాత్రుల్లో మొదటి మూడుదినాలూ మహాకాళికీ, మధ్య మూడుదినాలూ మహాలక్ష్మీదేవికీ, చివరి మూడుదినాలూ మహాసరస్వతికీ ప్రత్యేకించబడినట్లుకూడా చెప్తారు.

దేవీ నవరాత్రాలు సాధారణంగా యుద్ధానికి సంబంధించే వుండేవని చెప్పవచ్చును. ఏమంటే — యుద్ధానికి సంబంధించిన దాన, భేద, దండోపాయాలకు క్రమంగా లక్ష్మి, సరస్వతి, దుర్గలు అధిదేవతలని తెలుసుకోవాలి—లక్ష్మీదేవిని పూజిస్తే దాన మూలంగా శత్రువును లొంగదీసుకోవచ్చు. సరస్వతీదేవిని పూజిస్తే బుద్ధివికాసంవల్ల భేదోపాయం తెలుసుకుని సమర్థంగా శత్రువును వశపరచుకోడం సాధ్యమవుతుంది. దాన భేదాలవల్ల ప్రయోజనం లేనప్పుడు దండోపాయమే శరణ్యం. దానికయి మహిషాసుర మర్దనియైన మహాకాళీ పూజ జరుపబడుతుంది. ఇందువల్ల దేవీ పూజలలో మహాకాళిపూజ ప్రధానంగా తోస్తున్నది,

ఈ నవరాత్రులలో బొమ్మలకొలువు పెట్టడం ఆచారమై ఉన్నది. అందులో రాజులూ, మంత్రులూ, సేనానులూ, యుద్ధభటులూ మొదలైనవారి ప్రతిమలు వుంటాయి. ఈ కొలువుకూడా ఈ ఉత్సవం యుద్ధయాత్రను సూచిస్తూ వున్నది.

ఉత్తరదేశంలో కాళీపూజకే ప్రాముఖ్యం వున్నది. బెంగాలులో ఇది ఎంతో వైభవంగా జరుపబడుతుంది. కాళీదేవికి జంతుబలిని ఇవ్వడంకూడా ఆచారంలో ఉన్నది. దక్షిణదేశంలో సాధారణంగా దేవీపూజ ప్రధానంగా ఉన్నది.

ఆంధ్ర ప్రాంతంలో చాలాచోట్ల ఈ నవరాత్రాల్లో ప్రత్యేకంగా సరస్వతీపూజ జరుపబడుతూ ఉంటుంది. ప్రతిదినమూ రాత్రి పూజ జరిగిన తర్వాత అందరికీ సరస్వతీ ప్రసాదం, చందన తాంబూలాలూ ఇవ్వడము ఆచారము. ప్రతిదినమూ హరికథా కాలక్షేపమో, ఉపన్యాసమో మరేదైనా ప్రదర్శనమో జరుగుతూ ఉంటుంది.

నవరాత్రి వ్రతానికి మరొక ప్రయోజనం వున్నట్లు కానవస్తుంది. వసంత ఋతువులోనూ, శరదృతువులోనూ నానా విధాలైన రోగాలూ వ్యాపిస్తూ వుంటాయి. అందువల్లనే యీ ఋతువులకు యమదంష్ట్రలని పేరు. ఈ రోగాలను పోగొట్ట

ప్రజలకు ఆయురారోగ్యాలను కలిగించుటకు ఈరెండు ఋతువుల ప్రారంభంలోనూ నవరాత్రివ్రతం ఆచరించవలెనని దేవీ భాగవతాన్నిబట్టి తెలుస్తూ ఉన్నది.

దేవీ నవరాత్రులలోని బొమ్మలకొలువు ఒక వినోద ప్రదర్శనంగా తయారయిందిప్పుడు. దానికోసం విలువైన బొమ్మల్ని పెట్టెల్లో భద్రంచేసి వుంచుతారు. ప్రతి సంవత్సరం కొత్త బొమ్మల్ని కొంటూ బొమ్మల బలగాన్ని వృద్ధిపరుస్తారు. బాలికలకు దీనియందు ఆసక్తి యెక్కువ. బాలికలమూలంగా ఇంట్లోని మహిళలు ఎక్కువ శ్రద్ధను చూపుతారు. బొమ్మల కొలువుంచే స్థలాన్ని బాగా రంగుల కాగితాల తోరణాలతో అలంకరించి, బల్లలను మెట్లుమెట్లుగా అమర్చి, వాటిపైని తెల్లని వస్త్రాలను పరిచి, ఆ మెట్లమీద బొమ్మలను ఉంచుతారు. ఈ అమరికలో మహిళల నేర్పు అంతా వ్యక్తమవుతూ ఉంటుంది. దీనికి పెళ్లిచేసినంత ఆర్భాటం చెయ్యడం కద్దు. ఆహ్వాన పత్రికలను అచ్చువేసి బంధుమిత్రులకు పంపుతూ స్వయంగా కూడా ప్రతి సాయంత్రం ఆహ్వానిస్తారు. రోజుకొక పిండివంటచేసి బొమ్మలకు నైవేద్యంపెట్టి, సాయంకాలం పేరంటానికి వచ్చిన వారికందరికీ ఫలతాంబూలాలతో పాటు ఇస్తారు. వీటిని సంచీలలో పెట్టి యివ్వడం నాగరిక లక్షణం! ప్రతి సాయంత్రమూ పాటలతోనూ, వాద్యాలతోనూ, రంగురంగుల విద్యుద్దీపాలతోనూ కొలువు ఎంతో శోభాయమానంగా వుంటుంది. ఆ ఉత్సాహంతో యువతీమణులూ, బాలికలూ రంగురంగుల దుస్తులను ధరించి సీతాకోకచిలకల్లాగ కన్నులపండువు కలిగిస్తూ వుంటారు.

ఈ సమయంలోనే పూర్వం చక్రవర్తులూ, మహారాజులూ కొలువుతీర్చి, వారివారి శక్తిసామర్థ్యాల ననుసరించి విద్వాంసులనూ, కవులనూ, తక్కిన కళాకారులనూ గౌరవించి, పారితోషికాలివ్వడం జరుగుతూ వుండేది. రాయలకాలంలో యీ ఉత్సవాలు విజయ (విద్యా) నగరంలో మహావైభవంగా జరిగేవట! ఇప్పటికీ మైసూరులోని రాజభవనంలో ఏటేటా ఈ ఉత్సవాలు కన్నుల పండువుగా జరుగుతూ వుంటాయి. వీటిని చూడడానికి పలుప్రాంతాలనుంచి అసంఖ్యాకంగా జనులు అక్కడికి వస్తూ ఉంటారు.

—అంగీరస




అలనాడు బ్రహ్మ మట్టితో మానవ సృష్టి అంతా చేశాడని పెద్దవాళ్లు కథలు చెపుతూ వుంటారు... బ్రహ్మ మనిషి తలా, కాళ్లూ చేతులూ చేశాడేగాని అవి విరిగిపోకుండా చేయలేకపోయాడు ... అవి విరిగినప్పుడు పుత్తూరు వైద్యుల దగ్గిరికి, వెళ్లాల్సిందేగాని బ్రహ్మమాత్రం 'రిపేర్‌వర్క్' పెట్టుకోలేదు ... కేవలం సృష్టించడంవరకే తనపని అన్నాడు... ఈ విషయంలో ఆయన మానవకోటిని చిన్నచూపు చూశాడనే చెప్పాలి ... పోనీ సృష్టి తనుచేసి, 'రిపేర్‌వర్క్'కి ఒక అసిస్టెంట్‌ని పెట్టుకుంటే ఈరోజు యిన్ని హాస్పిటల్సూ వుండేవికావు యం. బి., బి యస్. సీట్లకింత డిమాండూ వుండేది కాదు...

మానవులకు ఆ కొరత బ్రహ్మవల్ల తీరకపోయినా, మా కొలువు బొమ్మలకు ఆ కొరత లేకుండా నేను ప్రతిసంవత్సరమూ 'ఫ్రాక్చర్' అయినవాటినీ, 'యాక్సిడెంట్ల'లో తలలూ కాళ్లూ, చేతులూ, విరిగినవాటినీ, వేరేగాతీసి. తక్షణం తలలు లేని వాళ్లకు తలలూ (వాళ్లవే లెండి) చేతులు లేనివాళ్లకు చేతులూ, చర్మం పెట్లినవాళ్లను చర్మం (రంగులెండి) వగైరా కావలసినవన్నీ, తగిలించి బొమ్మలన్నిటినీ 'రిపేర్'చేసి కొత్త బొమ్మలతోబాటు పాతవాటినీ తీర్చిదిద్దుతూంటాను. అయినా విధి నెవరు తప్పించగలరు! అన్నట్లు కొన్నిటిని రిపేర్ చేయలేకపోతూంటాను... ఉదాహరణకు; ఒకడు ఆవుకు నీళ్లు పెడుతున్నాడు ... తొట్టి వుంది. ఆవులేదు ... వాడి తల కూడా లేదు ... నీళ్లుపడుతూ కూర్చున్న వాడి చెయ్యి మాత్రం తొట్టిదగ్గిరికి చాచి వుంది...వాడి తలకోసం బొమ్మల పెట్టెలన్నీ గాలించాం ... ఎక్కడా దొరకలా... యింకా .. మరెవరివో తలలో దొరికాయి... ఆ తలలెవరివో తెలుసుకోడానికి ఆ తలల్లేని వాళ్లకోసం గాలించడం మొదలెట్టాం... కొన్ని దొరికాయి. కాని ఆవుకు నీళ్లు పట్టేవాడి తలా, ఆవూ రెండూ దొరకలా...

ప్రతి సంవత్సరం ఏదో ఒక వూరూ దానికి రోడ్లూ అవీ వేస్తుంటాం గనక రోడ్డుమీద ఒక చెత్తబండినీ దాన్ని తోలేవాడినీ పెడుతూంటాం... ఈ సంవత్సరం ఆ చెత్తబండివాడు బండిమీద కనిపించలా... ఏమైనాడు!...వెతికాం—ఊహూ...! సరే, ఏ బీడీకొట్టుకో వెళ్లి వుంటాడనుకుంటాల్లే కొలువు చూట్టానికి వచ్చినవాళ్లు... అని సమాధానపడి, రోడ్లు వూడ్చేవాడొకడుంటే వాడిని తెచ్చి ఆ బండి పక్కన నిలబెట్టాం...చేతులో చీపురుతో వచ్చిపోయే వాళ్లని చూస్తూ బండి పక్కన నిలబడ్డాడు...

పాపం ఒక పెళ్లి ఊరేగింపు ... ఆ బొమ్మల సెట్టులో యిరవైఅయిదు

బొమ్మలంటాయి: పూలహారాలతో అలంకరించిన కార్లో కూర్చున్న నూతన దంపతులూ, వాళ్ల తల్లిదండ్రులూ, అత్తమామలూ పిల్లల్ని ఎత్తుకుని పేరంటాళ్లతోనూ, వారివారి బంధుకోటితోనూ కారు వెనక నడుస్తూంటే, మేళగాళ్లు ముందు వెళుతూంటే పెట్రోమాక్స్‌లైట్లు తల మీద పెట్టుకున్నవాళ్లు దారి చూపుతూంటే ముచ్చట్లాడుతూ, నవ్వుతూ పేలుతూ నడుస్తున్న ఆ పెళ్లివాళ్లంతా పోయిన సంవత్సరం కొందరూ, ఈ సంవత్సరం అందరూ యాక్సిడెంట్ల పాలయినారు ... కార్లోవున్న నూతన దంపతులు పూలమాలంతో చెక్కుచెదరకుండా కార్లోనే వున్నారు ... వాళ్లకే ప్రమాదం కలగలేదు—డ్రైవర్ చేతుల్లో స్టీరింగ్‌తో సహా వేరేగా కనిపించాడు! ... అరెరె! యితను పెళ్లి సెట్టులో డ్రైవర్ గదా! యిట్లా ఎందుకు పడి వున్నాడు!... అని మేమంతా ఆశ్చర్యపడుతూంటే అతని పక్కనే పెళ్లి కూతురు తల్లిదండ్రులూ తదితర బంధు కోటీ కాళ్లు విరిగి కదల్లేని స్థితిలో పడివున్నారు ... మేళగాళ్లంతా ప్రమాదమైన యాక్సిడెంట్ల పాలైనారు...అతనికి చేతులో వున్న సన్నాయితోబాటు చెయ్యీ విరిగింది ... డోలు వాయించే వాడి డోలుతో బాటు తల కూడా పగిలింది...తాళం వేసేవాడి తల వుంది, కాళ్లు పోయాయి...బూరగ వూదే వాడి బుగ్గలు మాత్రం నిగనిగలాడుతూ




వున్నాయి...అంతా పోయాక, యిక అగన్నాక్కణ్ణి ఆ కారు పక్కన నిలబెడితే ఏం బావుంటుందీ!...ప్చ్... లాభంలేదు... ఆ సెట్టు తీసి మూలపడేశాం...అందులో చావు తప్పి కన్ను లొట్టబోయి బ్రతుకు జీవుడా అంటూ ఓ మూల కనిపించిన యిద్దరు ముగ్గురు పెళ్లివారిని తీసుకెళ్లి ఓ దేవాలయం ముందు నిలబెట్టాం గుంపులో గోవిందా అన్నట్లుంటారని...

ఒక 'ట్రాఫిక్' పోలీసు పాపం... మూడు సంవత్సరాలుగా చేతులో 'స్టాప్ ప్లేటు'తో వచ్చేపోయే కార్లను ఆపుతూ, పంపుతూ వున్నాడు కొలువులో. అలాంటి వాడు యీ సంవత్సరం ఘోర ప్రమాదానికి గురియైనాడు...కాళ్లు రెండు పట్టుబట్టలలోనుంచి మోకాళ్లదాకా విరిగాయి—ముక్కు చదరమైంది. పక్కకు చాపినచెయ్యి చాపినట్లే ఉంది. స్టాప్ ప్లేట్ పట్టుకున్న చెయ్యి కాస్త విరిగింది...లోపల యినపతీగ ఉన్నందువల్ల కంట్రోల్లేకుండా మణికట్టు దగ్గర్నుంచి ఎటు తిప్పితే అటు తిరగడం మొదలెట్టింది...అలాంటి పోలీసు 'ట్రాఫిక్ కంట్రోల్' చెయ్యబోతే అతనిగతే అందరికీ పడుతుందని తక్షణం అతన్ని సర్జరీ వార్డుకి తరలించాం...

రక్తి, భక్తి, ముక్తి, అన్న పదాలకు తాత్పర్యంలాగా ఒకవైపు గోపికావస్త్రాపహరణం, రెండోవేపు గజేంద్రమోక్షం, మధ్యలో ఆదిశంకరులు శిష్యకోటితో కూర్చునివుండడం, మూడూ వరసనా ప్రతిసంవత్సరమూ కొలువులో అమర్చడం జరుగుతోంది. వీటిల్లో గజేంద్రమోక్షం చాలా సున్నితమైంది. అందుకే చాలా భద్రంగానే చూస్తుంటాం దాన్ని...కాని యీ సారి మా పసిపిల్లవాడు దాన్ని పెట్టెలోనుంచి చటుక్కున తీయడంతో ఒంటికాలిమీద నిలబడ్డ గజేంద్రుడు 'బేలెన్స్' తప్పి కిందపడి కాలుదగ్గర్నుంచి రెండుగా చీలాడు—అరెరె! రెండో కాలు ఏదీ! అదీ విరిగిందా! అంటూ ఖంగారుపడ్డాం...తీరాచూస్తే, రెండో కాలు మొసలినోట్లో 'సేఫ్'గా వుంది... ఏనుగ రెండుగా చీలడంతో అతికించడం అతికించి పక్కకి








# మరో ప్రపంచం

వార్డ్‌కి మళ్లించాం ఏనుగను... 'సర్జరీ వార్డ్'కి 'హెడ్' మా చెల్లెలి కొడుకు చంద్రూ. వాడికి అసిస్టెంట్‌మా ఆడబిడ్డ మనవడు రామశాయి: — చంద్రూకి విరిగిన బొమ్మలు అతికించడం అంటే విపరీతమైన సరదా ... వాడి కెంత సరదా అంటే కొన్ని మంచి బొమ్మలుకూడా 'సైలెంట్'గా విరగ్గొట్టి అతికిస్తూంటాడని చంద్రూమీద కోపం వచ్చినప్పుడు రామశాయి చెబుతూంటాడు నాతో రహస్యంగా...రామశాయి గమ్ముగా మట్టి అందిస్తూంటే చంద్రూ అతి నైపుణ్యంగా 'సర్జన్'లాగా పోజు పెట్టి బొమ్మలు అతికిస్తూంటాడు...వాడే తీసుకెళ్లాడు ఏనుగును బ్రతికిస్తానని...

మరుక్షణం ఆ పెట్టెతీసి అవతల పెట్టడంలో మొసలి గూడా కిందపడి మూడు ముక్కలైంది...కాని గజేంద్రుడి కాలుమాత్రం వదల్లేదు ... మొత్తానికి మొసలి చచ్చీ సాధించా ననిపించుకుంది... యిక ఆ పెట్టెలో మిగిలిందల్లా కాస్త ఎత్తుగావున్న చిన్నకొండ, ఆ కొండపైన శ్రీదేవీ, భూదేవీలతో కొండలోకి గుచ్చివున్న యినప చువ్వమీద నిలబడ్డ గరుత్మంతుడి వీపుమీద కూర్చుని, గడమీదెక్కి సాముచేసే వాడిలాగా తనెప్పుడు కిందపడతానో అనే భయంతో యిద్దరి భార్యల నడుములూ రెండుచేతులతో గట్టిగా పట్టుకుని బెదిరిపోయి చూస్తున్నాడు బదరీ నారాయణుడు...

ఆ పెట్టె రిపేరుచేసే ప్రయోజనం లేదని తీసి ఓ మూల పడేశాం ... యిక ప్రతి సంవత్సరమూ మాకు 'న్యూసెన్స్'గా కనిపించే బొమ్మలపెట్టె ఒకటుంది ... అదే గోపికా వస్త్రాపహరణం...

మొత్తం ఎనిమిదిమంది గోపికలున్నారు ... ఆ దే రెం డి బట్టల్లేకుండానే ... చుట్టూవున్న చీరలతో చెట్టుమీద కృష్ణుడు మురళి వాయిస్తూ కూర్చున్నాడు...గోపికల వంపు సొంపుల్లో మట్టి మరి కాస్త జాస్తి పెట్టాడు...ఆ బొమ్మలు చేసిన బ్రహ్మ ... మా యింట్లో పని చేసే వాళ్ళంతా అటూ యిటూ వస్తూ పోతూ ఆ గోపికలందర్నీ తనివితీరా

కార్టూను గేయాలు

* శిశిర *

(గత సంచిక తరువాయి)

21. జన్నిదాల శాస్త్రిపాప
సాహిత్యపు టాయాసిస్సు
పెన్నులోన తేనెపోసి
ఊచు పాఠకుని శిరస్సు.




22. త్రిపురనేని హరుడై తే
నుదుటిమీది కన్ను కట్టి
బ్రహ్మగాళ్ళనందరినీ
భస్మించును వరస పెట్టి.




23. గోల్డుపాటి కామేశుడు
మోల్డుచేసి మొలియర్ని
బోల్డుగా హుషారుగా వూసి
బోల్డుహాస్య మెగురబోసె.

(ఇంకా ఉంది)




# మరో ప్రపంచం

చూస్తూ వేడినిట్టూర్పులు విడుస్తుంటారు... వాళ్లల్లో పెళ్లికాని యాభైయేండ్ల నాగప్ప ఆ గోపికల్ని రోజుకు రెండుసార్లు తుడుస్తుంటాడు దుమ్ము పట్టిందని... గోపికలంతా కోనేట్లో స్నానం చేస్తూన్నారు ... ఆ కోనేటికి చుట్టూ మెట్లున్నాయి ... ఆ మెట్లమీద కొందరు గోపికలు కూర్చుని కృష్ణుడికి నమస్కారం చేస్తున్నారు...కొందరు నిలబడి చేతులెత్తి నమస్కరిస్తున్నారు... గోపికల పెట్టె తీసుకెళ్లి మిగతా బొమ్మలవెనక దాచాం ... అయినా పనిచేసే మగపురుషులు ఆవేళ తిరగడం మాని కొలువుపోజానా బయటికి తీయరాదని వాళ్లందర్నీ 'సెల్లార్' గదిలో వుంచాం...

ఆ బొమ్మ పెట్టె లోపల దాచేసరికి పనివాళ్లల్లో ఉత్సాహం తగ్గింది ... అంతకుముందు గోపికల్ని చూస్తూ మేం అడక్కపోయినా అన్ని పనుల్లోనూ సహాయపడుతుండిన నాగప్ప పనివాళ్ళు పిల్చినా పలకడంలేదు ...

ప్రస్తుతం సినిమాల్లో 'ఎక్స్ట్రా ఎంటర్టెయిన్మెంట్' ఏ మోతాదులో వుందో, ఆ మోతాదులో కనిపిస్తున్న గోపికల్ని పనివాళ్లకోసం తీసి బయట పెట్టి వాళ్లకుత్సాహం కలిగించి పని చేయించే స్థితికి దిగజారడం యిష్టంలేక కొలువుకు సంబంధించిన పన్లన్నీ నేనూ మా చెల్లెళ్లూ కష్టపడి చేస్తున్నాం...

సినిమాల్లో పౌరాణికాలూ జానపదాలూ సాంఘికాలూ వున్నయ్యి, గోపికావస్త్రాపహరణం దగ్గర్నుంచి అపోలో 11 దాకా అన్నీ వున్నాయి మాయింటి కొలువులో...

అపోలోవాడు తీసిన భూమి గుండ్రంగా చంద్రుడికంటే అందంగా కనిపిస్తోంది. ఆ ఫోటోలు నాసావారు తెప్పించే 'లైఫ్' మేగజైన్లో చూసి బొమ్మలుపెట్టిన మెట్లవెనకవున్న వెండితెరలాంటి దానిమీద

అపోలోనుండి తీసిన భూగోళాన్ని అదే విధంగా పెయింట్ చేయించాను... 'అందులో సౌత్ ఆఫ్రికా సరిగా కనిపించడం లేదమ్మా' అన్నాడు మావాడు...సౌత్ ఆఫ్రికాను సరిచేసి పార్వతీ పరమేశ్వరుల్ని వారబ్బాయి విఘ్నేశ్వరుడితోసహా భూమండలం మధ్యలో కూర్చోబెట్టాం—మిగతా చిల్లర దేవతలంతా వారికి దిగువ మెట్ల మీద కొలువు దీరారు...

మరొకగదిలో మా అమ్మాయివుంది... (మధురమీనాక్షి లెండి) – రెండువేపులా లక్ష్మి సరస్వతులతో కాళ్లదగ్గరున్న గణపతితో ముందున్న పీటమీద భర్త నటరాజస్వామి నాట్యమాడుతూంటే అలా అందంగా ఆనందంగా చేతులో చిలకతో పద్మాలుగేండ్లుగా అక్కడే నిలబడి వుందామె...ఆ గదినే అంతా మీనాక్షి హాల్ అంటుంటాం...యీసారి మా మీనాక్షి హాల్లో మైసూర్ బృందావనగార్డెన్స్. కృష్ణరాజసాగరా 'డామ్'తోసహా 'మినియేచర్' రూపంలో తయారుచేశాం రంగు రంగుల విద్యుద్దీపాలతోనూ ఫౌంటేన్స్ తోనూ, చిన్నచిన్న మంటపాలతోనూ అందమైన ఫ్లవర్ బెడ్సుతోనూ చూడ ముచ్చటగావుంది. "సాక్షాత్తూ అపర విశ్వేశ్వరయ్యలాగా బృందావన్ గార్డెన్స్ 'ఎఫెక్టు' వున్నదున్నట్లు తీసుకొచ్చావే !" ...అంటూ మావారే ఆశ్చర్యపడిపోతూ మెచ్చుకున్నారు మరి...నిజంగా యిది 2 వ ప్రతిసృష్టే !...' అంటున్నారు చూసిన వాళ్ళంతా...యింకా పూర్తి అయితే కొలువు చాలా బాగుంటుంది లెండి... ఆ గండాగండి...అవతల హాల్లో ఏదో బొమ్మ కింద పడేశారు...అరెరే!— రిక్షా వాడు కింద పడ్డాడు. పాపం మోచెయ్యి దాకా విరిగింది...అన్నట్లు రిక్షాలో కూర్చున్న బరువైన పంజాబీ దంపతులు కూడా బోర్లాపడ్డారే !... క్షమించండి... వాళ్లకు 'ఫస్టెయిడ్' యివ్వాలి...

వుం... మ ... ● 

# 'ఆదినుండి అలవాటు లేదు - వాణిశ్రీ

నే వెళ్ళిన కాసేపటికి కరెక్టుగా ఆరు గంటలకి రోజ్‌బనారస్ చీరెకట్టి, వెల్వెట్ జాకెట్టు ధరించి వాణిశ్రీ వచ్చింది. రాగానే 'చాలా థ్యాంక్స్. నాకు జ్వరం వచ్చిందని మీరు వ్రాసారుగా, నాకు అభిమానులవద్దనుండి బోలెడన్ని ఉత్తరాలువచ్చాయి' అన్నది.

మిమ్మల్నికొన్ని ప్రశ్నలు వేస్తాను. సమాధానం యివ్వగలరా ? అని అడిగాను.

ఆమె సరేనంది.

ప్రశ్న: దసరా పండుగకు 'బొమ్మల కొలువు' పెడతారా ?

జ: మాకు ఆనవాయితీ లేదు: పేరంటాలకు వెళ్లడమే తప్ప మా యింట్లో బొమ్మలను పెట్టడం ఆదినుండి అలవాటు లేదు.

ప్ర: మీ యింట్లో రకరకాలయిన బొమ్మలున్నాయే ?

జ: వాటిని అక్కడక్కడ అమర్చి, వాటికేసి చూస్తుంటాము.

ప్ర: షూటింగు లేనప్పుడు మీరేం చేస్తారు ?

జ: ఇంటిని శుభ్రపరుస్తాను, వంట చేస్తాను.

ప్ర: ఇంతపెద్ద యింట్లో మీ రూం చాలా చిన్నదిగా వుందే ?

జ: నేను వారాని కొకసారి గదిని మారుస్తాను, అందులో నాకొక ఆనందం; ప్రతిరోజూ మొక్కలకు నీళ్లు పోస్తాను. రోజా కొక కొత్త మొక్కను తీసికొచ్చి యింటిచుట్టూ అందంగా అలంకరిస్తాను.

ప్ర: ఉదయం ఎన్నిగంటలకు నిద్రలేస్తారు? లేవగానే ఏం చేస్తారు?

జ: నేను ప్రతిరోజూ ఉదయం అయిదుగంటలకల్లా నిద్రలేచి, వెంకటేశ్వరుడి పటానికి మ్రొక్కి ఆపైన పూజ్య బాపుజీ, నెహ్రూ, లాల్‌బహదూర్ శాస్త్రిగార్లకు అంజలి ఘటిస్తాను; ఒకగ్లాసు నిమ్మరసం తీసుకుంటాను. ఆపైన షూటింగుకు వెళ్తాను

"బొమ్మల్ని అక్కడక్కడ అమర్చి వాటికేసి చూస్తుంటాము."

ప్ర: మీరు షాపింగుకు వెళ్తారా? సాధారణంగా ఏం కొంటారు ?

జ: నేను షాపింగుకు వెళ్లినా, సినిమాకు వెళ్లినా మా అక్కయ్యతోనే. ఆమే నా ప్రాణం. నేనుగా దేన్ని కొనను. మా అక్కయ్య సెలెక్టు చేస్తే నేను ఓకే చేస్తాను.

ప్ర: మీరు హిందిచిత్రాంలో నటిస్తారని ఆమధ్య పత్రికలో వ్రాసాను. ఆ వివరాలను చెప్పగలరా ?

జ: మూడు చిత్రాల అగ్రిమెంట్లపై సంతకం పెట్టాను వాళ్ళ నెలకు 15 రోజులు కావాలన్నారు ఇప్పుడు తెలుగు తమిళచిత్రాల వత్తిడి ఎక్కువగా వుండడంవల్ల మూడు మాసాల తర్వాత చూద్దామని చెప్పాను.

ప్ర: మీ అభిమానులకు మీరేమైనా చెప్పదలిచారా ?

జ: నాపై చూపిస్తున్న అభిమానం ఆదరణలను నిలుపుకునేందుకు కృషిచేసేందుకు ప్రయత్నిస్తాను ప్రేక్షకుల అభిమానమే నా జీవితపు వెలుగుబాట.

ఇంటర్వ్యూ: శ్రీనివాస్

వార్తలలో వనితలు

## శ్రీమతి ఆంగీబ్రూక్స్

ఐక్యరాజ్యసమితి కార్యదర్శిని గురించి అందరికీ తెలుసుగాని అధ్యక్ష పదవిని అలంకరించే వ్యక్తిని గురించి అంతగా పట్టించుకోరు! ఈ పదవి మొత్తంమీద అలంకరణకే ఉద్దేశించబడిందే కాబట్టి అయిఉండవచ్చు... కొన్ని సంవత్సరాల క్రితం భారతదేశం నుంచి శ్రీనెహ్రూ సహోదరి శ్రీమతి విజయలక్ష్మి పండిట్‌ని ఈ పదవికి ఎన్నుకున్నారు. ఈ సంవత్సరం ఎన్నుకోబడిన ఆంగీ బ్రూక్స్‌కి 41 సంవత్సరాలు ఆవిడ లయిబీరియాకి చెందిన వ్యక్తి. పెద్ద లాయరుగా, తమ దేశం 'ఎసిస్టెంట్ సెక్రెటరీ ఆఫ్ స్టేట్'గా పేరుపొందిన మహిళ.

ఆంగీబ్రూక్స్ తండ్రి ఒక బాప్టిస్ట్ ఫాదరీ. తొమ్మిదిమంది పిల్లలు కల ఆయన కుటుంబ భారాన్ని భరించలేక కూతురు పెంపకాన్ని ఒక దర్జీ ఆవిడకి వప్పగించాడు.

చిన్నప్పుడే వివాహం అయినప్పటికీ ఆంగీబ్రూక్స్ పెళ్లి నిలవలేదు. విడాకులు అయినతర్వాత ఆవిడ అంట్లు పనులు, రజకవృత్తి చేసి ఆ వచ్చిన సంపాదనతో విద్యాభ్యాసం చేసుకున్నారు. అమెరికాలో, బ్రిటన్‌లో డిగ్రీలు పుచ్చుకున్నారు.

ఆంగీబ్రూక్స్‌కి ఇద్దరు కొడుకులు పుట్టారు.



అయితే ఆమె 19 మంది పిల్లలని దత్తత చేసుకుని పోషిస్తున్నారు!

వీరు కాక 47 మంది పిల్లల పెంపకం భారాన్నికూడా ఆమె వహిస్తున్నారు!!

## శ్రీమతి గాంధీ

లాయాజింకిన్ అనే బ్రిటిష్ పత్రికా విలేఖరి ఒకామె శ్రీమతి గాంధీ మొదటిసారి ప్రధానమంత్రిగా ఎన్నుకోబడినప్పుడు 'మాంచెస్టర్ గార్డియన్' పత్రికలో ఇలా రాసింది—'ఆ ఉద్యోగానికి సరయిన మొగవానిగా ఆమెని



ఎన్నుకున్నారు,' గత రెండేళ్ల చరిత్ర ఈ వాక్యంలోని నిజాన్ని చక్కగా నిరూపించింది...

## శ్రీమతి గిరి

శ్రీ యశ్వంతరావ్ బల్వంతరావ్ చవాన్‌గారి సతీమణిని గురించిన వార్తలు ఎన్నివెలువడుతూ ఉంటాయి? శ్రీమతి జగజీవనరామ్‌గారి బొమ్మలు ఎన్ని పత్రికలలో కనిపిస్తాయి? అలాగే క్రమంగా అలంకారంతో సమానమయిపోయిన రాష్ట్రపతి పదవిని అలంకరించిన సుప్రసిద్ధ మేధావి సర్వేపల్లి రాధాకృష్ణన్ సతీమణి కూడా ఇంచుమించు అజ్ఞాతంగానే ఉండేవారు—వార్తా ప్రచారానికి



సంబంధించి వంతవరకూ. అంటే, భారతదేశంలో రాజకీయ నాయకుల భార్యలకి ప్రత్యేక స్థానం ఉన్నట్లు కనిపించదన్నమాట. 'రాజకీయ నాయకులు' అన్నప్పుడు పెద్ద పదవులను అలంకరించే వారిని కూడా ఆ వర్గంలో చేర్చవచ్చు.

శ్రీమతి సరస్వతిబాయి గిరి సంగతి వేరు. వారు కేవలం రాష్ట్రపతి వరాహగిరి వేంకటగిరిగారి సతీమణిగా కాక ఒక ప్రత్యేకవ్యక్తిగా గుర్తింపబడ్డారు. గాయకురాలుగా, కవయిత్రిగా, సాంఘిక నాయకురాలుగా తరచుగా వార్తలలో పేర్కొనబడుతున్నారు. వారి ఉపన్యాసధోరణి కూడా దీనికొక తార్కాణం.

## శ్రీమతి గోల్డా మెయిర్

* అరబ్బుదేశాల సేనల బలం 4.0 లక్షలు.

ఇస్రాయిల్ సేనల బలం 2·9 లక్షలు.

* అరబ్బుదేశాల టాంకుల సంఖ్య 2200.

ఇస్రాయిల్ టాంకుల సంఖ్య 1000.

* అరబ్బుదేశాల విమానదళంలో 645 విమానాలు ఉంటే,

ఇస్రాయిల్‌కి 195 మాత్రమే ఉన్నాయి.

(చివరి పేజీ చూడండి)

## చుట్టరికాల తారుమారు!

ఒక అన్నదమ్ముల జంట మరో అక్కచెల్లెళ్ళ జంటను పెళ్ళి చేసుకున్నారట. అంతవరకూ వినముచ్చటగానే వుంది. అయితే అందులో పెళ్ళికొడుకుల తండ్రి తన కోడళ్ళ తల్లిని వివాహం చేసుకున్నాడట. దీనివల్ల చెప్పవలసిన చుట్టరికమంతా గిర్రున బొంగరంలా తిరిగి పోయిందట. పెళ్ళికూతుళ్ళు తమ తల్లికి కోడళ్ళా? మామగారికి కూతుళ్ళా! భర్తలకు చెల్లెళ్ళా! ఏమో వట్టు!!! ఇది వార్సాలో జరిగింది. ఎక్స్‌ప్రెస్ వాస్ జర్నీ అనే పత్రిక ప్రకటించిందట.

## సినిమాలో నవ్వు!

జబల్పూర్‌లోని ఒక సినిమా హాలులోని ప్రేక్షకులలో ఒకవ్యక్తి నవ్వి—ఇంకా నవ్వి, మళ్లీ




మళ్ళీ నవ్వి నవ్వుతూనే చనిపోయాడట ఈ వ్యక్తి. పాపం ఎవరో కూడా గుర్తు పట్టలేకపోయారట.

## స్పిరిట్ ప్రమాదం

అలహాబాదు విమానదళంతో పని చేస్తున్న సిప్పి యూసుఫ్ అనే ఒకతను అతని స్నేహితులతో నలుగురు కలిసి, స్పిరిట్ తాగారట. వారైదుగురిలో నాయర్ అనే అతను మాత్రం కొన్ని చప్పరించి ''యాక్కరాలి'' బాగా లేదంటూ వుమ్మేశాడట. తత్ఫలితంగా అతనొక్కడూ చావులోంచి తప్పించుకున్నాడట. మిగతా నల్గురు చనిపోయారు. తప్పు చపలత్వం అంతైతే ఎట్లా?

*  *




## ప్రియుని కాల్చి చంపిన కాలేజ్ గర్ల్

మిస్ షమీమ్ రహ్మాని అనే సైన్సు గ్రాడ్యుయేట్ తన ప్రియుడైన డాక్టర్ హరివాన్స్ [illegible] కాల్చి చంపేసింది. ఇది జూలై 11వ తేదీ (1968 సంవత్సరం) రాత్రి జరిగింది. ఆమెకు యిప్పుడు కోర్టు యావజ్జీవ కారాగార శిక్ష విధించింది. తప్పు సాక్ష్యం చెప్పి చెల్లెలును రక్షింప చూసినందుకు ఆమె అన్న అనీస్ అహ్మద్ రహ్మాన్‌కు మూడేళ్ళ కారాగారశిక్ష విధించింది. తన శిక్షను వింటున్నప్పుడు ఆమె నిర్వికారంగా మౌనంగా వుందట. అన్నగారి చేతులకు బేడీలు వేసినప్పుడు మాత్రం ఘోరుమని ఏడ్చిందట. జీవితంలో విరక్తి, నిస్పృహ చెంది తెగించి, ఆమె ఈ పని(హత్య) చేసిందని అంటున్నారు.

## 76 ఏళ్ళ హాలీవుడ్ తార

సినీ జీవితంనుంచి విరమించిన 26 సంవత్సరాల తరువాత హాలీవుడ్ నటి మేవెస్ట్ తిరిగి సినిమాలో నటించ ప్రారంభించిందట. రెండున్నరదశాబ్దాల క్రితం తన సినీ జీవితం గుర్తుకు తెచ్చుకుంటూ తను ''డయమండ్ లిల్'' అనే సినిమాలో నటించినప్పుడు తనతో కారీగ్రాంట్ కూడా నటించాడని, అయితే అతను చాలా చిన్నవాడని ఆమె అన్నదట. ఆమె యిటీవలె 76వ జన్మదినోత్సవము జరుపుకున్నది.

*  *

## పవిత్ర ప్రేమ

తమ పవిత్ర ప్రేమను వివాహబంధంతో కలపటానికి తమ తమ తలిదండ్రులు ఇష్టపడనందువల్ల యీ తుచ్ఛ ప్రపంచం మీద విరక్తి చెంది 26 ఏళ్ల శంకర నారాయణ అనే అతను 20




ఏళ్ళ లక్ష్మమ్మ అనే ఆమె విషం తాగి మరణించారట. వారి శవాలు మైసూరుకు సమీపంలో వున్న చాముండి కొండమీద దొరికాయట. శవాల పక్కన విషం సీసా, ఆ పక్కనే ఒక చచ్చిన గుంటనక్క వున్నాయట. విషపూరితమైన వీరి దేహాన్ని రుచి చూసిన ఫలితంగా ఆ గుంటనక్క కూడా చనిపోయిందట.

## కోమాలో 8 సంవత్సరాలు

జులై 21వ తేదీ (1961 వ సంవత్సరం) ఒక రోగికి యిక్స్‌రే తీస్తుండగా షికాగో డాక్టర్ ఆల్బ్రిట్ అనే ఆయన మెదడులోని కణాలన్నీ సంపూర్ణంగా నాశనమయ్యాయట. తక్షణం ఆయన కోమా (స్మృతి తప్పడం)లో పడిపోయారట. అయితే ఆయన కోమాలో ఎనిమిది సంవత్సరాల రెండు నెలలుండి మొన్న సెప్టెంబరు 19 తేదీన చనిపోయాడట. కోమాలో యింత కాలం వున్న ఏకైక వ్యక్తి ఈయన. ఈయన ప్రాణం కాపాడటం కోసం ప్రపంచంలో వున్న ప్రఖ్యాత డాక్టర్లందరూ ఒక్కచోటికి వచ్చారట. ఎవరి కృషి ఫలించలేదు. పాపం వారి ప్రయోజనం ఏమిటి? డాక్టర్లు దేముళ్ళు కారుకదా,

*  *  *

# సమస్యల్ని పరిష్కరించే యంత్రం

ఆలోచనలకు తేలని సమస్యలు ఏవైనా బుర్రలో వుంటే, ఆ బుర్రను తీసుకెళ్ళి (నరికి కాదు) ఒక గ్లోబులాటిదాంట్లో పెడితే టక్కున సమాధానం వచ్చేస్తుందట. ఈ గ్లోబువంటి దానిలో ఎలక్ట్రానిక్ పరికరాలను అమర్చారట. ఇది లండన్‌లో జరిగిన ఒక ఎగ్జిబిషన్ (వ్యాపారం నేర్చుకో) లో పెట్టారట. ఇంకా నయం ఇతరుల మనస్సులో వున్నది కనిపెట్టే యంత్రాన్ని కనిపెట్టారు కాదు—బాబోయ్...... ఆ యంత్రం వస్తే...... ఇంటింటా వుండదగిన దది—

*　　　*　　　*

వాలాజీపేట సమీపంలో వున్న లిమిరి అనే వూరుకు చెందిన తనికాచలం భార్య 20 ఏళ్ళ



పప్పు వంట చేదామని స్టౌ ముట్టించి ఆ సంబంధమైన పనులకోసం అలంగం తిరిగే సరికి కొంగు స్టౌలో పడి అంటుకుని, చూసుకునే అంతలో వీరంతా వ్యాపించి పోయిందట. ఆమెను వేలూరు ఆసుపత్రికి తీసుకుని వెడితే చికిత్స ప్రారంభించేలోగా చనిపోయిందట. అవాదిగా కొంగు కాలి స్త్రీలు చనిపోతున్నా వంట ప్రారంభించేముందు యీ కొంగు విషయంలో వారు జాగ్రత్త పడరు. పోనీ వంటపని చేసేటప్పుడయినా ఏప్రన్ (హోటళ్ళలో సర్వర్లు వాళ్ళు కట్టుకునే గుడ్డ) వంటిదైనా కట్టుకోరదూ!

*　　　*　　　*

ఓంకార్ సింగ్ అనే సబ్‌యిన్‌స్పెక్టరు ఆగ్రా ఢిల్లీ రైల్వే లైనుమీద పోయిన నాలుగో తారీఖు రాత్రి గస్తీకి వచ్చే సరికి టెలిగ్రాఫ్ తీగలు తెంచుకు పోతున్న ముఠా ఆయనమీద కాల్పులు సాగించారట. దాంతో ఆయన అక్కడికక్కడే చనిపోయాడట.




నూతి చప్టాలో బియ్యం కడుగుతూ అలవాటుగా మామిడిచెట్టువైపు తలెత్తి చూసింది పార్వతమ్మ.

నిన్నటిదాకా గూట్లోనే వుండి తల్లి తెచ్చే గింజల్ని గోలగా అందుకునే కాకి పిల్లలు ఈరోజు రెక్కలు కొట్టుకుంటూ ఎగరటానికి ప్రయత్నిస్తున్నాయి.

కళ్ళు చెమ్మగిల్లాయి పార్వతమ్మకి.

నిజమే. రెక్కలొచ్చిన పక్షులు ఎగిరి పోవటంలో వింతేం లేదు.

బిడ్డలకు రెక్కలొచ్చేదాకా కాపాడ్డం తల్లి బాధ్యత! అది దాని కర్తవ్యం! ఎగరటం వచ్చిన పక్షి తల్లిని వదలి తన పాటి పిట్టతో వేస్తం కదుతుంది. భగవంతు డేర్పరచిన నియమమది.

దాన్ని తానెందుకు అపార్థం చేసు కుంటూంది? సహజమైన వ్యామోహాన్ని వదిలి బిడ్డ తనవే అంటిపెట్టుకోవాలని కోరుకోవడం తల్లియొక్క స్వార్థంకాదా?

పైగా దూరమవుతున్న సంతానాన్ని అవసరం గడుపుకుని మొహం చాటేస్తున్న కృతఘ్నులమకుంటూంది! విశ్వాసహీను లమకుంటూంది!!

వ్యక్తులైన బిడ్డలు తమ సంగతేకాక, తల్లితండ్రుల్నీ, తదితర కుటుంబ బాధ్య తల్నీ నెత్తిన వేసుకోవాలనే నీతి మానవపుల్లో తప్ప మరే జాతిలోనూ కనబడదు.

భగవంతుని సృష్టిలో ఒక భాగమైన పశుపక్ష్యాదులలో లేని ఈ నియమం — ఆ ప్రకృతిలోనే పుట్టి పెరిగే మానవుడి కెందుకుండాలి?

మనిషికి మనసన్నది కనక! ఆ మన సుకు ఈ బాధ్యత న్యాయమని తోచింది కనక! అని సరిపెట్టుకోవాలి. నరుడంత నిస్సహాయజీవి మరి లేదేమో బాల్యంలో — వృద్ధాప్యంలో--

మానవుని దృష్టిలో ఇది న్యాయమై నదే కావచ్చు కాని దేవుని దృష్టిలో అవ సరమైనదిగా మిగిలిపోయిందేమో. అందుకే ఈ నియమంమీద మానవత్వపు ముద్రయితే పడిందిగాని, సహజత్వపు సొంపు అమర లేదు.

తల్లి తన బిడ్డను పెంచడం దైవ నిర్ణయం ఐనట్టే, మనిషి తన తల్లిని ప్రేమించడం దైవేచ్ఛ అయినట్లయితే మాతృమూర్తి మనస్సులో అంతులేని పుత్ర ప్రేమను నించిన దైవం, ఆ ప్రేమను యథేచ్ఛగా జుర్రుకున్న బిడ్డలు అంతరం గంలో అంతగానూ మాతృప్రేమను వుంచలే దెందుచేత?

భగవంతుని నియమానికి ఒక కారణమూ దాని ననుసరించడానికి అవసరమయ్యే ప్రేరణా కూడా ఉంటాయి.

మానవుడు పెట్టుకున్న నీతి నియమా లకు కారణమయితే వుండవచ్చుగాని వాటి వెనుక బలీయమూ, సహజసిద్ధమూ అయిన ప్రోద్బలం మటుకు ఉండదు. అందుకే నీతిగా బ్రతకమని నెత్తీనోరూ కొట్టు కుంటూ శాస్త్రం ఘోష; పెద్దల ప్రవచ నాలు.

అందుకే మనిషి నిమిష నిమిషమూ పెద్దల నీతివాక్యాలను పెడచెవిని బెట్టనూ, వుల్లంఘించడానికి ప్రయత్నించనూ జరుగుతున్నది. 'ఇది తప్పు నాయనా' అని పదే పదే హెచ్చరించవలసి వస్తున్నది మానవుణ్ణి.

'అమ్మా' కూతురి కేకతో ఆలోచన లోంచి తేరుకుని చటుక్కున కళ్ళు తుడుచుకుని లోపలికొచ్చింది పార్వతమ్మ.

*  *  *

భర్త గంగాధరం పోయేనాటికి పార్వ తమ్మకు నిండా ముప్ఫయ్యేళ్ళు లేవు. నలు

గురు బిడ్డలతల్లి అయింది. పెద్దవాడు హరికి పట్టుమని పదేళ్ళులేవు రెండోవాడు మధు. తరువాత ఆడపిల్లలిద్దరూ బొత్తిగా పసివాళ్ళు.

అప్పటిదాకా గంగాధరం తమ్ముళ్ళతో విడిపోలేదు. కారణం ఇంకా తండ్రి బతికుండటమే. వయస్సు ఉడిగినా పెద్దరికపు హోదా నిలబెట్టుకో గలిగిన వాడాయన.

గంగాధరం పోయిన పదకొండవనాడు చెల్లెలు పార్వతమ్మని తీసికెడతా నన్నాడు అన్న రాజన్న. ముసలాయనకి కష్టం తోచింది.

'నా కంఠంలో ఊపిరుండగా కోడలూ, పిల్లలూ ఈ ఇల్లు వదిలిపెట్టే అవసరం రానియ్యను. నీ చెల్లెలి కేలోటయినా జరుగుతుందని నువ్వు కలలోకూడా అనుకో నక్కరలేదు' అని ఖచ్చితంగా చెప్పాడాయన. అలా చూడగలిగాడు కూడా.

కానీ మరోసారి విధి పార్వతమ్మని కాటేసింది. కాలసర్పం రెండేళ్ళలోనే ముసలాయన్నికూడా పొట్టను పెట్టుకుని జర జర ముందుకి పాకిపోయింది.

దానితో ఆ యింట్లో పార్వతమ్మ స్థానం పెద్దకోడలి హోదానించి హఠాత్తుగా మారిపోయింది. వంట మనిషి + పనిమనిషి—వెరశి అరణపు దాసిగా క్రమక్రమేణా దిగజారిపోయింది.

ఆడదానికి ఆడదే శత్రువన్న నానుడికి ప్రత్యక్ష సాక్ష్యాలు పార్వతి తోడికోడళ్ళిద్దరూను. మామగారుండగా పెత్తనాలు సాగక అంతర్గతంగా దాగివున్న వారి అసలైన స్వభావాలు త్వరలోనే బైటపడినై.

పెద మరిది భార్య ధనమ్మ మహా ప్రమాదకరమైన మనిషి. అదివరకు ఏ పని వాళ్ళో, పాలేళ్ళో ఆమె కలిపించే ప్రమాదాలకి గురి అయ్యేవాళ్ళు. ఇప్పుడు పార్వతమ్మ దొరికింది.

ధనమ్మ పుట్టింటివాళ్ళు అంతగా లేనివాళ్ళు. ఆవిడకు వాళ్ళంటే మోజు జాస్తి. వాళ్ళది ఆ ప్రాంతమే. అంచాం చాటునా మాటునా పప్పులూ, ఉప్పులూ మొదలు పండుకున్న సింగినంటలు సయితం పుట్టింటికి రవాణాచేస్తూ ఉంటుందావిడ ఎప్పటికప్పుడు.

ఒక్కసారి కొత్తగా కొన్న చీరలూ జాకెట్లతోసహా జారేసి పని మనుషులకిందకి నెట్టి వాళ్ళమీద విరుచుకుపడడం కూడా కద్దు.

అజమాయిషీ చేస్తూ, ఎప్పుడూ ఇంట్లో విశ్రాంతిగా పడుకుండే మామగారు పోవటంతో ధనమ్మకు రెక్కలొచ్చినట్టయింది. ఇక ఇంట్లో పదార్థాలకి కాళ్ళు రాకేమవుతాయి?

ఎంతెంత నెయ్యి పదిరోజులకే అయిపోవటం ఎన్నెన్ని సరుకులూ పక్షమయినా రాకపోడం మొదలయింది. ఇదేమని అడిగిన మరిదికి,

'ఏమో ఎవరికి తెలుస్తుంది? వంటింటి పనంతా తనే చేస్తున్నట్టు అక్కడే వుంటుంది మరి మీ వదినగారు. ఆవిడకి తెలియాలిసిందే' అంటూ దీర్ఘం తీసేది ధనమ్మ.

తెల్లబోయిన పార్వతమ్మ తేరుకోకముందే, 'కాస్త చూచి వాడకపోతే ఎలా వదినా?' అని, నొసలు చిట్లించి మరేమీ అనలేక ఊరుకునేవాడు మరిది. అలవాటు లేని ఈ అభాండాలకి తట్టుకోలేక ఉక్కిరిబిక్కిరయ్యేది పార్వతమ్మ.

పెద్దావిడ ఈ రకమైతే చిన్నావిడ సీత ఇంకో తరహా.

సీతకి మొదటినించీ పార్వతమ్మ అంటే పడదు బావగారు పోయినా మామగారు అడ్డుపడి పార్వతమ్మ పెద్దరికం ఇంకా ఇంట్లో నిలపడం ఆవిడకి కంటగింపుగానే వుంది. కాని మామగారి మాట దైవశాసనంగా చెలామణీ అయ్యే ఆ ఇంట్లో మరి నోరెత్తలేకపోయిందిన్నాళ్ళూ.

భాగం పంచి బయటకు పంపితే ఈపాటికి చిప్పచేత పట్టేసిండేతికి రావలసినవాళ్ళు ఈ ఇంట్లో గాదికింద పందికొక్కుల్లా పడి తింటున్నారని ఆవిడభావం. కాని తెలివి ఎక్కువగా బయటపడే రకంకాదు సీత. మనిషిని సన్నగా కోతపెట్టడం బాగా చేతనవు నావిడకు

అందరూ స్నానం చేసేప్పుడుండే శాండిల్ సోపు సరిగ్గా పార్వతమ్మ పిల్లలు స్నానానికొచ్చేటప్పటికి తమాషాగా మాయమై దాని స్థానే ఏ లైఫ్‌బాయి ముక్కో ఉండేది.

తుడుచుకోడానికి ఒక్క తువాలా అన్నా లేకుండా అన్నీ నీళ్ళలో ముంచి వుండేవి. వాళ్ళకి పార్వతమ్మ తన కొంగుతోనే తుడిచేది.

తన పిల్లలకూ చినబావగారి పిల్లలకూ ముందు అన్నాలు పెట్టేసి వాళ్ళు ఏమైనా వదిలేసినవి జాగ్రత్తగా పళ్ళెంలోకి తీసిపెట్టి పార్వతమ్మ పిల్లలకు వేస్తుండేది. ఎంగిలని వాళ్ళు పేచీ పెడితే సద్దలేక సతమతమవుతున్న పార్వతమ్మతో 'ధరలన్నీ మండిపోతుంటే పారేసుకుంటే ఏమౌనుస్తుందీ? అయినా పరాయివాళ్ల ఎంగిళ్లా ఏమన్నానా?' అని వాళ్ళకు వినబడేలా తనకు తనే సమాధానం చెప్పుకునేది—ఆమాటే తన పిల్లలకు చెప్పలేనని తెలిసికూడా.

అదీగాక, తన పిల్లలకు పార్వతమ్మ ఎక్కడ ఓ పిసరు ఎక్కువ నెయ్యి వేస్తుందో అనీ, ఓ బిళ్ల పెరుగు వేసేస్తుందో అనీ కావలాగా వాళ్ళు తిన్నంతసేపూ ఎదురుగానే కూర్చునేది.

ఇన్ని కడగళ్ల మధ్య కాపురంచేస్తూ ఏనాడూ ఓమాట నోరు జారడం కానీ, ఓర్పును కోల్పోడం కానీ జరగనియ్యలేదు పార్వతమ్మ.

ఆవిడ ఆశంతా ముందురోజులమీదే వుండేది.

పార్వతమ్మకి ఆవేశపడడానికిది సమయం కాదని తెలుసు. తన కొడుకు ప్రయోజకుడు కావాలి. నవ్విన నాపచేనే పండుతుందని అందరికీ దానికదే తెలిసి రావాలి. అందాకా ఓపికపట్టడం తప్పదు.

ఆమెకా కటిక చీకటిలో కాంతిరేఖ హరి. హరి బుద్ధిమంతుడు. తల్లిపడే అవస్థ తమ నిస్సహాయతా గుర్తించినవాడు. పరిస్థితుల కనుగుణంగా నడచుకోవడం వివేకవంతుల లక్షణం. పినతల్లులకెంత కుచ్ఛితముస్నా పిన్నాన్నల సానుభూతి తమకంటగా ఉండనే వుంది. వాళ్ళు పెట్టుకొన్న ఆశలకి ఆలంబనమదే.

తల్లి ఆశల కనుగుణంగా ఒక్కొక్క క్లాసే మంచి మార్కులతో గట్టెక్కి సాగాడు హరి. నాలుగేళ్ళు భారంగా గడిచిపోయినయ్. హరి స్కూల్ ఫైనల్ ప్యాసయినాడు.

కాలేజీలో చేరతానన్నాడు. ఇంట్లో గాలిదుమారం లేచింది. ఇప్పటికే అక్కరలేని బరువు బాధ్యతలు మోసిన మరుదులిద్దరికీ కొంచెం కష్టమనిపించింది

ఆయేడు వంటలూ సరిగా పండలేదు.

అదీకాక వీడిచదువు సంధ్యలే ఇంకా తెమ లకపోతే వెనక ఎక్కేవస్తున్న వాళ్ళని గట్టెక్కించే దెప్పుడు? ఆ భారం తీరే దెప్పుడు?

నాకు తెలిసిన ఓ చిన్న కంపెనీలో ఓ నౌకరీ వేయిస్తాను. వందరూపాయలివ్వవచ్చు నాకు చేదోడు వాదోడుగా వుండచ్చు' అన్నాడు పెద్ద పినతండ్రి శివయ్య.

ఆయన ఎదురుగా మరేం మాట్లాడ లేదు హరి. కాని లోపలికివెళ్ళి ముసుగు తన్ని పడుకున్నాడు భోజనమైనా చెయ్య కుండా. ముద్ద మింగుడు పడలేదు పార్వ తమ్మకి. ఏమీ చెప్పలేని పరిస్థితి.

కాగల కార్యం గంధర్వులే తీర్చినట్లు ఆ సమస్యకు పరిష్కారం త్వరలోనే దొరి కింది.

రెండో పినతండ్రి రామయ్య మామ గారికి ఇద్దరు కూతుళ్ళు ఒక్కడే కొడుకు ఆ కొడుకు కాస్తా ఆ మధ్య కలరా తగిలి 'గుటుక్కు'మన్నాడు ఇహ నిప్పుడు మామ గారి ఆస్తికి కాపలా కాయాల్సిన బాధ్యత అల్లుళ్ళమీద పడింది. ఆ అల్లుడు తిన కుండా ఈ అల్లుడూ, ఈ ఈ అల్లుడు తినకుండా ఆ అల్లుడూ చూచుకోవలిసి రావటంతో ఇద్దరు అల్లుళ్ళూ అక్కడే మకాం వెయ్యాలిసి వచ్చింది.

సమయం దొరికిందని చిన్నావిడ సీత పెనిమిటిని పోరడం మొదలెట్టింది — 'ఇక్కడేముందని పడివుండటానికి. ఇక్కడ వచ్చేది కాస్తా తీసుకుని మా వాళ్ళింటి

# కనువిప్పు

దగ్గరే వుందాం పదండి' అంది. అదీ బాగానే వుందనిపించింది రామయ్యకి.

అన్నగారికి సంగతి వివరించి తనవంతు కాస్తా పంచమన్నాడు రామయ్య. అతని దారిన అతను వెడితే తను ఒక్కడే మరో కుటుంబాన్ని పోషించడం అలవికాని పని అని తెలుసుకున్నాడు శివయ్య. పోనీ ఎదిగి వచ్చాడనుకున్న హరి అయినా తనకు సాయ మవుతాడనుకోడానికి ఆ సూచనలేమీ కనిపిం చడం లేదు. గత్యంతరంలేక పార్వతమ్మని పిలిచి పరిస్థితులు విడమర్చి చెప్పి విడిపోక తప్పదన్నాడు. భగవంతుడిపై భారంవేసి తలవంచుకుంది పార్వతమ్మ. మౌనం అర్ధాంగీకారమయింది.

ఉన్నవి కొద్దిపాటి ఆస్తిపాస్తులు—పంచు కోడానికెంతసేపు పడుతుంది? వున్న కాస్త పొలమూ అన్నదమ్ములిద్దరూ తీసుకున్నారు. పార్వతమ్మ ఆడది కావటం చాత చూచుకో లేదన్న ముందుచూపుతో.

ఇల్లంతా పార్వతమ్మకే వదిలారు. కొంత భాగంలో తనువున్నా మిగతాది అద్దె కిచ్చేస్తే, నెలనెలా కొంత రాబడి చేతి కందుతుందన్న భావనతో సరేనంది పార్వతమ్మ.

అప్పటికప్పుడు తనవంతు పొలాన్ని అమ్ముకుని వెళ్ళిపోయాడు రామయ్య.

శివయ్య మటుకు విడిపోయినా వాళ్ళని విడిచిపెట్టలేకపోయాడు. పైగా వూళ్ళోనే




వుంటున్నాడాయను. నలుగురూ తననే అనరా! లోకభీతి కలవాడు శివయ్య.

ఒక చిన్నవాటామాత్రం మిగిల్చి మిగతా భాగమంతా అద్దెకిచ్చే ఏర్పాటు చేశాడు శివయ్య. అద్దెకుండేవాళ్ళను నికరమైన వాళ్ళుగా చూచి ఇచ్చే బాధ్యత తనే నెత్తిన వేసుకున్నాడు. పార్వతమ్మని పిలిచి తన ఆసరా వాళ్ళకెప్పుడూ వుంటుందని ధైర్యం చెప్పాడు.

అతని బంధుప్రీతికి కన్నీళ్ళు తిరిగి నయ్యి పార్వతమ్మకి. చెయ్యెత్తి మొక్కా లనుకున్నా చిన్నవాడని లోలోపం ఆశీర్వ దించింది.

దాపరికంలేకుండా అసలు సమస్య ముందుంచింది. హరి పైకి చదువుతానని పట్టు పడుతున్నాడు. తనకీ ఇష్టమేగాని ఇప్పటి పరిస్థితుల్లో అదెలా సాధ్యం అని. సమస్య తనది కాకపోతే కొందరికి తేలి గ్గానే మార్గాలు దొరుకుతాయి.

ఇంటిమీద వచ్చే అద్దెతో ఇల్లు గుంభ నగా గడుపుకుంటే చదువుకి ఇంటిమీద అప్పు ఇప్పిస్తానన్నాడు శివయ్య. వాడి చదువు ముగించుకుని ఏదయినా ఉద్యో గంలో జేరితే తీర్చుకోవడ మెంతసేపు?

పార్వతమ్మ అంగీకారంలో హరి చదువు నిరాటంకంగా సాగిపోయింది. బి.యె.బి.యి.డి పూర్తిచేసి ఆవూరి హైస్కూలులోనే టీచ రయ్యాడు హరి.

ఈమధ్యకాలంలో పార్వతమ్మకి రోజు లన్నీ సవ్యంగా గడిచిపోయాయనుకోగూడదు.

ఇంటి అద్దె ఎనభై రూపాయల్లోనూ నలుగురున్న కుటుంబం ఎలా జరుపు కొచ్చిందీ పార్వతమ్మకే తెలుసు.

నీళ్ళని మరిగించి అదే నెయ్యని ఒంపి చిన్నపిల్లలిద్దరినీ మభ్యపెట్టాలిసి వచ్చి నప్పుడూ, ప్రతిపండక్కీ అందరి పిల్లల కున్నట్లు తమకీ కొత్తబట్టలు లేవనీ, పిండివంటలు చెయ్యలేదనీ మారాం చేసే పిల్లల వీపులు మర్దనా చేసి, వాళ్ళు ఏడ్చి ఏడ్చి అలిసి నిద్రపోయాక సరియైన తిండీ, బట్టకీ మొహం వాచిన తనబిడ్డల మొహాలు చూస్తూ ఎంత కుమిలిపోయిందో, ఆ సర్వాంతర్యామికే తెలుసు.

కాని అంతలేమి, అంత దిగులులోనూ స్వాతంత్ర్యం—స్వర్గలోకం ఇదే బాగుందని అనుకోకనూ పోలేదు.

ఇన్నేళ్ళకి పార్వతమ్మ తపస్సు ఫలించింది. హరి సంపాదనపరుడయ్యాడు. మధు సెవెన్త్‌ఫారం ప్యాసయ్యాడు. పెద్దపిల్ల కమల ఫోర్త్‌ఫారం చదువుతూ — పెళ్ళి కెదిగానని జ్ఞాపకం చేస్తోంది. చిన్నది లక్ష్మి సెకండ్‌ఫారం చదువుతోంది. ఇంటిమీద అప్పు మూడువేలూ తీర్చేస్తే తమ కష్టాలు గట్టెక్కినట్టే అనుకుంటూంది పార్వతమ్మ.

సరిగ్గా ఈ సమయంలోనే హరికో సంబంధం తెచ్చాడు చిన్న పినతండ్రి రామయ్య. వాళ్ళు బాగా వున్న వాళ్ళనీ, కట్నం ఎక్కువే ఇవ్వగలవాళ్ళనీ, తమ కింత ఆస్తి లేకపోయినా కుర్రవాడు చదువుకున్నందుకు మోజు పడుతున్నారనీ చెప్పాడు.

వచ్చే కట్నంతో ఇంటిమీద అప్పంతీరటమే కాకుండా మధుపై చదువుకు ఇడుముకోనక్కరలేదనే పేరాశతో శియ్యఆలోచనతో ఏకీభవించింది పార్వతమ్మ. హరికీ పిల్ల నచ్చింది.

ఐదువేలు కట్నమిచ్చి ఆడంబరంగా పెళ్ళిచేశారు హరి అత్తవారు.

అక్కడే ఓ తమాషా జరిగిపోయింది. ఐదువేలూ రొక్కంగా పేణా ఇస్తారనుకున్న హరి అత్తవారు ఆ మేరకి కూతురికి నగలు చేయించి పంపారు. దానిలో ఇదివరకే మురుగుతూన్న మూడువేలకి తోడు, పెళ్ళి ఖర్చులకింద మరో వెయ్యి రూపాయలదాకా అయిన అప్పుమాత్రం మిగిలిపోయింది.

మామగారిని అడగలేనన్నాడు హరి. అయిపోయినదానికి బాధపడటం కని మాట్లాడ కూరుకోవుంది పార్వతమ్మ.

యథాప్రకారం సమస్యలూ మిగిలిపోయాయి. అప్పూ, చిన్నవాడి చదువూ— అదీగాక సంసారంలో మరో శాల్తీ అదనంగా పెరిగింది.

తల్లి దిగులు హరి కనిపెట్టాడు. 'ఋణభారాన్ని గురించి దిగులు పడకమ్మా. నింపాదిగా తీర్చుకుందాం. మధు చదువయ్యే దాకా వడ్డీమాత్రం నెలనెలా తీర్చుకుంటుంటే అంత బెంగ వుండదు. మధు బి. యి. చదువుతానంటున్నాడు. నేనుండగా వాడికేలోటూ రానీనమ్మా సరేనా' అన్నాడు.

ఊపిరి పీల్చుకుంది పార్వతమ్మ. బాధ్యత తలకెత్తుకున్న కొడుకున్నప్పుడు తల్లికి నిశ్చింతగాక మరేమున్నది.

అనుకున్నట్టుగానే మరికొన్ని ట్యూషన్లు ఒప్పుకున్నాడు హరి. మధును బి. యి కి పంపించాడు. నెలనెలా అప్పు మీద అయినవడ్డీ కొద్ది కొద్దిగా తీర్చడం మొదలుపెట్టాడు.

కోడలు కల్యాణి కాపురానికి వస్తూనే పరిస్థితులు ఎదురు తిరిగినై. ఆమె కాపరానికి వచ్చిన దగ్గరనించీ ఎప్పటికప్పుడు వడ్డీ వసూలు వెయ్యడం పడనేలేదు. నెలకు ఐదుసార్లు సినిమాలకి మొగుణ్ణితరమా, స్నోలూ, హేరాయిల్సూ, కొత్తచీరలూ కొనిపించా మొదలుపెట్టింది. పోనీ కొత్త కదా అని నవ్వుకుంది పార్వతమ్మ. వాళ్ళతో పాటు 'మేమూ వెడతాం సినిమాకి' అని పేచీపెట్టే ఆడపిల్లలిద్దరి సంగతే సమస్య అయింది ఆమెకి. పసివాళ్ళని చిన్నబుచ్చడం ఇష్టంలేక వాళ్ళనికూడా పెళ్ళాంతోపాటు తీసికెళ్ళి సరదాలన్నీ తీర్చక తప్పటంలేదు హరికి. ఇంటి ఖర్చు గూడా జాస్తి అయింది. ఇదివరలోలా పొదుపుగా వాడడం పడ్డంలేదు.

పార్వతమ్మ చేసే పొదుపు శాస్త్రానికి కడుపు నింపుతుందే తప్ప రుచులు తీర్చదు. జిహ్వా చాపల్యానికి అలవాటుపడ్డ కల్యాణికి ఈ ఇంటి పొదుపూ జాగ్రత్తా, పిసినిగొట్టుతనంగానూ కక్కుర్తి మేళం కిందా కనిపించింది. పట్టుబట్టి తనే రోజుకి మూడు నాలుగు కూరలూ, రెండు పూటలా కాఫీ టిఫెన్లూ తయారుచేస్తూ ఇంట్లో అందరికీ రుచులు మప్పసాగింది. కొత్తమోజులో పడ్డ హరి భార్య పాకశాస్త్ర ప్రావీణ్యతకీ మురిసిపోయాడే తప్ప దానివల్ల ఇంట్లో సామగ్రి ఎంత విచ్చలవిడిగా ఖర్చయిపోతున్నదో గమనిక కొచ్చేది కాదు. కొత్తపెళ్ళాం తెమ్మన్నవల్లా తెచ్చి పడేశేవాడు.

ఇలా లేనిపోని గొప్పలకి పోతే జరిగే దేమిటో తెలుసు పార్వతమ్మకి. 'పడచుల కాపరం చిత్తుకులమంట' అన్న సామెతగా నడిచిపోతోంది ఇల్లు. అలాగే కొన్నాళ్ళు జరగనిచ్చింది. రోజురోజుకీ పెరుగుతూందే తప్ప ఆ ఆట కట్టడం లేదు. ఇంటిదగ్గర కాలక్షేప మెక్కువై హరి కొన్ని ట్యూషన్లు కూడా మానుకోవడంతో పరిస్థితులు విషమించి చెయ్యి దాటిపోయ్యేలా వున్నాయనుకుంది పార్వతమ్మ.

భోజనం చేసి కంచంలోనే చెయ్యి కడుక్కొని గదిలోకి జారబడబోతున్న కొడుకుతో 'హరీ సాయంత్రంపూట రావాల్సిన ట్యూషన్ పిల్లలు రావటం లేదేం?' అంది ఎరగనట్టే.

'ఏమోనమ్మా వాళ్ళే మానేశారు.'

ఎందుకు మానేశారో హరికీ తెలుసు. పార్వతమ్మకి చెప్పడం కుదరటంలేదు. సాయంత్రం స్కూలునించి రాంగానే భార్యాభర్త సినిమాకో, షికారుకో వెడుతున్నారు. మళ్ళీ ఏ పది గంటలకో రావటంతో వాళ్ళకి కావలసినన్ని శెలవలు దొరుకుతున్నై. విద్యార్థులకది ఆటవిడుపే కాని తల్లితండ్రులూరుకోరుగా? అప్పటికీ అయిదారు నెలలు ఓపికపట్టి ఇక మానిపించారు ట్యూషను. అదీ సంగతి— పార్వతమ్మకి కొడుకూ కోడలూ అలా జంటగా నడుస్తుంటే ముచ్చటగానే వుంది. కాని లేనిఆస్తీ, వున్న అప్పూ లోపల కలుక్కుమంటూండెను క్షణక్షణమూ.

'హరీ నేనోసంగతి చెప్తాను కోపగించుకోకు నాన్నా! ఇప్పటికే నెలనెలా వసూలువేస్తున్న వడ్డీ ఆపేశాము. ఖర్చులూ జాస్తి అయినాయి. ఈ ట్యూషన్లుకూడా లేకుంటే రేపట్నించీ మధుకు డబ్బేలా పంపుతావు? వాడి చదువూ ఓ కొలిక్కి వస్తేనే కదా అప్పు తీర్చేదీ? కమల పెళ్ళి సంగతి చూసేదీను. నేనిలా అంటున్నానందుకు మరేమనుకోకు సుమీ. మీకిది ముచ్చటగా అనుభవించాల్సిన వయసనీ తెలుసు నాకు. కాని మన స్థితిగతుల దృష్ట్యా చెప్పక తప్పడం లేదు. అలాని మీ సరదాలు పూర్తిగా చంపుకోమనటం లేదు. నెలకు నాలుగాదివారాలూ వుండనే వున్నాయి. ఏ ఒకటి రెండురోజులో నాగా అయినా ట్యూషన్లు మానెయ్యరు పిల్లలు. ఆలోచించుకో బాబూ' అంది నింపాదిగా.

'అక్కరలేదమ్మా రేపట్నించీ మామూలుగా రమ్మని వాళ్ళతో చెపుతాను' అప్పటికప్పుడు నిర్ణయానికొచ్చాడు హరి. కొండెక్కినంత సంబరపడ్డది పార్వతమ్మ. చాటుగా ఈ మాటలన్నీ వింటున్న కల్యాణి మనస్సులో మాత్రం అసంతృప్తి చెల

రిగింది.

మర్నాటినించీ పార్వతమ్మ ఇంటి పద్ధతులలోగూడా మార్పు తెచ్చింది. స్నోలూ, హేరాయిల్సూ కల్యాణివరకే పరిమిత మయి వయ్. టిఫిన్లూ, మూడునాలుగు కూరలూ కూడా తగ్గినయి. చీటికీమాటికీ కొత్త చీరెలూ, రోజా పూలూ మొదలే లేవు. సినిమాలూ. సరదాలూ అన్నీ తమవరకే పరిమితం కావడంతో కల్యాణిపని ఇరకాటాన పడ్డట్టయింది. తనతో పాటు వాళ్ళనీ ఆహ్వానించినా, తల్లి అదలింపుతో ఆడపిల్లలిద్దరూ ఆ జోలికిరావటం మానుకున్నారు. దానితో ఆమెకూడా తన అలంకారాలూ వినోదాలూ దూకుడు తగ్గించుకోక తప్పలేదు. ఏ కాస్తో విచక్షణగల పిల్ల కావటాన తన వయస్సుకు దగ్గర వాళ్ళే అయిన వాళ్ళను వదలి తను ఒక్కత్తే శృంగారించుక్కూచోడం ఎబ్బెట్టనిపించింది.

క్రమేణా కల్యాణిలో అసంతృప్తితో పాటు సన్నగా స్వాతంత్ర్యం బయలుదేరింది. వాళ్ళందరికోసం తనూ తనభర్తా ఎందుకు సరదాలు చంపుకోవాలి? ఈ యాంత్రిక జీవితం ఆవిడకు సరిపడలేదు.

అలా అని కల్యాణి ముందునించీ కులాసా జీవితానికి అలవాటు పడ్డదేం కాదు. పల్లెటూరి రైతు కుటుంబంలో పుట్టి మట్టి ఇంట్లో మెసిలిన దవటాన కల్యాణికి పట్నవాసపు జీవితంమీద మోజెక్కువ. అందుక్కారణాలుకూడా పెద్దవేమీ కాదు సామాన్యంగా కన్నెపిల్లలు కనే బంగారు కలలన్నీ సినిమాలో ప్రణయ దృశ్యాల చుట్టూ, నవలల్లోని ప్రేమఘట్టాల చుట్టూనూ కళ్ళు మూసుకుని ప్రదక్షిణాలు చేస్తుంటై. అంతకుమించిన ముచ్చటలుండవు. ఆ ఆకర్షణలకి కాస్తో అయినా దారి దొరికేది బస్తీలలోనే. పల్లెటి దిక్కున ఎంత గొప్పింటి ఇల్లాలైనా ఇల్లలకా, పాలుపితకా, కామాటమంతా సొంతగా చేసుకోవలసిందేతప్ప కొత్తదంపతులైనా షికారుకంటూ ఏ పొలం గట్టు మీదో కనిపిస్తే ముక్కుమీద వేలేసుకుంటారక్కడి జనం.

అడపాదడపా గూడులేని ఎడ్లబళ్ళమీద పక్కూర్లో టూరింగు సినిమాలు చూసే భూస్వాముల భార్యలైన అక్కలిద్దరూ స్వానుభవంమీద 'నువ్వయినా ఉద్యోగస్థుణ్ణి చేసుకుని బస్తీలో కాపురం పెట్టవే. మాకెలాగూ తప్పలేదు ఈ మట్టిబతుకూ' అంటూ ఇచ్చే సలహాలు వినీ వినీ అటు వైపు ఆకర్షితురాలయింది కల్యాణి

అందుకే, తనకంటే ఎక్కువ భూవసతి ఉన్న పిల్లాడికోసం ఆరాటపడిన తండ్రి ఆలోచనకి స్వస్తిచెప్పించి చదువూ, వుద్యోగం, సద్యోగం ఉన్న సంబంధం కావాలని ఎన్నుకుంది పట్టుబట్టి.

తీరాయి అనుకుంటున్న తన కోరికలన్నీ అంతలోనే అంతరించి పోయేసరికి భరించ లేక పోయింది కల్యాణి. ఏదో నాలుగు రోజులు తలవంచుకుంటే తీరేనా ఈ గడ్డు రోజులు? అత్తగారు తన పెనిమిటి మీదకి నెట్టిన ఈ బాధ్యతలకి అంతెక్కడ? మరిది చదువు—ఆడబిడ్డల పెళ్ళిళ్ళూ— వరసగా పేరుకుంటూ పొయ్యే అప్పులూ— ఈ జంజాటమంతా గడిచి గట్టెక్కేసరికి తనవయస్సు పొద్దువాలినట్టు వాలుతుంది... ముద్దూ ముచ్చటా ఇంకెప్పుడూ?

అగ్నికి వాయువు తోడైనట్లు తల్లి తండ్రుల హితబోధలుకూడా తలకెక్కలేదు కల్యాణికి.

'ఎలా అయితే అమ్మాయ్! ఎప్పటికి తేలిక పడేది నువ్వు? ఈ గాడిద బరువులు ఒకదాని తరువాత ఒకటి మోసుకొంటూపోతే ఆఖరికి నీకు పుట్టబొయ్యే పిల్లల గతేమి కాను? అప్పుడార్చేదీ తీర్చేదీ ఎవరు? ఇప్పుడంతా ధర్మపన్నాలు చెప్పేవారే తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ అంటూ...రేపు నీ పిల్లలకి చిప్ప చేతికొస్తే ఒక్కడు చెయ్యందించడు— వెనకాల ఏమంత స్తోమతున్నదనీ? ఏం? నీమరిదిని బి. యి. చదివించాలా? బి యి. అంటే మాటలా. నీ అత్తగారి ఆశకంతుందా? ఆయనగారు రేపు ఎవత్తెనో కట్టుకుని ఏ డెహ్రాడూన్లోనో టింగు రంగా అంటూ కూచుంటాడు. అపుడు తెలుస్తుంది' అన్నాడు తండ్రి.

'అవన్నీ వాళ్ళు చూసుకోవాలేగాని ఇలా అక్కరలేనివన్నీ నెత్తినేసుకుంటే బాగు పడ్డట్టేనమ్మా' అంటూ దీర్ఘంతీసింది తల్లి.

తండ్రి అందుకుని 'అదలా వుండనీ; నిజానికి మీకు ఏ కాస్తో ముట్టచెప్పాలని వుంది నాకు. మళ్ళీ అదిన్నీ ఆ గోతిలో పడేదే కదా అని ఎప్పటికప్పుడు నీకేమీ ఇవ్వటమే పడలేదమ్మాయ్! నామాటవిని మీ ఆయన్ని అక్కణ్ణించి మెల్లిగా తప్పుకోమని చెప్పు' అని మూరిపోశాడు.

అసలే వూపిరిసలపక అలమటిస్తున్న ఆవిడ మనసులో ఈ మాటలు పనిచెయ్యటానికి ఆట్టేకాలం పట్టలేదు. అలిసి



ఇంటికి వచ్చిన హరి చెవిలో ఆ విషం ఆరారగా పొయ్యడం మొదలెట్టింది.

'ఎన్నాళ్ళీ బందిఖానా? మీకుమాత్రం సుఖంగా వుందా' అంటూ.

పాపం — హరికూడా నలిగిపోతున్నమాట నిజం.

ప్రొద్దుటా, సాయంత్రం ట్యూషన్లూ — మధ్యాహ్నం స్కూలు — ఇక రాత్రులు కాంపోజిషన్ పుస్తకాలు, పరీక్ష పేపర్లు — వీటితో తలకు మించిన పనయిపోయి అతలా కుతల మయి పోతున్నాడు.

దానికితోడు అణచుకున్న ఆశల లిస్టూ, ధైర్యం చేస్తే తీరబోయే కోరికల లిస్టూ అడపా దడపా స్వగతంగా చదువుకుంటూ కల్యాణి వుపాయానికి తొందరగానే లొంగి పోయాడు హరి.

అలా వుండగా తనను మరో వూరు వేశారన్న కొడుకు మాటలు అంత చప్పున నమ్మలేకపోయింది పార్వతమ్మ. వాళ్ళకు ట్రాన్స్‌ఫర్లు వుండవని శివయ్య చెప్పగా విన్న జ్ఞాపకమున్న దావిడకి.

ఆసంగతి మరిదిని పిలిచి అతని ఎదురుగానే నిర్ధారణ చెయ్యడంతో అసలు సంగతి ఒప్పుకోక తప్పలేదు హరికి.

అప్పుడుమాత్రం తేలిగ్గా బైటపడ్డాడా? ఈ స్కూలు హెడ్మాస్టరుకీ తనకీ పడ్డం లేదన్నాడు. ఇక్కడి రూల్సు అనుకూలంగా లేవన్నాడు.

ఇప్పుడు తను మార్చుకున్న వూళ్ళో యం.ఏ.కి ప్రైవేటుగా వెళ్ళే సౌకర్యముందన్నాడు. ఇంత చెప్పినా పార్వతమ్మ మనసులోని శంకమాత్రం తీర్చలేకపోయాడు.

లోలోపలి స్వయం పాకాలన్నీ ప గావంచలు చేసేస్తూ శివయ్య, 'మరింకేం అన్నివిధాలా వీలుగా వున్నప్పుడు ఎక్కడయితేనేం లేవమ్మా! ఇప్పుడు మాత్రమేం? ఈవాటా గూడా అద్దెకిస్తే పోయే. పిల్లల చదువులంటావా అదీ హైస్కూలేగా...' అంటూ తేల్చేశాడు.

కల్యాణి గుండెల్లో రైళ్ళు పరిగెట్టాయి. ఆశపడి ఆరు లంఘనాలు చేస్తే మళ్ళీ ఆ జొన్న కూడేనా? ఇదేమిటన్నట్టు భర్త వంక చూసింది.

పీర్లు గుండాన పడక తప్పలేదు.

'అబ్బే అక్కడ ఇప్పుడు మనమున్నంత ఇంటికే నా జీతంలో సగం పెట్టాలి పోస్తుంది అమ్మ పిల్లల్తో ఇక్కడుంటేనే నయం. నీవు చూస్తూనే వుంటావు కద! నేను ఎలాగూ వస్తూ పోతూనే వుంటానాయె. ఏమంటావ్ చిన్నాన్నా?' లౌక్యంగా అడిగాడు హరి.

కడుపులోని వుద్దేశ్యాలు కడుపులోనే దాచుకుని గరళ కంఠుడిలా మాట్లాడుతున్న కొడుకును చూస్తూ ఆశ్చర్యపోయింది పార్వతమ్మ. ఈమధ్య కొడుకు ముభావంగా వుంటుంటే ఏమో అనుకుంది. ఇన్నాళ్ళూ కోడలూ, కొడుకూ చేస్తున్న మంత్రాంగం ఇదన్నమాట.

ఎందుకింక ముసుగులో గుద్దులాట.

కల్యాణిని తీసికెళ్ళిన తరవాత రెండు నెలలు హరిదగ్గర్నించీ పాతికేసి రూపాయల మనియార్డర్లు వచ్చాయి. ఆ తరవాత వాటికి బదులు పట్నంలో తాము పడుతున్న యిబ్బందులూ, వాటి కవసరమైన డబ్బు తనదగ్గర కొరవపడుతున్న సంగతీ రాస్తూ ఇంటి అద్దెతో ఎలాగో సరిపెట్టుకోమని సలహాలు ఇవ్వడం మొదలెట్టాడు సన్న సన్నగా.

ఈ స్థితిని ముందే వూహించుకున్న పార్వతమ్మ ఆశ్చర్యపడలేదు. నిండా మునిగిన వాళ్ళకు చలేమిటనుకుంది.

ఆమె అనుకున్నట్టుగానే మధు దగ్గర్నించి ఉత్తరమొచ్చింది. 'అన్నయ్య సరిగ్గా డబ్బు పంపటంలేదు నా సంగతేమిటం'టూ.

తానుమాత్రం ఏం చెయ్యగలదు? రెక్కలొచ్చిన పక్షిని ఆపగలదా? రెక్కలూడిన తను ఎగరగలదా? దానికి తోడు శివయ్య ఇప్పుడిప్పుడే కమలకు సంబంధాలు తెస్తున్నాడు. నాలుగయిదు వేలన్నా లేనిదే దాని పెళ్ళిమాత్రం తెముల్తుందా?

మధు చదువు పూర్తి కావాలి! కమల పెళ్ళిచెయ్యాలి; తాము కడుపునిండా అన్నమైనా తినాలి! వీటన్నిటికీ డబ్బుకావాలి. పాపాలకి భైరవిలా ఈ ఇల్లు తప్ప మరేం కనిపించడం లేదు

మనస్సు దిటవు చేసుకుని శివయ్యకు కబురంపి తనసాద వెళ్ళబోసుకుంది. కావాల్సిన సొమ్ము కాస్తా కూస్తా కాదు 'వాడి చదువుకి నాలుగువేలూ దీని పెళ్ళికి నాలుగువేలూ చూచుకున్నా వెనకటి అప్పుతో కలిపి వెరసి పన్నెండువేలకి దేకుతోంది. ఇంటి ఖరీదుకి దాదాపు దగ్గర పడుతోంది. ఇప్పుడు అప్పుచేసి ఏమి లాభం? తీర్చేదారి లేనప్పుడు? అమ్మివేస్తే సమస్యలైనా పరిష్కారాని కొస్తాయి అనిపించింది.

పాపం శివయ్యకూ మరోదారి తోచలేదు. ఇల్లుకొనగలవాళ్ళను చూడ్డం మినహా తానుమాత్రం మరేం చెయ్యగలడు.

ఇరవయివేలకు దర ఖాయం చేసి అన్నదమ్ములిద్దరికీ జాబులు వడేశాడు సంగతి తెలియజేస్తూ.

రెండోనాటికల్లా మధూ, మూడో రోజు మామగారితోపాటు హరీ దిగరు:

వియ్యంకుడి రాకకు నిర్ఘాంతపోయినా, తెప్పరిల్లి ఆహ్వానించింది పార్వతమ్మ.

జరగబోయేది తాననుకున్నంత సవ్యంగా సాగేది కాదనీ, హరి వెనకటి వాడుకాదనీ, అయన్ని చూస్తూనే గ్రహించుకున్నాడు శివయ్య. పార్వతమ్మమీద పూర్తి సానుభూతి వుండాయనకి కనుకనే తానే రంగంలోకి దిగి జరగబోయే కార్యక్రమానికి నాంది పలికాడు. పిల్లలతో చిన్నప్పటినించీ పార్వతమ్మ పడుతున్న అవస్థలూ, ఇప్పుడు ఎదురైన సమస్యలూ, వాటికి ఈ ఇల్లు అమ్మకమొక్కటే తప్ప వేరేదారి కనబడని పరిస్థితీ: అటు హరి, మధులకా ఇటు హరి మామగారికా అన్న సంగతి తేలకుండా వివరించి చెబుతూ పార్వతమ్మ తరఫున వకాల్తా తీసుకున్నాడు

వ్యవహారమంతా మామగారిమీదకు నెట్టిన హరిమటుకు మెదలకుండా ఊరుకున్నాడు.

పార్వతమ్మపడ్డ కష్టాలకు ఓదార్పు మాటలు చెబుతూనే, ఆవిడబిడ్డలవంటిదే తనబిడ్డ కాబట్టి వాళ్ళ వ్యవహారంలో జోక్యం కలగజేసుకుంటున్నట్టూ, తన సహార్దం చేసుకోవద్దనీ, ఇల్లు అమ్మడం తన కెంతమాత్రం ఇష్టం లేదనీ, అన్నాడు హరిమామగారు వాగ్వివాదానికి సిద్ధపడుతూ.

'మీ తప్పేమున్నది అన్నగారూ! మీరూ మేమూ ఇచ్చుకునీ పుచ్చుకున్న వాళ్ళం. పిల్లనిచ్చిన మీరొక్కరుమాత్రం బాధ్యత లేదని నేనుమాత్రం అనగలనా? మీకు తోచిన

(34వ పేజీ చూడండి)

# ఉదయమందలి తాజాదనము గంటల కొలది వుండేలా చేసుకోండి...

దానికి కావలసినది పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్! ఉదయం స్నానానంతరం పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్‌ను వొళ్లంతా జల్లుకొంటే తాజాదనము, హాయిని గంటల కొలది వుంచుతుంది. పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ యొక్క తేలికైన పరిమళము వొంటి మీద రోజంతా నిలిచి వుంటుంది. చెమటను త్వరగా పీల్చే గుణము గల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ మండే ఎండలలో, ఉక్కబోసే వాతావరణములో మిమ్మలిని సేద దేర్చి, తాజాగా, హాయిగా, పరిమళంతో వుంచుతుంది. సంవత్సరమంతా అన్ని వాతావరణములలోను మీరు వాడదగినది పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్!




**పాండ్స్**

డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ —

**ఎంతో మెత్తటి మేలు రకం టాల్క్!**

చీస్‌బ్రో - పాండ్స్ ఇనకార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

# పరివిప్రం

సీరియల్

శిఖా వెంకటరమణ



## జరిగిన కథ

జయ మేనమామ కొడుకు కాళిదాసు. చదువుల కోసం మద్రాసుకి వెళ్లారు. అక్కడ జయకి సాంబు కనిపిస్తాడు. సాంబు జయని గుర్తు పడతాడు గని, జయ సాంబుని ఎరగనంటుంది. సాంబు కాళిదాసుతో తన కథ చెబుతాడు. జయ సాంబుని గుర్తుపట్టినట్లు చెబుతుంది. మార్గరెట్ సాంబుని ప్రేమించిన వ్యక్తి. ఆమెకి జయ అంటే గిట్టదు. మార్గరెట్ సాంబుచేత తిరస్కరింపబడి స్వదేశానికి వెళ్లిపోతుంది. కాళిదాసు భారతి భార్యాభర్తలవుతారు. జయ గర్భవతి అవుతుంది. కాళి సాంబు కోసం వెతుకుతాడు. అతను దొరకడు. జయ కాళిదాసు కొడుకునే తన స్వంతకొడుగ్గా పెంచుకుంటుంది. మళ్లీ పెళ్లి చేసుకోవాలన్న అభ్యర్థనని జయ కొట్టిపారేస్తుంది. రఘురాం నిజంగా జయ కన్నకొడుకే అని తెలుసుకుని భారతి కుమిలిపోతుంది. రఘురాం ఇల్లు విడిచిపెట్టి కన్నతండ్రిని వెదకడానికి బయల్దేరుతాడు.

## 12

వరుసక్రమంగా వున్న తారీఖులు. కొన్ని అతిముఖ్యమైన సంఘటనలు, మరికొన్ని రోజులవారీ కార్యక్రమాలు. ఆకుపచ్చని డైరీ కాగితాలు రఘురామ్‌ని చిత్రవధ చేస్తున్నాయి.

..................

జయకీ భారతికీ ఒకేసారి ప్రెగ్నెన్సీ రావడం యెంత అదృష్టం - ఈ రాత్రి యిద్దరూ క్లినిక్‌లో చేరారు. పురుడు త్వరగానే రావచ్చును.

..................

ఆయన దైవాన్నే మించిపోయేరు. ఇటువంటివాళ్లుకూడా వుంటారా ప్రపంచంలో. భగవాన్! నారుపోసినవాడు నీరు పోయకుండా వుండడని యిందుకే అన్నారేమో. ఆయన యిద్దర్నీ కంటికి రెప్పలా చూడడం నా అదృష్టమేనేమో......

..................

భగవంతుడా యెంత చిత్రంగావుంటాయి నీ లీలలు. ఈ కడుపుకోత భారతి భరించగలదా. నా కంఠంలో యేమిటీ వుండలు కట్టిన బాధ? యెలా భరాయించాలీ వేదనని. కన్నకొడుకని మురిసిపోయినంతసేపు పట్టలేదు. భారతికి స్పృహ రాలేదు. ఆయన చెప్పినట్లు చేయటం సబబుగనే వున్నది. సంఘంలో బ్రతకడం యెంత కష్టం లేకపోతే.

..................

పాపం భారతి. యెవర్ని చూసి జాలి పడను? యెవర్ని వోదార్చను. అటు మాతృప్రేమకోసం తల్లడిల్లిపోయే జయ, యిటు తన బిడ్డేనన్న భ్రమలో పెంచుకుంటున్న భారతి. భగవంతుడా యిదేం పరీక్ష. నేను మామూలు మనిషిని. నాకు సాధ్యం అవుతుందా ఈ రహస్యాన్ని కాపాడుకోవడం.

..................

జయని చూస్తూంటే కళ్లు చెరువులవుతున్నాయి. గుండెల్లోకి వాడిని తీసుకుంటూ యేడుస్తూంటే నోటిదాకా వస్తున్నాయి 'నీకొడుకేనమ్మా' అని చెప్పేయాలనే పదాలు. ఈ ప్రమాదం జరగకూడదు. అందుకే సాధ్యం అయినంతవరకూ క్లినిక్‌లో గడిపేయడం మంచిది. నాకు తెలుసు యెవర్నీ వొప్పించలేను, యెవరికీ సంజాయిషీ యివ్వలేను. భారతి పిల్లడితో మురిసిపోతోంది. పాలు త్రాగుతున్నవాడి గుప్పిళ్లు పెదవిదగ్గర అన్చుకుని. యిప్పుడు నిజం చెప్పేస్తే...అమ్మ బాబోయ్! ఈ దారుణాన్నీ, ఈ నగ్నసత్యాన్నీ యెలా భరిస్తారు యిద్దరూ. రాఘవరావుగారు ప్రమాణం చేయమన్నందుకు కట్టుబడకపోతే పట్టుబడేవాడినే.

..................

డాక్టర్ మళ్లీజన్మలో కలుస్తే జయని స్వీకరిస్తావా. తన భర్త బ్రతికేవున్నాడనీ, ఈ జీవితంలో తెలిసి చేసినా తెలియక చేసినా తప్పు తప్పే కనుక శిక్ష భరించాలనీ జయపడే మూగవేదన నీకెలా అర్థం అవుతుంది.

డైరీలన్నీ తిరగతోడినా యెక్కడా అతని పేర్లు లేదు. నలుగురైదుగురు డాక్టరు పేర్లు యేదో కేసు సందర్భంలో రాసినవి మాత్రం

వున్నాయి. దుర్గానారాయణ్, దీక్షిత్, చంద్రవదన్, సాంబశివం, మాణిక్యం, జయదేవ్...యిందులో యెవరు తన తండ్రి?'

'యిప్పుడేమంటావ్'

రఘురావ్ బింకంగా నవ్వి 'యీ పిల్లడు నేనే అనే నమ్మకం యేమిటి?' అని ప్రశ్నించేడు.

'ఈ డైరీ చదువు'

'..................'

మోహన్ పుట్టాడు. చాలు. నేను గతంలో పడే బాధకి అంతా దరీ యేర్పడింది. యిప్పుడు భారతీ, జయా, యిద్దరూ పిల్లడినిగురించి మామూలుగా వుంటున్నారు. యెంతైనా మొదటిబిడ్డడి అపురూపం వేరు

అది చదివేక రఘురావ్ కళ్లల్లో చింత నిప్పులయ్యేయి. కణకణలాడే అగ్గిముక్కలు రాలిపడ్డట్టు చెంపలు కందిపోయేయి.

'ఇంకా సాక్ష్యం కావాలా. ఈ బుజావు చాలదూ,' మోహన్ సగర్వంగా వొత్తి వొత్తి పలికేడు.

రెండుచేతులమధ్యా తలదించుకుని ఆలోచనాముద్రలో కింకర్తవ్యతా విమూఢుడై గడిపేడు. తెల్లవారేకనో రాత్రి సమయంలోనో సంజాయిషీకోరాలనే బయలుదేరాడు. యిప్పటివరకు తృప్తికరంగా యే సమాధానమూ దొరకలేదు. అన్వేషణ ఫలితం యివ్వలేదు. అతడు విదేశాల్లో వున్నాడు. పెళ్లిఅయివుంటే అర్థంలేని ప్రయాసయిది.

'యింకా నిద్రపోలేదూ. యింట్లో ఘుమఘుమయింపుగా వుంది. యెక్కడిలేని యెండలూ ఈ గుంటూరులోనే సంప్రాప్తమైనట్లు మనిషిని తడిపేసే వుక్కపోత. వీధిలో పక్కవేశాను వెళ్లి అక్కడ పడుకో రాఘవ్' రాజ్యలక్ష్మి జామచెట్టు క్రింద మంచం వాల్చి పరుపు పరిచి రాబోయే అల్లుడికి సకల మర్యాదలకీ లోపం రానివ్వడం లేదు.

'అలాగే అత్తయ్యా' అంటూ లేచాడు మాసినబట్టలు వుతికి గాలిలోకి యెండ వేసింది రాజ్యలక్ష్మి. మేనమామ రాత్రి వేసుకునే గళ్లపైజామా, లాల్చీ వేసుకుని తువ్వాలు భుజంమీద వేసుకుని బయటికివచ్చి మంచంమీద మేను వాల్చేడు.

ప్రకృతిలో వెండివెన్నెల పిండారబోస్తోంది. నల్లని పిల్లగాలులు అలసి



శ్రమపడిన అతని శరీరాన్ని వెచ్చగా, హాయిగా జోకొడుతోంది. హిమబిందు మంచినీళ్ల చెంబు మంచంక్రింద పెట్టేసి వెళ్ళిపోయింది. అతనీసారి కిమ్మనలేదు. అతను వదిలిపెట్టాలనుకున్నా అతడిని కౌగలించుకున్నట్లు విడిచిపోలేమంటున్నాయి ఆలోచనలు. తను యెందుకు బయలుదేరినట్టూ? తీరా యిక్కడికి వచ్చేక యేం సాధించదలుచుకుంటున్నట్టూ? స్వార్థం కాకపోతే ఆ పట్టుదల యేమైపోయింది? హిమబిందు చిదిమి పెట్టిన అందం బిగించివేసిందా కాళ్లకి సంకెళ్లు వేసి? తన అన్వేషణ యింతటితో ఆగిపోయిందా? యీ రాత్రికి రాత్రి పారిపోతే...ఇన్నాళ్లు ఆయన యెందుకు పెంచేరు? యిందువల్ల ఒరిగిన లాభాలు యేమిటి? యెక్కడికి వెళ్ళి ఆత్మసంయమనం చేసుకోవాలి? తానీజన్మకు పవిత్రత యెరిగే అవకాశం లేకుండా పోతోందా... దూరంగా రెండుగంటలు వినిపించేయి. ఆలోచనలమధ్య తెల్లవారిపోతోంది. లేచి నిలుచుని తువ్వాలు దులిపి భుజంమీద వేసుకుని కుళాయి తిప్పి మొఖం కడుక్కొని ఎండేసినబట్టలు మంచంమీద పడేసి షర్టు వేసుకుంటూ జామచెట్టుగుండా ఆకాశంలోకి చూడసాగాడు. అప్పుడే చంద్రుడు మేఘాల చాటుకి వెళ్ళిపోతూ చేసేపనికి సాయంచేస్తూ కృతకృత్యుడౌతున్నాడు.

# పరిలిప్తం

భుజంమీద చేయిపడగానే తృళ్ళిపడ్డాడు. రాజ్యలక్ష్మి మసకవెన్నెల్లో స్వచ్ఛంగా నవ్వుతూ ప్రత్యక్షం అయింది. 'నాకు తెలుసును నువ్వు యెప్పుడో యిలా దాటేస్తావని. నీభారాన్ని నేను వహిస్తాను. నీకా యింటి ప్రసక్తి వద్దు. యిక్కడే వుండిపో. ఇందులో నువ్వు సిగ్గుపడవలసిన పనిలేదు. విషయాలన్నీ మి మామయ్యకి చెప్పడం అయింది. ఆయనే ఒప్పుకున్నారు. నీ యిష్టంవచ్చిన చదువుకి వెళ్లు.'

'ఒక అనామకుడిమీద మీకెందుకీశ్రద్ధ'

'చెప్పానుగా అది నాన్నగారి ఆజ్ఞ అని.'

'మంచివాళ్లకే మంచిబుద్ధులతో పిల్లలు పుడతారు. నా ప్రవర్తన అంత మంచిది కాదు.'

'అలాగని యెవరన్నారు?'

'నేనే అంటున్నాను'

'బలవంతాన నిప్పులో దూకుతాను అనే వాళ్లకి వాళ్ల ఖర్మానికి వదిలేయడం ధర్మం కాదు. అది నిప్పు అనీ, తాకుతే చురక వేస్తుందనీ, ప్రవేశిస్తే దగ్ధం చేస్తుందనీ చూసి కనిపెడుతున్న అనుభవజ్ఞులు చెప్పాల్సిన బాధ్యత యెంతైనా వున్నది. నువ్వు ఈ రాత్రే యిలా వెళ్లిపోదలుచుకుంటే బలవంతం చేయను. బలవంతంగా నీ మనసుకి తాళంవేసి ఆపేయగల శక్తి నాకులేదు. ఈ పొలిమేరలు దాటేవంటే నీ బ్రతుకెంత ప్రమాదంలోకి జారబడిపోతుందో, యేవిధమైన గోతిలోకి నువ్వు ఈడ్చుకువెళ్లి పోబడుతున్నావో గ్రహించ గలుగుతావు'

'నా దగ్గరే వుంటే అమరసౌఖ్యాలు కల్పిస్తాననీ, నీ వునికిని స్వర్గధామం చేస్తాననీ వెర్రి వెర్రి వాగ్దానాలు చేయను. నీకు చదువు చెప్పించి నా బిడ్డనిచ్చి పెళ్లి చేస్తాను. వింటున్నావా !'

'ఆఁ,' తలెత్తి అన్నాడు రఘురావ్.

'ముందు పెళ్లిచేసుకో. కాలేజీలు తెరిచేక నీయిష్టం యేగ్రూప్ తీసుకుని చది[illegible] మాకు అభ్యంతరంలేదు'

'ఈ.. విషయం...'

'నా బాధ్యత అది. తమ్ముడు కాశీదాసుకి రాస్తాను. వాళ్లందరూ రావలిసిన అవసరం లేదు. మరిచిపోబోయే నీకు అవన్నీ గుర్తుచేయాలని నాకులేదు. నీ బ్రతుకో మంచిత్రోవన పడితే చచ్చిపోయి స్వర్గాన వున్న మా నాన్నగారికి యెప్పుడో ఒకప్పుడు ధైర్యంగా సమాధానం యివ్వగలను. ఆయన ఆత్మ శాంతిస్తుంది నువ్వు నే చెప్పినట్లు వింటే.'

'తెల్లవారితే మావయ్య అడగరా ?'

'అవన్నీ నేను చూసుకుంటాను. ప్రపంచంలో అటువంటివాళ్లు అరుదుగానే కనిపిస్తారు. నేను యేపని చేసినా ఆయన ఆమోదముద్ర వుండనే వుంటుంది.'

'హిమ...'

'చిన్నపిల్ల అయినా చాలా తెలివైంది. కన్నకూతురు గురించి యిలా చెప్పడం సబబుకాదు కానీ అది అన్నీ తెలుసుకుంది యిటువంటి వాటిల్లో రహస్యం వుంటే యెంత ప్రమాదమో నీకు ప్రత్యేకం చెప్ప నవసరం లేదనుకుంటాను. నువ్వంటే దానికి యిష్టం...'

'అయితే నేనింక వెళ్ళాల్సిన పనిలే దత్తయ్యా'

'యింక నిద్రపో. యిదే నీ వాగ్దానం అనుకుంటాను అటువైపు వాళ్లెవరూ యింక రారు. తమ్ముడి స్వభావం నాకు తెలుసు. మంచి మనుషులని శూలాలతో గుచ్చి బాధపెట్టే మాటలనడం వివేకవంతుల లక్షణం అనుకోను. ప్రొద్దుపోయింది. సరిగా కప్పుకో. చలిగాలి తిరగ



# సయానమిడ్ మెలాథియాన్

వేరుసెనగ, చెఱకు, ప్రత్తి, పొగాకు, కూరగాయలు, పళ్లు, ఇతర పంటలను, అనేక రకాల పురుగు తెగుళ్లనుండి రక్షిస్తుంది.

## పురుగులకు ప్రాణాంతకం...

సుమారు 100 రకాల పంటలకేగాక, పెరిపిన ధాన్యమునకు, పశువులకు, పెంపుడు పులుగులకు, ఇతర పెంపుడు జంతువులకు సంబంధించిన, 700లకు పైబడిన తెగల పురుగులకు ప్రాణాంతకమైనది ఒక్క చుక్క మెలాథియాన్ వేలకు వేల పురుగులను చంపుతుంది.

పురుగుల బారినుండి మీ పంటలను సురక్షితంగా ఉంచు కొనుటకు, హామీగల నాణ్యతకై, సయానమిడ్ మెలాథియాన్, టెక్నికల్, (ఐఎస్ఐ యోగ్యతా పత్రము నం. ఐ. ఎస్. 1832)నుండి తయారు చేయబడిన మెలాథియాన్ కీటక సంహారక పదార్థములనే ఎల్లప్పుడు వాడండి!

IS 1832












## మీకు నిరపాయం...

ప్రజలకు, పంటలకు, పశువులకు, పెంపుడు పులుగులకు, ఇతర పెంపుడు జంతువులకు నిరపాయమైనది. దీని వాడుటకు, ప్రత్యేకమైన దుస్తులుగాని ఇతర జాగ్రత్తలుగాని, ఏమియు అవసరము లేదు. కోతలు జాగుచేయు, వలసిన అగత్యం లేదు.

మెలాథియాన్ కీటక సంహారక పదార్థములు అమ్మకము చేయువారు




ఇ.ఐ.డి. పారీ లిమిటెడ్,
పో. బా. నం. 12, మద్రాసు-1




సయానమిడ్ ఇండియా లిమిటెడ్, పో.బా. 6577, బొంబాయి-18 WB

ఖెట్టింది? రాజ్యలక్ష్మి మెట్లమీదుగా వెళ్లిపోతున్నట్లు కాలిమెట్టెల శబ్దం లయబద్ధంగా, అపశ్రుతి లేకుండా రఘురావ్ మనసులో జోకొడుతూ పాటపాడుతున్నంత హాయిగా తోచింది.

వేసవి మొదట్లోనే గుంటూరు పురవాసులు తృప్తిపడే విధంగా ఫెళ్లున చేశాడు మాధవరావు తన యేకైకపుత్రిక వివాహం. మెద్రాసులోవుండే యే ఒక్కరూ రాలేదనే కొరతగానీ నాలుగు కాలాలపాటు మాధవరావుచేసిన పెళ్లి ఘనంగానే చెప్పుకునేట్లు జరిగింది. ఆరడుగుల యెత్తులో మంచి శీపీ, దర్పం వుట్టిపడేట్లు పసిమిచ్ఛాయలో సవాల్ చేస్తున్నట్లు నిలబడే మీసాల్లో చూపరుల నిట్టే ఆకర్షించేడు రఘురావ్. కుందనపు బొమ్మలా, అందానికి నిర్వచనంలా మిసమిసలాడే యౌవ్వనంతో సరిజోడి అనిపించుకుంది హిమబిందు.

పెళ్లిఅయిన వారంరోజుల తరువాత ఓ నాడు, అడిగేడు మాధవరావు అల్లుడిని చేరబిలిచి: 'నీకేం చదవాలనుందోయ్,' అంటూ.

'ముందు గ్రూప్ నెనుక్కోండి,' రాజ్యలక్ష్మి అన్నది.

'నాకు లా చదవాలనుంది మావయ్యా. ఆర్ట్సులో పాసైనా, కామర్సులో పాసైనా ఒకటే. ఆర్ట్సు నాకిష్టమైన గ్రూపు.'

కాలేజీలు తెరవగానే హిమబిందు స్కూలులోనూ, అతను కాలేజీలోనూ చదువుకి ప్రవేశం అయేరు. రఘురావ్ గతాన్ని ఆలోచించుకునేందుకు వ్యవధిలేదు యిప్పుడు. పగా, ప్రతివారం యెక్కడో హృదయాంత రాళాల్లో నిద్రపోతున్నాయి ఆదమరచి. తాత్కాలికంగా వుపశమనం పొందినట్లే అయిపోగా రాజ్యలక్ష్మి తృప్తిగా గాలిపీల్చుకుని తమ్ముడిని బెంగపెట్టుకోవద్దనీ, భారతిని ధైర్యంగా వుండమనీ, జయుని బంగారు పడవద్దనీ కొన్నేళ్ల కైనా అతడు మారవచ్చునీ, అప్పటివరకూ వోపికగా పర్యవసానంకోసం యెదురు చూడమనీ, తాము కులాసాగా వున్నట్లూ రాసి తెలిపిన వడింది.

* * *

మోహన్ తమాషా చూద్దాం అను

# పరిలిప్తం

కున్నట్టుగా పెట్టిన చిమ్మ యింతింతైన సామెతలో యెదిగి యెదిగి యింటిల్లిపాదినీ అందులోకి తోసేసి యేమీ యెరుగనట్లు గుంభనగా పారిపోయింది. ఆరాత్రికి రాత్రే అతడు పారిపోయేడు. యెక్కడికి అన్న ప్రశ్నే లేదు. అతని కాళ్లు తిన్నగా జడ్జీగారి అందమైన యేడంతస్తుల గృహప్రాంగణం ముందు ఆగాయి. ఆయన కళ్లు నులుముకుంటూ నిద్రావస్థలోంచి యదార్థలోకానికి వచ్చేసి 'నువ్వా', అని మొహంనిండా నవ్వు పులుముకుని సాదరంగా లోపలికి ఆహ్వానించేరు. మోహన్ తదేకంగా ఆయన మొహంలోకి క్షణం చూసి నిర్భయంగా అడిగేరు: 'నన్ను మీ యింట్లో వుంచుకుంటారా కొన్నాళ్లు.'

ఆ ప్రశ్నకి ఆయన నిలువునా చీల్చినట్లూ, యధాస్థితికి వచ్చేందుకు యెంతో ప్రయత్నం చేస్తున్నట్లూ గుమ్మందగ్గరే ఆగిపోయేరు.

'కొన్నాళ్లపాటు మీయింట్లో వుండనివ్వండి నన్ను'

అప్పుడే తేరుకున్నట్లు తెరిపిన పడి 'అలాగే లోపలికి రావోయ్ వీధిలోనే వుండిపోయేవు', అన్నారు.

మోహన్ గదిలోకి అడుగుపెట్టేడు. పూర్వం అక్కడే, జడ్జీగారి కూతురికీ, మోహన్‌కీ ప్రథమ వీక్షణాలనేవి జరిగేయి.

## ఉత్తరాలు రాసేవారికి మనవి

ఉత్తరాలు రాసేవారు ఈ కిందివి గమనించగోరుతాము.

—రచనలలో ఇంగ్లీషు లిపి వాడరాదు.

—రాసేవారి పూర్తిపేరు చిరునామా ఉత్తరంలో ఉండాలి. అంతా తెలుగు లిపిలోనే ఉండాలి.

—అన్ని ఉత్తరాలూ వ్యక్తుల పేర కాక సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రికకి రాయాలి.

—సంపాదకుడు

యిప్పుడా పిల్ల మామూలుగా ఆహ్వానించే ప్రదేశంలో లేదు. మేడమెట్లుదాటి పైనున్న బాల్కనీవైపు మళ్లి ఆ ప్రక్కనే ప్రత్యేకం యేర్పాటు చేయించి వుంచిన యేకైక పుత్రికారత్నం ఉమాదేవి గదిలో కేవలం ఖాళీ శయనాగారం కనిపించింది.

అతను క్షణం నిర్ఘాంత పోయేడు. యెక్కిన మెట్లు రెండేసిచొప్పున దిగేసి క్రిందికి ఫోల్లోకివచ్చి ఆయన్ని ప్రశ్నించాలనుకుని 'యిదికాదు సమయం,' అనుకున్నాడు.

పన్నెండూ, ఒంటిగంటా దాటిపోయినా యింట్లోవాళ్ల అలికిడే లేదు. యిల్లంతా నిశ్శబ్ద నీరవాన్ని ఆక్రమించుకున్నది. సమయం గడుస్తుంటే మోహన్‌కి దిగులుగావచ్చి ఆ యింటినౌఖరు దారిచూపుతూ అన్నాడు: 'మిమ్మల్ని అయ్యగారు మిద్దె మీదే పడుకోమన్నారండి.'

క్షణం వాడి మొహంలోకి తటపటాయించి చూసి మెట్లమీదుగా తను అప్పుడప్పుడు ఉమాదేవితో వుల్లాసంగా కబుర్లు చెప్పే ఆ గదిలోకి వెళ్లి మంచంమీద విశ్రమించేడు. కంటిమీద కునుకుదూరం అవగా మోర పైకెత్తి వాసాలమీద దృష్టి నిలిపేడు.

ఝాము ఝాముకీ కోళ్లు కూయడం అతనికి గుర్తుగానే వుంది. !యేమిటి యిలా వచ్చేను ? ఎందుకిలా చేశాను — అనుకోని క్షణంలేదు. రఘురావ్‌కి ఆ యింటగల ఆధిక్యతకు ఈర్ష్యతో చిచ్చురేపాలనే ప్రయత్నం చేశాడేగానీ తను రేపిన ఈ దుమారంలో యెండుటాకులా గలగలా యెగిరి పోతాడనుకోలేదు అన్నమీద యెందుకు కోపం వచ్చింది? మోహన్ కళ్లకు క్రమంగా పాత రోజుల బంగారు ఘడియలు వెటకారంగా నవ్వుతూ కనిపించేయి.

'దానిజోలి నీకెందుకురా అన్నా! అది వట్టి పొగరుమోతు గొడ్డు,' అన్నగారి బుజంమీద చేయివేసి తమ్ముడు రేవడీయబోయాడు.

'లేద్దురా తమ్ముడూ. యిది...యిది నిన్ను అంతమాట అంటుందా. మళ్లీ అను చూస్తాను. పళ్లురాలగొట్టి చేతిలో పెట్టకపోతే', ఆవేశంగా చెప్పుతూ రఘురావ్ తమ్ముడికి దూరంగా జరిగేడు.

పసివయసులో ప్రేమామృతాలతో నిండిపోయిన ఆ హృదయాల్లో యిప్పుడు కాలకూట విషం యెలా ప్రవేశించింది. అది ప్రవేశించడమే కాకుండా మనుషుల మనసుల్నీ పరిసరాల్నీ యెలా దగ్ధం చేయగలుగుతోంది. ఒక కంచంలో అన్నకే ముందు పెరుగుముద్ద పెట్టమన్న తనేనా యిలా అక్రమంగా అన్యాయంగా స్థానం కోసం అక్కను వెళ్లగొట్టుకుని యెంత పని చేశేగు? ఆనాటి చిన్ని పాట్లాటకి కారకురాలైన ఉమనే సర్వస్వంగా యెలా ప్రేమించ గలుగుతున్నాడు? తల్లి పాలు తాగి ఆ తల్లియెదలో ముల్లులా గుచ్చ గలిగేడు? ఇంతకీ కారకుడు... అవును బీచ్‌దగ్గర ఉమతో తనని చూసిన జయ ఆ విషయం బట్టబయలుచేస్తే తనకి మరి దారి లేదు. తండ్రి దేహశుద్ధి చేయడమే కాకుండా వూరి పొలిమేరలకికూడా రానివ్వడు అందుకే అణగారిన ప్రతీకారం వేయినాల్కలలో విజృంభించి ఆత్మరక్షణకోసం చేసినట్లే తనని నాశనంచేసి యింటిల్లిపాదినీ వ్యథా సముద్రంలో ముంచేసి చివరికి... మోహన్ చంటిపిల్లవాడి మాదిరిగా బుగ్గలమీదజారే కన్నీరు తుడుచుకుంటూండి పోయేడు. అతన్ని వోదార్చేందుకుగానీ, ఆ వేదన పంచుకునేందుకుగాని కోరుకున్న ప్రియురాలు కంటికీ కనిపించని విధంగా మాయమైంది.

* * *

భళ్లున తెల్లవారింది. తూరుపు దిక్కున వెలుగు రేఖలు వెక్కిరిస్తూ మోహన్ మొహంమీద కళ్లాపు చల్లినట్లే కాగా దిగ్గునలేచి కూర్చున్నాడు. క్రోధాగ్ని తాలూకు ప్రచండాగ్ని అతన్ని మండించి పున్నెత్తుగా ఉద్రేకాలపాలు చేసి చప్పున చల్లారిపోయి వాస్తవం బయట పడేసింది. వెచ్చని కోర్కె, ఇచ్ఛ, కామం మొదలైన దాంపత్యరహస్యాలకి నాందీవచనంగా ఆ ఉమ యిచ్చిన పుస్తకాలు యిప్పుడు గతి తప్పిన గాడి బోర్లపడింపుకే కారణభూతం అయేయని వొవర్లిపోయేడు. చేసిన తప్పిదం చెవి మెలేసినట్లూ, గొంతులో మరిగే సీసాన్ని కుమ్మరిస్తున్నట్లూ కాగా బిత్తరపోయి వెర్రిగా శూన్యంలోకి చూచేడు! 'ఫలితం శూన్యం' అన్నట్లు సవాలక్ష దొంతులు బీభత్సంగా అల్లరి పెడుతున్నాయి మనోవీథిప్రపంచంలో. ఇప్పుడు రెండడుగులు బలవంతాన ముందుకు వేసి వెనక్కి వేయడం లాభంలేదన్న గట్టి నిర్ణయంలో మెట్లు దిగి హాల్లోంచి వంటయింటివైపు మళ్లి 'అత్తా'. అని పిలిచేడు. జడ్జీగారి భార్య ఉలకలేదు, పలకలేదు. కాఫీ గ్లాసు అందించి పక్కకు తిప్పుకున్నది. అతను తిన్నగా వంటింట్లోకి ప్రవేశించి 'ఉమేది అత్తా', అన్నాడు

ఆవిడ నవ్వుమొహంతో 'వాళ్ల పిన్నిగారింటికి వెళ్లింది.'

'అలాగా', అంటూ జడ్జీగారున్న వసారాలోకి వచ్చేడు.

ఆయన హుందాగా పైపు నోట్లో ఉంచుకుని నైట్ గౌను విప్పకుండానే పచార్లు చేస్తూండి పోయేరు. మోహన్ ఆయన యెదుట నిలబడి అన్నాడు: 'నేను వచ్చేశాను జడ్జీగారూ, నాకేదైనా మంచి ఉద్యోగం చూసిపెట్టండి. ఇప్పటివరకూ మీమాట నేను జవదాటలేదు. మీ యిష్ట ప్రకారం మా యింట్లో పేచీపడి మరీ వచ్చేను.'

'ఆహా', ఆయన ఆత్యంతానందాన్ని పైకి కనబరిచీ కనబరచకుండా జాగ్రత్త పడాలనుకున్నా సాధ్యం కాలేదు. 'ఊఁ ఇంకా' ప్రశ్నా. జవాబూ వాటిలో మిళితం అయిపోయేయి.

'నేను తెలుసుకున్నది ప్రవేశ్లగక్కేనండి.'

'అయితే మీ నాన్నగారు ఏమన్నారు?'

'ఆయన అనేందుకు నేను అస్కారం యెక్కడ యిచ్చేనండి. మెడపట్టుకుని గెంటే అవసరాన్ని తప్పించుకున్నాను''

'మాడు మోహన్ మీనాన్నగారి స్వంత ఆర్జితంలో నీ భాగం యెంతుందంటావ్'

'యిరవైవేలకంటే యెక్కువవుండదండి'

'ఆయన యిస్తాడనే నమ్మకం నీకుందా?'

మోహన్ చిన్నగా నవ్వి 'అదెలా సాధ్య పడుతుందండి. నేను ఆ యింటికి దూరంగా వచ్చేక నాకేం సంబంధం. ఆయన పూర్తిగా అన్నకే యివ్వొచ్చు' అన్నాడు.

జడ్జీగారు విని వూరుకున్నారు.



# పరిలిప్తం

వారం రోజులు గడిచిపోయేయి. మోహన్‌కి అయినా సకల మర్యాదలూ నానాటికి క్షీణింపసాగాయి. వారంరోజుల తరువాత ఓ శుభపుదయాన ఉమ కార్‌దిగి వస్తూనే బాగ్ భుజాన తగిలించుకుని, మెడవరకూ వేళ్లాడే లోలకులు ఊగుతుండగా. రెండు జడలతో, పంజాబీడ్రెస్‌తో నూతనాలంకారాలతో, అధునాతనంగా, నవనాగరిక యువతిని అణువణువునా తనలో ప్రదర్శిస్తూ దర్పంలో అడుగు అడుగుంటి పొంగి పడుతుండగా 'మమ్మీ, డాడీ' అన్నది కేక వేసినట్లు.

ఇంటిల్లిపాదీ హోరుగా ప్రతిహోరుల్లా నిలుచుండిపోయేరు పిలుపుకోసం. ఉమ రాగనే హాల్లో వొక్కసారిగా నేలకొలిచే మెర్క్యురీలైట్లు వెలిగించినట్లయింది.

తల్లి అన్నది: 'పిన్నివాళ్లూ కులాసాగేరు తల్లీ'

'ఆఁ' ఉమ దృష్టి దూరంగా మేడమీద నిలుచున్న మోహన్‌పైన పడింది. ముఖం నిండా నవ్వులు కురిపిస్తూ 'హల్లో' అన్నది.

ఉమ రాగనే మామూలుగా మోహన్‌కి జరిగే మర్యాదలు క్రమం తప్పకుండా తలెత్తివేయి. జడ్జీగారికి కాబోయే అల్లుడికి జరగదగిన సత్కారాలకి లోపం యేర్పడలేదు.

ఆ రాత్రి ఆరుబయట వరండాకి దగ్గరగా లైటుకాంతిలో చదరంగం యెత్తు వేస్తూంటే ఉమ అడిగింది 'అసలు నువ్వు యింట్లోంచి దేనికి పారిపోయి వచ్చేవు?'

'మనల్ని జయపిన్ని చూసింది.'

'చూసే'

'తను చెప్పేయదా యింట్లో?'

'చెబితేమాత్రం యేమీ?'

'బాగుంది' నవ్వేడు అతను 'నాన్నగారు తోలుఒలిచి యెండబెడతారు'

'నువ్వేం చేశావసలు?'

'బీచ్‌లో పిన్ని అతనితో మాట్లాడటం, మీ నాన్నగారు అంచనా వేసి నాతో అన్న సంగతి విని బాడో పేడో తేల్చుకోవాలనుకున్నాను'

'అందువల్ల నీకు ఒరిగే లాభం అర్థం అయింది కాదు'

మోహన్ చిలిపిగా నవ్వేడు; 'నీకు తెలియనట్లు నటించకు నీ అందంతో యెన్నిసార్లు నన్ను వూరించేవు, ఆ అందం, ఆనందం నాకు స్వంతం కావాలంటే ఆ యింట్లోంచి బయటపడాలి. అదంత సులభం కాదు. అందుకే విప్లవం లేవదీశాను'

'మనం పెళ్లి చేసుకుందాం మీ నాన్నగారికి యిష్టమే కనుక'

ఉమ మరో ఎత్తులో పడిపోయి వెంటనే సమాధానం యివ్వలేకపోయింది. మోహన్ ఆట కట్టింది. చప్పట్లు చరుస్తూ అన్నది: 'చూడు నీ ఆట కట్టింది. అది సరే మోహన్ నీకేదో భాగం వస్తుందని నాన్నగారు అనుకునేవారు అదేమైంది.'

'ఓ, అదా? అది మా స్వంత ఆర్జితం కాదు ఉమా. మోహినిని చేసుకుంటేనే అది నాకు చెందేది.'

'అలాగా,' ఉమ లేచి నిలుచుంది. అప్పటికే ఆవలింతలు నెత్తిమీద స్వైర విహారం చేయగా 'నువ్వు భోజనం చేయి నేను వెళ్లాలి,' అన్నది.

మోహన్ అక్కడే కూర్చుండిపోయేడు. పరుల పంచన వుండడంలోగల హీనత్వం క్షణం దోబూచులాడగా అతని అరమోడ్పు కనులు మూతవేసుకున్నాయి. తను తెగించి యింత సాహసం చేస్తే యెంతవరకూ గెలుపొందుతాడో అర్థం కాలేదు. జడ్జీగారి సంతానం ఉమ ఒక్కతే కారణంగా తనని బహుశా ప్రేమపూర్వకంగా పెళ్లిచేసుకోవచ్చుననే ఆశ తప్ప యిప్పుడు మరేమీ దిక్కు తోచడం లేదు.

(ఇంకావుంది)

డాక్టర్ కబుర్లు

## డెంగీ జ్వరం

దీనికింకా ఎన్నో పేర్లు — మూడుదినాల జ్వరం, అయిదు



దినాల జ్వరం, ఏడుదినాలజ్వరం, జిరాఫీజ్వరం, బీలమండ జ్వరం, ఎముకలు విరిగే జ్వరం, డాండీ జ్వరం వగయిరా...

కీళ్లలో బాగా నొప్పులు వస్తాయి కాబట్టి ఎముకలు విరిగే జ్వరం అంటారు 'డెంగీ' అనే మాట కీళ్లనొప్పివల్ల నడకలో మార్పు రావటంవల్ల వాడుకలోకి వచ్చింది. ఈ జ్వరం దేహంలో ఏ భాగాన్నయినా బాధించవచ్చు—కంటి రెప్పలకీ జ్వరంబాధ కలగవచ్చు.

ఇది బాగా వయసు మళ్లిన వారికి సాధారణంగా రాదు

వ్యాధి దోమలవల్ల అంటుతుంది.

రోగం లక్షణాలు ఇదమిద్ధమని ఉండవు ఎన్నో రకాల బాధలు కలుగుతూ ఉంటాయి...

హెచ్. ఎల్. హెర్సన్‌సోన్

(కాపీరయిటు)

# ముద్దు

తెరపై ముద్దు
ప్రవేశ పెడితే ??












# ముద్దులు


అయ్యో బుగ్గలు పెదాలూ అలా కంది పోయాయేం బేబీ?
"తాసీను" షూటింగు పూర్తయి ఇప్పుడే వస్తున్నా!!


ఛి ఛీ! ఇహ చస్తే ఇంకో యిలాటి సినిమాలకు రాను


మనం చాల దురదృష్ట వంతులం! మనం హీరోలు గ నటించిన రోజుల్లో ఈ ముద్దులు లేవు!!


ఈ ముద్దులు వచ్చాక మన హీరోలందరూ చిత్రాల్లో కొత్త కొత్త హీరోయిన్లనే బుక్ చెయ్యమని గొడవ చేస్తున్నారు సార్!!
వెరైటీ! భలే!!

# కనువిప్పు

(21-వ పేజీ తరువాయి)

వలెనే మీరూ చెప్పండి.—పెద్దవాడు హరేమో నాకుగాని, వాడి తమ్ముడికిగాని డబ్బుపంపే స్థితిలో లేడాయె. ఇటు నేను చూద్దునా అద్దె డబ్బులో ఇల్లు గడవక ఊరినిండా అప్పులో, గుండెలమీద కుంపటిలాంటి ఎదిగిన ఆడపిల్లల్ని పెట్టుకుని రోజుగడవక అఘోరిస్తున్నాను. ఆ రెండోవాడి చదువొకటి మెడకో డోలయి కూర్చుంది. చదవమనటానికీ లేదు మాన మనటానికీ లేదు. వాణ్ని బి. యి.కి పంపక పోయినా బాగుండేది. అప్పుడేమో ఫస్టు క్లాసులో వచ్చాడనీ, అప్లికేషను పెట్టడం తరవాయిగా సీటొచ్చి పడిందనీ, హరే చంకలు కొట్టుకుని ఈ గంప శ్రాద్ధమంతా నెత్తికెక్కించాడు. ఇప్పుడు తప్పుకున్నాడనుకోండి. మరిప్పుడు నన్నేం చెయ్యమంటారో చెప్పండి' కొంత ఆవేశ పడుతూనే అడిగింది పార్వతమ్మ.

పరిమితంగా సాగిపోతున్న సంసారాన్ని ఈయనా, ఈయన కూతురూ కలిసి ఈ స్థితికి తెచ్చారన్న వుక్రోషం లోపల పని చేస్తున్న దావిడకి. 'నా బంగారం మంచిది కానప్పుడు ఎవర్నని ఏంలాభం ?' అనుకుంది. ఈ రోజుల్లో ఎవరి స్వార్థం వాళ్లు చూసుకోటంలో తప్పేమిటీ అని సరిపెట్టుకుంది. తన్ను తాను సమాధాన పరుచుకుని ఓర్పుగా సహించుకొస్తున్నది మొన్నటివరకూ.

కాని ఈ రోజు ఆయన ఎదటపడి తన ఒక్క కుమార్తె శ్రేయస్సుకోసం తనబిడ్డలందరికీ అన్యాయం తలపెడుతున్నాడే అన్న వుక్రోషం రెచ్చగొట్టిందామెని.

బుస్సుమనే తాచుపామును ఒడుపుగా మెడపట్టి కోరలు పీకే పాములవాడిలా, ఆయన లబ్జుగా, చల్లని కంఠస్వరం పెట్టి 'మీరలా అంటే నేనేమనగలను గానీ అక్కయ్యగారూ! నా కూతురి క్షేమం కోసం మాట్లాడక తప్పదు. ఇల్లేమో తాతగారి ఆస్తి. అది మగపిల్లలికే చెందుతుందన్న సంగతి మీకు నేను చెప్పాలిసింది కాదు. నా అల్లుడివంతు వచ్చేభాగం నేను అమ్మనీయ దలుచుకోలేదు. పిల్లాజల్లాతో పైకి రావాల్సిన వాళ్లు కదా. ఈ కాస్త ఆధారమన్నా లేకపోతే వాళ్లేమయి పోవాలి?' చల్లగా మెల్లగా పార్వతమ్మకేమీ హక్కు లేదన్న సంగతి బయటపెట్టాడాయన.

'మరి ఆడపిల్లల గతేమిటి హరీ ?' ఆవేదనగా హరివేపు తిరిగి అంది పార్వతమ్మ.

'అతనుమాత్రమేమంటాడమ్మా? ...' వియ్యపురాలి మాటలకు మధ్యలోనే అడ్డు తగిలాడు వియ్యంకుడు.

'మీరుండండి. అది వాళ్లా—వాళ్లా తేల్చుకోవాల్సింది' అంటూ ఆపాడు శివయ్య—కాస్త గద్దింపుగా.

మొదట్లో కొంచెం తత్తర బిత్తరలాడినా, పెళ్లాం చెప్పిన పాఠాలన్నీ బాగానే వల్లించాడు హరి. 'ఇల్లు అమ్మవద్దన్నాను గానీ ఆడపిల్లల్ని ఒదిలేస్తానన్నానా అమ్మా. అప్పుడే కమల పెళ్లికేం తొందర? మధు చదువయ్యేలోగా దీని చదువూ పూర్తవుతుంది. ఇద్దరం కలిసి చెల్లెళ్ల పెళ్లి చెయ్యలేక పోతామా?' అంటూ తేనె ఒలకబోసాడు హరి.

పూనకమొచ్చినట్టు వూగిపోయింది పార్వతమ్మ 'చేస్తావురా చేస్తావ్—పెళ్లి కాదురా...నీ చేతుల్లో పెడితే ఈ పాటికి వాళ్ల గొంతులు నులిమివుందువు. ఎక్కడ తాతగారి ఆస్తి మింగేస్తామో అని మామ గార్ని ముందేసుకుని నాటకమాడుతున్న వెధవ్వి. నువ్వు వాళ్లకు పెళ్లిళ్లు చేస్తానని నాకు భరోసా ఇస్తున్నావుట్రా? అంతబాధ్యత ఎరిగున్న ప్రబుద్ధుడవయితే పెళ్లాన్ని బుజాలమీద వేసుకుని పారిపోతావుట్రా? నీలాంటి స్వార్థపరుణ్ణి తోకపట్టుకుని గోదావరి ఈదడానికి నేను తల్లినిరా! బిచ్చమెత్తుకునన్నా నా బిడ్డల్ని పెంచుకుంటాను గాని ఇక నీ ముందు చెయ్యిజాపను' ఆఖరి మాటలదగ్గర కొచ్చేసరికి డగ్గుత్తికలో గొంతులో కొచ్చిన దుఃఖాన్ని బలవంతాన అణుచుకున్న దావిడ.

శివయ్య కలగజేసుకుంటూ 'ముందు సంగతి ఆలోచించుకోకుండా ఎందుకమ్మా వదినా అంత తొందర పడతావు?' అని పార్వతమ్మను సమాధానపరుస్తూ హరి వంక తిరిగి 'సరే కమల పెళ్లిసంగతి నువ్వు చెప్పినట్టు తరవాతే చూడవచ్చనుకో. మరి మధు చదువు ఆపడమెలా? ఇప్పుడు—ఈ స్టేజిలో వాడి చదువుకన్నా డబ్బు పంపడానికి నీకు వీలవుతుందా లేదా? ఖచ్చితంగా చెప్పు' అంటూ నిగ్గదీశాడు.

'నెలనెలా వందరూపాయలు పంపడానికి ఇబ్బందిగానే వుంది మరి...' అని నాన్చాడు హరి.

అతని నాన్పుడు చూస్తే శివయ్యకూ తట్టుగాలి రేకెత్తుకొస్తున్నది. ఇటు తల్లికి పంపక, అటు తమ్ముణ్ణి చూడక ఇక వీడికున్న పెద్ద ఖర్చు లేవిటి?

హరి వాలకం చూశాక పార్వతమ్మకి ఆగ్రహం. ఆవేశం మళ్లీ కట్టలు తెంచుకుంది 'వాడేమీ పంపనక్కరలేదులే మరిది! ఎవళ్లకున్నది వాళ్లే తింటారు. వాడివాటా వాణ్ని జాగ్రత్తగా రిజిస్టరు చేసుకు పొమ్మను. తెగనమ్మైనా చదువుకుంటాడు



తాకట్టు పెట్టుకుంటాడో వీడిది వీడు చూసుకుంటాడు' అంది పుల్లవిరిచినట్టు.

హరి ఏమంటాడో అని వాడివంక ఆశగా చూస్తున్న శివయ్యతో 'ఇక లే మరిదీ ఆ సంగతిచూడు. వాడు దానికోసమే వచ్చాశ్లే' అంటూ లేచి చక్కాబోయింది అక్కణ్ణించి.

తల్లి వెళ్ళినవైపే చూస్తూ 'అది కాదు చిన్నాన్నా నేనెలా చదువుకున్నానో వాణ్ణీ అలాగే...' అని జావకారిపోతూ మాట జారుస్తున్నఅల్లుడికి అడ్డం పడుతూ.

'బావగారూ కష్టమో, నిష్ఠూరమో అక్కగారన్నట్టు కానిస్తేనే బాగుంటుంది' అంటూ కంగారుపడిపోయాడు హరిమావగారు. ఆయనవంక ఈసడింపుగా చూస్తూ 'నిజమే చిన్నాన్నా ఎవరిది వాళ్ళకు రిజిస్ట్రేషన్ అయితేనే మంచిది' అన్నాడు మధు మొదటిసారిగా నోరువిప్పుతూ.

అక్కడితో ఆ విషయం నిష్కర్షగా తేలిపోయిందన్న మాటేగాని మరోదాని దగ్గర ముక్కట్టుకున్నది.

ఉన్న అప్పుకూడా అన్నదమ్ములిద్దరికీ చెరి సగమని హరి మామగారు అనటంతో పార్వతమ్మ ససేమిరా అంగీకరించ లేదు. అది పూర్తిగా హరి చదువూ — పెళ్ళి నిమిత్తం అయిన మొత్తం. అది ఎంత మాత్రమూ మధుపైన రుద్దడానికి వీల్లేదన్నది. అలా అయితే మధు చదువూ పెళ్ళీ అయ్యేదాకా నోరుమూసుకోండి' అన్నది. దానితో మొదటికే మోసమొచ్చిందనుకున్న వియ్యంకుడు అప్పటికప్పుడు తనే ఆ నాలుగువేలూ మదుపు పెట్టి అప్పు తీర్చి రిజిస్ట్రేషను చేయించి, ఊపిరి పీల్చుకున్నాడు. అప్పటికిగాని తాను కూతురికి చేయగలిగినంత సాయం చేశావన్న తృప్తి కలగలేదాయనకు.

మధు కొచ్చిన భాగం అమ్మేకంటె దానిమీద అప్పు తెచ్చుకుంటేనే ఎప్పటికైనా ఆమెకు మాటరాదన్న శివయ్య సలహా శిరసావహించింది పార్వతమ్మ. ఒకసారి ఎదురుదెబ్బ తిన్నాక వెంటనే తప్పుదారిన పడతెవ్వరూ! మధుమాత్రం ఇప్పుడు తన వాడైనా, ఎప్పటి కెవరో? ఎవరినీ నమ్మలేని స్థితిలో వుందామె.

మధు చదువుతోపాటు ఇప్పుడు ఇంటి ఖర్చుకూడా కటకటగా వుంది. హరివాటా అద్దె డబ్బు హరికే పంపేస్తోంది. 'నువ్వుంచుకో' అన్న హరి ఉత్తరానికి జవాబు కూడా ఇవ్వలేదామె. ఇటు ఆడపిల్లల చదువులకి ఫీజులేదన్న మాటేగాని, పుస్తకాలనీ, పెన్సిళ్ళనీ పై ఖర్చు వుండనే వున్నది.

క్రమక్రమంగా పార్వతమ్మ పరిస్థితులకి లొంగిపోక తప్పలేదు. ఆలోచనలూ మారేయి. నాదనుకున్నదే చాలన్నట్టుగా తప్పించుకుంటున్న హరినెందుకు వదిలెయ్యాలి? మధు మీదే పూర్తిగా ఎందుకు ఆధారపడాలి? తల్లిని — నేనే ఎందుకు వెనకాడాలి! అనుకుంటూ హరివాటా డబ్బుకూడా తరవాత తరవాత వాడుకుంటూ వచ్చింది.

తనవాటా అద్దె డబ్బు తల్లి తీసుకుంటున్న తరవాతగానీ హరి మనసు కుదుటపడలేదు. అప్పటిదాకా లోకానికి విరుద్ధంగా తల్లికీ, చెల్లెళ్ళకీ ద్రోహం చేస్తున్నానన్న మధన వ్యాకులపెడుతూనే వుంది లోలోపల. అంతలోనే, 'నే చెప్పలేదుటండీ పూర్తిగా తల్లీ ఆడపిల్లలూ తనమీదే పడితింటుంటే అతను మాత్రం వూరుకుంటాట్టండీ? ఏదో జరిగే వుంటుంది. మీకు గాబట్టి నేను అన్నాళ్ళ బోధించాల్సొచ్చిందిగాని ఈ రోజుల్లో ఒకళ్ళనేస్తే సంగతులటండీ యివి?' అన్న కల్యాణి మాటలు నమ్మాడో లేదో కాని అలా జరిగితే బాగుండునని మాత్రం ఎందుకో అనిపించిందతనికి. తప్పుచేసినవాడికి ఇంకో తప్పు చేసేవాడున్నాడంటే మనస్సంతృప్తిగా వుంటుంది.

ఈ గందరగోళంలో కమల పెళ్ళి అనుకోకుండానే అడుగున పడిపోయింది.

కమల పి. యు. సి పాసై వూరికే కూర్చోలేక టైపూ, షార్టుహేండూ కూడా నేర్చుకుని పరీక్షలకు వెళ్ళేనాటికి మధు చదువు పూర్తయింది. కడసారిది లక్ష్మి ఫిఫ్తుఫారంలోకి వచ్చింది.

పైకి బింకం సడలకుండా నెట్టుకొస్తూంది కాని పార్వతమ్మకి ఆడపిల్లలిద్దరి పెళ్ళిళ్ళమాట తలుచుకున్నప్పుడల్లా కడుపులో గాయం కెలికినట్లవుతోంది.

ఎంత కక్కుర్తిగా గడుపుకున్నా ఈ నాలుగేళ్ళలోనూ చదువు సంధ్యలకేగానీ, బట్టపాతాకేగాని, ఇంటిమీద ఆరువేలదాకా అప్పు దేకింది.

'అసలూ, వడ్డీ కలిసి మనం తీర్చబోయేనాటికి దాని ఖరీదుకే మించిపోతుందేమో అమ్మేద్దాం' అంటూండేవాడు మధు.

'వున్న వూళ్ళో అద్దెకొంపల్లో వుండటమెందుకు? అందాకా రానీ!' అంటూ దాటేస్తున్నదావిడ.

'ఆ తరవాతో' మధు ఓట్రించాడు.

'ఆ పాటికి నీకే వూళ్ళో వుద్యోగమొస్తుందో అక్కడే వుంటాం కదరా అన్నయ్యా; అప్పుడెలాగూ తప్పదుగదా అద్దె యిల్లు' అదీ అమ్మ ఆలోచన అన్నట్టు నవ్వింది కమల.

హరి అప్పుడప్పుడూ తల్లిని పరామర్శించడానికి వస్తూనే వుండేవాడు, నాలుగైదుసార్లు చెల్లెళ్ళను తీసికెళ్ళి బట్టలు కుట్టించి పంపించాడుకూడా. పార్వతమ్మ కల్యాణి పురుడుపోసుకున్నప్పుడల్లా వెళ్ళి చూచి వచ్చేది. మూడోకాన్పుకి దగ్గరుండి పురుడుపోసి వచ్చిందికూడా. తెంపుకుంటే తెగేబంధమా ఇది.

ఐనా ఈ రాకపోకలన్నీ హరి మనసుకి మనస్ఫూర్తిగాకాక చుట్టపు చూపుగానే గోచరిస్తూ వుండేవి. మనస్సు విరిగిన తరవాత బాంధవ్యాలంతే.

తల్లి తప్ప ఆ ఇంట్లో అందరూ తనను పరాయివాడిగా తప్పుకు తిరుగుతున్నట్టుగానే ఫీలయ్యేవాడు హరి ఎందుకనో. దానికితోడు. తానే మివ్వబోయినా వొద్దని మొహమాటపడతూ, బతిమాలించుకుంటూ, తల్లి సిఫార్సుచేస్తేగాని తీసుకోని చెల్లెళ్ళు — మధు వస్తే సరి; ఏం తెచ్చావంటూ అతను ఎంత విసుక్కుంటున్నా వినక—అతని సామాన్లన్నీ పరీక్షచేసి, లాక్కుని అతను తీసుకురాని వాటికి గారాబాలు పోతూ, నిష్ఠూరాలాడి ఒకొక్కసారి పోట్లాటగూడా వేసుకుంటుండే చెల్లెళ్ళను చూచినా తనను వాళ్ళంతా ఆ కుటుంబంలోంచి దూరంగా నెట్టేస్తున్నట్టే ఫీలయ్యేవాడు. పైగా —

ఆ వూళ్ళోనేవున్న తెలిసినవాళ్ళూ, స్నేహితులూ తను కనిపించగానే, నవ్వుతూనే,

'ఏమోయ్ ఇక్కడ్నించి తప్పించుకున్నా

కటిగా ఏమాత్రం కూడబెట్టావేమిటి ?" అంటూ మొహం మీదే అడుగుతుంటే, జవాబుకోసం తడుముకుంటూ రోషాలు పోవడం చూచి, 'అబ్బే హాస్యాని కన్నాం— మరేం పట్టించుకోకు—' అని తప్పించుకునే వాళ్ళు. ఆ మాటల వెనకవున్న హేళన అర్థం చేసుకోలేనంత పసివాడేంకాదు హరి.

శివయ్య బాబాయి సయితం తనతో ఇది వరకటంత సన్నిహితంగా మాట్లాడ్డం లేదు. అసలు ఆ వూళ్ళో అడుగు పెడుతూనే తనో నేరస్తుడికింద అనుభూతి చెందేవాడు హరి. తనుచేసిన కక్కుర్తిపనికి లజ్జగానే వున్నదతనికి.

అతని మనస్సులో 'నావాళ్ళకు దూరమయ్యానే' అన్న బాధ మెదలడం కళ్యాణి ముందే పసికట్టింది. దానికి విరుగుడు ఆలోచించకపోతే వేసుకొచ్చిన పథకమంతా వృధాయే. దాని కొకటేమందు. అక్కడికి పోనూ రానూ చాలామటుకు తగ్గేట్టు చూసింది. అవసరమై తప్పనిసరిగా వెళ్ళాలి వొచ్చినప్పుడు తనుగూడా వెంట వెళ్ళేది. అక్కడ పనిమాలా అయిన వాళ్ళందరి ఇళ్ళకూ వెళ్ళి తనని అత్తా ఆడపడుచులు పెట్టిన ఆరళ్ళూ తన మొగుణ్ణి మెత్తనివాణ్ణిచేసి నాలుగు వేల అప్పూ నెత్తిన రుద్దటమూ, అదీ చాలక ఇప్పటికి గూడా వీలున్నంత వరకూ దొల్చుకు తింటున్న వైఖరీ, వైనవైనాలుగా వర్ణించి చెప్పేది, విననివాళ్ళది పాప మన్నట్టుగా.

దానితో మొహమాటం లేకుండా 'అప్పు కొదుటమ్మా గంపంత సంసారం ఆవిడ ఖర్మానికి వొదిలి మీ గొడవ మీరు చూచుకుంటున్నారూ ?' అని బుద్ధి చెబునామనుకుంటున్న గడుసువాళ్ళకి సయితం టక్కున నోరు మూతబడింది. అసలేం జరిగిందో, లోలోపల ఏమి స్వయం పాకాలున్నాయో అని ఊగిసలాడుతున్న ఇరుగు పొరుగు కొందరమ్మలక్కలకి కీలకం దొరికినట్టయింది.

అన్నీ తెలిసినా పార్వతమ్మ తొణకుండా నిండుకుండలా వుండిపోయింది. జరిగిన తతంగమంతా ఎంతమందికని మోసుకువెళ్ళి చెప్పి ఒప్పించడం ?

మొత్తానికి కల్యాణి సాధించింది. భార్య అందరికీ చెప్పే మాటల్నే హరికూడా మళ్ళీ మళ్ళీ వింటూ నా తప్పేమీ లేదని జోకొట్టుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు. అలా అనుకోగలిగితే వొచ్చే లాభం పొందుతూవుండీ, ఇంకోవిధంగా ఎలా అనుకోగలడు.

హరికిప్పుడు ముగ్గురుపిల్లలు. వాళ్ళకి కల్యాణి ముచ్చట కొద్దీ నగలు చేయించింది. అందరిపేరా తలా ఐదువేలూ యిన్స్యూరెన్సు చేయించాడు హరి. మామగారిచ్చిన అప్పు నాలుగువేలూ కూడదీసి ఇవ్వబోతే ఆయన తీసుకోలేదు. ఆడబ్బుతో స్థలం చూచుకుని ఓ ఇంటివాడు కమ్మని సలహా ఇచ్చాడు. ఇంతో అంతో ఆయన సాయంతోనే కొత్త ఇల్లు పూర్తిచేసుకుంటున్నాడు హరి.

పసుపుకుంకాని కంటూ రెండెకరాల పొలంకూడా కల్యాణిపేర పెట్టాడాయన. మూడుపువ్వులూ-ఆరుకాయలుగా వుందతని సంసారం. ఇంత అభివృద్ధి తనవాళ్ళతో కలిసివుంటే సాధించగలిగేవాడేనా? తను చేసిన పనికి విచారించడం మానుకున్నాడు హరి. అది వంకర పనేం కాదు.

మధు చదువు పూర్తి అయింది. దగ్గర్లో ఎక్కడా వుద్యోగం వచ్చే సూచనలు కనబడక దూరప్రాంతాలకు వెళ్ళక తప్పలేదు. ఐనా మొదట్లోనే గెజెటెడ్ ఆఫీసరు పోస్టింగవటం మూలాన ఉత్సాహంగా వెళ్ళాడు మధు

మధు అటు వెళ్ళగానే ఇటు కమలపెళ్ళికి తొందర ఎక్కువయింది పార్వతమ్మకి. ఎంత చదువుకున్నా, ఎంత అందమున్నా ఆడపిల్ల వెనకవున్న కట్నం పళ్ళెంపైనే దృష్టి మగపెళ్ళివాళ్ళకి. కాని పిల్లను చూచి మెత్తబడ్డ ఓ సంబంధాన్ని పట్టుబలవంతాన పదివించీ నాలుక్కిదింపి వొప్పించాడు శివయ్య. కొండెక్కినట్టయింది పార్వతమ్మకి. అప్పుడే బుగ్గను చుక్కతో తన కూతురు పెళ్ళికూతురై తన బరువు సగం తగ్గించినట్లే సంతోషించింది.

పెద్దకొడుక్కి ఈ విషయం తెలియ వరుస్తూ కాస్త కట్నం ఎక్కువైనా కమల ఈ సంబంధంతో సుఖపడుతుంది కాబట్టి నీవుగూడా వచ్చి చూసి నిశ్చయం చేసుకోవలసిందని తను రాస్తూ, శివయ్య చాత మరోజాబు కూడా రాయించింది.

'ఆడపిల్లల పెళ్ళి బాధ్యత అన్నలదైన "మీ ఇద్దరి మిదా సమానంగా వుంది కాబట్టి కట్నానికీ, పైకర్చుకీ మూడువేలు నీవాటాకు ఇవ్వాలిసుంటుందనీ, ఈవిషయం మధుక్కూడా తెలియబరిచాననీ' రాశాడు శివయ్య.

శివయ్యకొచ్చే జవాబుకోసమే ఆతృతగా ఎదురుచూచింది పార్వతమ్మ.

కొత్త యింటికి ప్లయివుడ్ తలుపులు పెట్టిస్తున్న హరికి ఈ వుత్తరాలు చిరాకు పుట్టించాయి. అలవాటుగా కల్యాణితో సంప్రతించి ఇద్దరికీ ఒకే జవాబు వ్రాసి పడేశాడు.

'శివయ్య బాబాయి చూసిన సంబంధం విషయంలో తన కెటువంటి ఆక్షేపణా లేదనీ, వెంటనే నిశ్చయించేసి తనకు తెలియపర్చమనీ, పోతే—మూడువేలు భరించే స్తోమతు తనకు లేదనీ, ఏదో వందల్లో అయితేనే తను ఒకచెయ్యి వెయ్యగలననీ, తమ్ముడు గెజెటెడ్ ఆఫీసరూ, వెనక ఝంఝాటం లేనివాడూ గనక ఈవిషయంలో అతని సహకార మెంతయినా పొందవచ్చుననీ' తన నిర్ణయాన్ని సలహాతో సముచితంగా జోడించి మరీ వ్రాశాడు.

పెళ్ళికని వడియాలు పెడుతున్న పార్వతమ్మ ఉత్సాహమంతా నీళ్ళు కారిపోయింది. కాళ్ళు చచ్చుబడిపోయాయి. పొంగుతున్న పాలమీద నీళ్ళు జల్లినట్టయింది.

హరి అనుకుంటున్నదేమిటి? మధు గెజెటెడ్ ఆఫీసరయి కొన్ని నెలలయినా కాలేదు. ఆ వ్యవధిలో వాడు మిగిల్చగలిగేదెంతను కుంటున్నాడు? కట్న కానుకలూ, పెళ్ళిఖర్చులూ ఒక్కచేతిమీదుగా భరించాలనంటే మాటలా? అంతచేటు, అంతలో కూడబెట్టి మేట్లకింద నిలవెయ్యగలడని ఎలా వూహిస్తున్నాడు? అక్కడికీ నెలనెలా మధుమిగిల్చి పంపుతున్న పైకంలోనించీ ముందుచూపుగా పిల్ల కాపరాని కంటూ, ఎలాగూ తప్పదుగదా అనీ, చీరెలూ సారెలూ, గిన్నెలూ, దొన్నెలూ కొంటూండే తప్ప తనదగ్గర మాత్రం ఏమి నిలవుంది? ఆనాడు తమ్ముడూ నేనూ చెల్లెళ్ళ పెళ్ళిళ్ళకి పూనుకోమా అని భరోసా యిచ్చినమాటకి అర్థమిదన్నమాట. తమ్ముడుకి వేలూ, తనకు వందలూనూ.

పెళ్ళికి కొన్నాళ్ళు వ్యవధి ఉండా

అంటూ పెళ్ళివారికి కబురు పంపారు. కాని ఎన్నాళ్ళని? దానితో హరి వైపు నించీ అందివచ్చే సాయం సున్నకి సున్నా వాళ్ళకి వాళ్ళే... ఏదో నామకా అని తేలి పోయింది.

మరిక మధుశక్తిని అంచనా వెయ్యక తప్పలేదు. శివయ్య లెక్కలు వేశాడు. ఇల్లు అమ్మితే అప్పులు పోను మూడు నాలుగువేలు మిగలొచ్చు. ఆ డబ్బు కట్నానికి సరిపోతుందనుకున్నా పెళ్ళి ఖర్చు వెళ్ళమార్చేదెలా? ఈ రోజుల్లో అది మాత్రం అంతంతలో తెమిలేనా? అయితే పార్వతమ్మకి శివయ్య ఆలోచన నచ్చలేదు. 'దానిరాత ఎట్లా రాసిపెట్టుంటే అట్లా జరుగుతుంది. అంతేగాని ఇల్లు అమ్మద్దు. తప్పొద్దన్న లోకం ఆడిపోసుకోమా, ఉన్న నిలువుకున్న ఇల్లు తమ్ముడికి దక్కకుండా చేసింది మహాతల్లి అని ఆ అభాండం నా నెత్తినెందుకు? దానికి పెళ్ళయ్యే గీత ఎప్పుడుంటే అప్పుడే అవుతుంది' అన్నదావిడ నిర్లిప్తంగా.

మామూలు జీవితం మళ్ళీ ప్రారంభమయింది. కమల పేపర్లు చూసి ఏదో కొన్ని కంపెనీల్లో స్టెనో పోస్టులకి ఖాళీలుంటే అప్లై చేశానంది. కళ్ళనీళ్ళు పెట్టుకున్నది పార్వతమ్మ. పెళ్ళై పిల్లా పాపాతో కలకల్లాడే కూతుర్ని చూడాలనుకుంది గాని, ఏమయి పోతోందో అనుకుంటూ, వాచీ చూసుకుంటూ బస్సు స్టాప్‌లో క్యూలో నిలబడి ఎదురుచూసే కూతుర్ని కాదు. తల్లిని బాధపెట్టడం ఇష్టంలేక ఆ ప్రయత్నం మానుకుంది కమల.

మధు కూడా కమల వుద్యోగం చెయ్యడానికి ఒప్పుకోలేదు. వుద్యోగం చేయడం మొదలుపెట్టిన ఆడపిల్లల జీవితాలు ఆ గాడిలోనే చాలామటుకు వుండిపోతాయని అతని భయం. తప్పనిసరి అయితే తప్ప స్త్రీకి సంసారంలోనే సార్థకత లభిస్తుందని అతని నమ్మకం.

ఇల్లు తెగనమ్మి అయినా కమల పెళ్ళి చెయ్యాలనే అతని సంకల్పం. కాని అదీ కూడా సరిపోదని తెలిసిపోయాక అన్నమీద కోపం ముంచుకొచ్చిందతనికి.

ఈ సంఘటనతో వాళ్ళ మనసులకి హరి మరికాస్త దూరమయ్యాడు.

మధు మరికొంత సొమ్ము వెనకేసేదాకా కమల పెళ్ళికి వాయిదా వెయ్యక తప్పలేదు. దానితో చేతికందివచ్చిన సంబంధం, అన్ని విధాలా యోగ్యమైన సంబంధం చేజేతులా వొదులుకోవాలి వచ్చింది.

ఒక ఏడాది ఇట్లా గడిచిపోయినాక, కమలకొచ్చే సంబంధాలకన్నా, మధుకొచ్చే సంబంధాలు ఎక్కువయినయి.

వయసులో వున్న కుర్రాడు. పైగా గెజెటెడాఫీసరు హోదాలో మెరిసిపోతున్న యువకుడు అంటే ఏ ఆడపిల్ల తండ్రికైనా ఆశే కదా!

కాని వొచ్చి తొందరపడుతున్న వరాన్వేషకుల కల్లా పార్వతమ్మ ఖరాఖండీగా చెప్పేసింది—ఆడపిల్ల పెళ్ళయ్యేదాకా వాడి పెళ్ళి తలపెట్టే పనే లేదని.

ఒకసారి బొప్పికట్టింది కదా! అదీ నిజమే అనుకున్నాడు శివయ్య. తన దగ్గరకొచ్చి ఆ సంబంధం కుదిర్చి పెట్టమని తరుముతున్న వాళ్ళకి ఆమాటే చెప్పిపంపేస్తున్నాడు.

ఉన్నట్టుండి మధుకి అన్నగారింటికి రాకపోకలెక్కువయినాయి. తను ఉద్యోగం చేస్తున్న వూరికీ, తల్లిగారింటికీ నడుమ అన్నగారుండే వూరవటం మూలాన వచ్చేటప్పుడో వెళ్ళేటప్పుడో ఏదో పలకరింపుగా అక్కడ దిగే అలవాటు రానురానూ తప్పనిసరిగా తయారయింది.

కల్యాణి మంచి మాటకారి. చదువు సంధ్యలు లేకపోయినా చెప్పింది చెప్పకుండా ఎదటివాళ్ళకి విసుగెత్తకుండా ఆకర్షణీయంగా కబుర్లు చెప్పడంలో ఆవిడ కావిడే సాటి. పెద్ద ఇంజనీరైన మరిదంటే ఆమెకి సహజంగానే అభిమానమూ, గౌరవమూ ఏర్పడింది. అతనితో కబుర్లు పెట్టుకునే నెపంమీద అత్తారింటి సంగతులు ఈలలు తియ్యనూ వచ్చును మధూ కొంతకు కొంత సత్కాలపు మనిషనే చెప్పాలి. ఈ ప్రపంచంలో మకిలి ఇంకా అంటలేదతన్ని. ఇక హరికైతే అతను వచ్చిపోవటం పండగలాగే వుండేది డబ్బు విషయంలో తప్ప తనవాళ్ళతో ఎంత సన్నిహితంగా వుండగలిగితే అంత సంతోషమతనికి. పిల్లలుగూడా మధుతెచ్చే చిన్న చిన్న బహుమానాలతో అతనొస్తే చాలు 'బాబాయ్ బాబాయ్' అంటూ ఎగబట్టం మొదలు పెట్టారు.

మధు స్వతహాగా చురుకైనవాడు. ఉత్సాహం కలవాడు, పైగా ఆ వయసులో లోకమంతా పచ్చగా కళకళలాడుతూ కనబడ్డం సహజం. అతని మనస్తత్వానికి అమ్మగారింట్లో కనిపించే నీరసపు నిశ్శబ్దం అంతగా సరిపడదు. తల్లి సీరియస్‌గా వప్పజెప్పే జమ-ఖర్చుల కంటే వదిన దొర్లించే కొత్తసినిమా కబుర్లు రుచిగా వుంటున్నాయి. ఉసూరుమంటున్న చెల్లెళ్ల ముచ్చట్లకంటే అన్నగారిపిల్లల చిలిపి కవ్వింపులే బాగుంటున్నాయి.



ఎందుకో మనుషులింత విస్తారంగా వుంచారు అనుకుంటూ అప్పుడప్పుడూ.

ఆ వీలు చూసుకుని మరో యెత్తు వేసింది కల్యాణి. ఆమె పినతల్లి కూతురొక్కమ్మాయి, నిర్మలని, కట్నాలిచ్చే స్థితిలోవుండీ, తగిన వరుడు దొరక్క తప్పనిసరిగా క్లాసు తరువాత క్లాసు చదువుల్లోనే మునిగిపోతూ కన్నెచెర వదలక అలాగే వుండిపోయింది. అదంటే కల్యాణికి ప్రాణం. మధు నెలాగైనా ఒప్పిస్తే పినతల్లి మెప్పు సంపాదించవచ్చు. ఆమె మనసులో మరో ఆలోచన కూడా మెదిలింది. మధుకి తమ వూరు బదిలీ కావచ్చుట. చక్కా తనూ నిర్మలా ఒక వూళ్లో వుండవచ్చు ... మధు మాత్రం వేరింటి కాపరం పెట్టకుండా వుంటాడు... అనుకున్నదేకాని ... అంత జరగాలేకాని వేరింటి కాపరం పెట్టించలేనా అన్న ధీమావుంది ఓ మారుమూల. దానితో తన కొరిగేదేమీ లేకపోయినా అది ఒక రకం 'కాంప్లెక్సు'. తప్పుదారి తొక్కినవాళ్లకి మనలాంటివాళ్లు ఇంకొక రున్నారన్న తృప్తి! అంతే. హరి కూడా ఈ విషయంలో పెళ్లానికి అనుకోకుండానే వత్తాసిగా వుంటున్నాడు.

'ఏమోయ్ మరిదీ నాకు తోడికోడ లెప్పుడు తెస్తావు? బ్రహ్మచారిగానే ముదిరిపోదలుచుకున్నావేమిటి ఖర్మ' అంటూ ఎత్తుకుని —

'మీ అమ్మగారి మాటలు పట్టుక్కూచున్నావా నీకు సగం వయస్సు గడిచిపోతుందయ్యోయ్' అంటూ పాఠాలు ప్రారంభించింది.

మరిది ఆ మాటలకు ఎప్పుడయితే మెత్తగా మాట్లాడకుండా వూరుకుంటూ వచ్చాడో ఇక విజృంభించింది కల్యాణి, 'నేనన్నానని కాదుగాని — మీ అమ్మకి ముందునించి ఇదే బుద్ధి. ఎంతవరకూ ఆడపిల్లల గోడేకాని మొగపిల్లలు ఏమయి పోతున్నారా అని చూడనే చూడదు. అది కనిపెట్టి ఎదురు తిరిగాననే కదూ మామీద అంత కక్ష ఆవిడకి!'

మొగపిల్లలు అంటూ తనని కూడా కలిపి ఒక విసురు విసిరిన వదినగారిమాట చమత్కారానికి మధు బాగానే లొంగిపోయాడు.

# కను విప్పు

'అయినా ఏ వయసులో ముచ్చట ఆ వయసులో తీరిస్తే బాగుంటుందిగానీ ఆడపిల్లలతో నీకు పోటేమిటీ? వాళ్లకంటె నువ్వు పెద్దవాడివి కదా? నువ్వేమన్నా అను ఇది మీ అమ్మవేసిన ఎత్తు. నీ పెళ్లయితే ఆడపిల్లలకి దోచిపెట్టడానికి వీలవదని ఆవిడ మథన ఆవిడది' అంటూ కల్లాకపటం ఎరగని మధు మనస్సులో విష బిందు వొకటి వొదిలి చక్కా వూరుకుంది.

మధు అంతర్యం ఆ తేనె పలుకులమీద తీపిని కాస్త కాస్త చవి చూస్తూ వచ్చిందప్పుడప్పుడూ.

'వదిన మాటల్లో అబద్ధమేముంది? ఎంతసేపూ అమ్మ కమల పెళ్లో అంటుందే తప్ప, పాతికేళ్లు దాటుతున్నాయి కదా తనమాటెప్పుడైనా ఎత్తిందా? పైగా ఆడపిల్లల పెళ్లిళ్లయితేనేగాని తనపెళ్లి చెయ్యనంటూ తన కొచ్చిన సంబంధాలన్నీ తిరగ్గొట్టేస్తోందట కూడానూ. అది చాలదా ఆమె పక్షపాత బుద్ధికి నిదర్శనం!' మధు మనస్సులో పిపీలికలాంటి చిన్న పురుగుపుట్టి తొలవటం మొదలుపెట్టింది.

అది పెరిగి పెద్దదై విషాన్ని వెలిగక్కడం మొదలు పెట్టిందనటానికి సాక్ష్యంగా:

## అందాల వ్యాపారం!

భారత దేశంలో -

* సంవత్సరానికి 3 కోట్ల రూపాయల టాల్కమ్ పవుడర్ అమ్మకం ఉందిట!

* అందాలకి సాధనాలలో 90 శాతం టాల్కమ్ పవుడర్ వాటాయేట!

* పెద్ద కంపెనీల మొత్తం అమ్మకాలు సుమారు 6 కోట్ల రూపాయల దాకా ఉంటుందిట!

* సంవత్సరానికి పెరుగుదల 20 శాతం ఉంటుందిట!

(ఒ. వి.)

ఒకనాడు శివయ్య ఏదో పనిమీద హరి ఇంట్లో దిగాల్సి వచ్చింది. అప్పుడే మధు కూడా పండక్కి అన్నగారి ఆహ్వానం మీద వచ్చి వున్నాడు.

ఇదే సమయమని, కల్యాణి భోజనాల దగ్గర కమల సంబంధాల మాటలు ఎడతెరపిలేకుండా చెబుతున్న శివయ్యగారితో 'కమల పెళ్లిమాట సరేగాని మాకు చెల్లెల్ని తెచ్చేదెప్పుడు? మా మరిది తొందరపడుతున్నాడు మరి' అంటూ హాస్యమాడింది.

ఆవిడ హాస్యానికి అడిగినట్టుగానే అడిగినా శివయ్య సరిగ్గానే సమాధానమిచ్చాడు.

'వయసొచ్చిన ఆడపిల్లనింట్లో వుంచుకుని ఇప్పుడు వాడి పెళ్లికి తొందరేమిటమ్మా? ఇవాళ కాకపోతే రేపవుతుంది' అన్నాడు శాంతంగా.

'అదేమిటండీ అలాగంటారు? అతని కొచ్చిన సంబంధాలన్నీ ఇలాగే చెప్పి తిరగగొడుతున్నారా ఏమిటి ఖర్మ. ముద్దొచ్చినప్పుడే చంక నెక్కమని శాస్త్రం. ఇప్పుడొచ్చిన మంచి మంచి సంబంధాలన్నీ వెనక్కి నెట్టేస్తే రేపెవరయినా పిల్లనిచ్చేవాళ్లు మిగిలేనా? ఎవరికి వీలయినప్పుడు వాళ్లకి చేసెయ్యాలిగానీ...' అంటూ సాగదీసింది కల్యాణి మరిదివైపు సానుభూతిగా చూస్తూ.

'ఏమో మరి వదిన అభిప్రాయమదీ' అని తేల్చేశాడు శివయ్య. కుండబద్దలు కొట్టినట్టు మీకులాగే వాడూ తప్పించుకుంటే వాళ్ల గతేమిటీ అని అడగలేక.

మధు మెదలకుండా ఊరుకున్నట్టే ఊరుకుని, 'నేనొక ఇంటివాణ్నవటం అమ్మకే ఇష్టంలేదు. నీకెందుకు వదినా అంత తాపత్రయం?' అన్నాడు చటుక్కున.

మధు అన్నమాటలకు పిడుగు పడినట్టు నిర్ఘాంతపోయాడు శివయ్య.

తనమాట ఎంతవరకూ పని చేసినయ్యో తెలుసుకున్న కల్యాణికి లోలోపలే ఒకానొక గర్వరేఖ మెరిసింది.

శివయ్య వెళ్లిపోయాక మరిదితో మంత్రాంగం జరిపింది. 'నీ కెందుకు? పిల్లనిక్కడికే పిలిపించి మంచిరోజు చూసి నీకు కబురంపుతాము. నువ్వు వచ్చి చూసి సరేనన్నావంటే అప్పైన మీ అమ్మ ఎవరి కోసం ఒప్పుకుంటుంది' అని అతనిచేత

అవుననిపించుకుని మరీ పంపించింది.

వారం రోజుల తరవాత మధుకి రెండు ఉత్తరాలు వచ్చాయి. ఒకటి అన్నగారి దగ్గర్నించి. 'వాళ్లు వచ్చారనీ ఫలానా రోజు మంచిదికాబట్టి వచ్చి చూసి వెళ్లవలసిందనీ రాశాడు. రెండోది కవరు కమల రాసింది. ఎప్పుడూ ఇంతపెద్ద వుత్తరం రాయలేదే అనుకుంటూ ఆశ్చర్యంగా విప్పాడు.

'అన్నయ్యా'

ఇంతపెద్ద వుత్తరం చూసి హడిలిపోకుసుమా! వుత్తరం ఎంత బరువుగా వున్నా దీని సారాంశం మటుకు నీకు సమస్యలు తెచ్చిపెట్టేది కాదు.

చిన్నాన్నతో నువ్వన్నమాటలు అమ్మ చెవిని పడ్డాయ్. ఏం వులిక్కి పడుతున్నావా? లేదేమోలే! బహుశా అమ్మకి తెలియాలనే ఆయనముందు నువ్వామాట అనివుంటావని నే నభిప్రాయ పడుతున్నాను. నిజమేకదూ? నీవు పెళ్లిచేసుకుని ఓ ఇంటివాడివి కావటం అమ్మకే ఇష్టం లేదని అంటావా? అదీ చిన్నాన్న ఎదటనా? చిన్నాన్న అమ్మతో చెప్పడనే అన్నావా? నేను నమ్మను. తప్పకుండా అమ్మకా మాటలు చేరాలనే అన్నావు.

ఎలా అనగలిగావన్నయ్యా ఆమాటలు!

నాన్నపోయిన లగాయతూ అమ్మ మనకోసం ఎన్ని తిప్పలు పడ్డదో నువ్వెరగవా? తాతగారింట్లో అమ్మ అనుభవించిన ఆరళ్లు సరిగ్గా గుర్తులేక పోవచ్చు గాని, వేరైన తరవాత ఎదురైన సమస్యలైనా జ్ఞాపకం లేవా నీకు? ఆ కష్ట పరంపరలన్నీ మనలో ఏ ఒక్కరికోసమో పడిందని నీవు మనస్ఫూర్తిగా అనగలవా?

పోనీ ఆడపిల్లల కోసమే ఆవిడ పడే పాట్లన్నీ అని నీవు అభిప్రాయ పడ్డాననుకున్నా, దానికైనా తగిన కారణాలు చూపగలవా? అమ్మ మాకెక్కువా మీకు తక్కువా చేసిందెప్పుడు? శక్తిలేకపోయినా సగం కడుపు మాడ్చుకుంటూ మీకు పెద్ద చదువులు చదివించిందెందుకు? మాకోసమనా? నాలుగువేల అప్పు మీద పడిందని వదిన అమ్మని అపార్థం చేసుకుని వుండవచ్చు. కాని ఆనాడు అమ్మ చిన్నాన్న సలహానే పాటించి, అన్నను ఏ కోమటి కొట్లోనో గుమాస్తాగా జేర్పించి వుంటే ఈనాడు ఏ స్థితిలో వుండేవాడు? అది వదినకు చెప్పలేనంత పసివాడా పెద్దన్నయ్య?

సరే. పెద్దన్నయ్య సంగతి అలా వుంచు. నువ్వు వుదారంగా ఒప్పేసుకున్నావు గదా అని అమ్మ నీ వాటా ఇల్లు అమ్మి నా పెళ్లి చేసుంటే ఏం చేసేవాడివి? నా మేలే దృష్టిలో ఉంచుకున్నదైతే అలా ఎందుకు చెయ్యలేదంటావు? ఆవిడకందరూ సమానమైనవాళ్లే గనక! పెళ్లికెదుగున్న ఆడపిల్లలుంటే మొగపిల్లడికి పెళ్లిమాట తలపెట్టరు మనయిళ్లు: ఆ సాంప్రదాయం ఊరికే పుట్టిందనుకుంటున్నావా? తల్లులందరూ మొగబిడ్డల్ని గాలి కొదిలేసి, ఆడకూతుర్లని కావిలించుకుని కూచుంటున్నారనుకుంటున్నావా? నీ చేతిమీదుగా, పెద్దన్నయ్య చేతిమీదుగా నా పెళ్లి జరగాలనీ, నువ్వు పెళ్లిపీటలమీద కెక్కుతుంటే, నిన్ను కలతపెట్టే బరువు బాధ్యతలేవీ వెనకనించీ నిన్ను క్రుంగదియ్యరాదనీ అమ్మ అనుకోవడంలో అసహజమేమీ లేదే? ఇందులో మిమ్మల్ని గోతులోకి తోస్తున్నదనీ, మమ్మల్ని కొండెక్కిస్తున్నదనీ నువ్వెలా అనుకున్నావు?

ఇన్నాళ్లూ మీ అన్నదమ్ముల సంపాదన మీదనే అన్నం తింటున్నామనుకో చేతికున్న ఐదువేళ్లూ సమానమేనన్న ధోరణిలో. కన్నది గాబట్టి అమ్మ ఇప్పటిదాకా సాకుతూ వచ్చింది మనల్నందర్నీ: కాదు ఏవేలి కావేలే అని మీ రిద్దరూ పాఠాలు చెబుతున్నారు. నిజమే మా బాధ్యత తలకెత్తుకోవాల్సిన అవసరం మీకు లేదు. మీ దయా ధర్మబిక్షలమీద ఆధారపడాల్సిన వాళ్లం మేము. కాని ఒకతల్లి కడుపున పుట్టాం గనక మనమంతా సమానం అన్న భ్రమలో వున్నాము.

క్షమించన్నయ్యా ఏదో ఆవేశంలో రాసుకుంటూ పోతున్నాను. నువ్వు చిన్నాన్న దగ్గర అన్నమాటలు అమ్మ విన్న దగ్గర్నించీ అమ్మ పడుతున్న ఆవేదన చూస్తూ భరించలేక ఏమేమో వ్రాశాను.

ఇక అసలు సంగతికి వచ్చేస్తాను. నీకో మంచివార్త! శారద నీకు తెలుసుకదూ! లక్షాధికారి నరసయ్యగారి ఏకైకపుత్రిక. నీకిస్తామంటూ కబురు చేశారు. కట్నమంటూ వేరే లేకపోయినా ఆస్తి అంతా అమ్మాయిదే అని వేరే చెప్పనక్కరలేదనుకుంటాను. మరిక శారద బంగారబ్బొమ్మే నీకు తెలుసుగా. నీ వెప్పుడొస్తే అప్పుడే ఖాయం చేద్దామని అమ్మ తొందర పడుతూంది. ఈ వుత్తరం చూసిన వెంటనే వస్తావుకదూ? మరో శుభవార్త మనపక్కవూర్లోని ఫలాని కంపెనీలో నేను టైపిస్టుగా సెలక్టయ్యాను. అమ్మా చెల్లెళ్లభారం మరి నువ్వు మొయ్యక్కరలేదు ఇన్నాళ్లు మా కష్టసుఖాలు కనిపెట్టినందుకు నా కృతజ్ఞత.

కమల.

ఉత్తరం పూర్తిచేసి మధు కళ్లు మూసుకుని చాలాసేపు అలానే వుండిపోయాడు వాలుకుర్చీలో.

'విడిపోయి బాధ్యతలనించి తప్పించుకున్న అన్నగారిని నిరసించిన తను అంతకన్నా ఏమి నిర్వాహకం చెయ్యబోతున్నట్టు? ఇంత చదువుకుని, ఇన్నేళ్లొచ్చి, ఇంత అజ్ఞానంలో ఎలా పడిపోయాడు తను! తన మనస్సులో ఈ కాలుష్యం ఎలా ప్రవేశించింది? ఏ దారిన? తను వెలగబెడుతున్న ఉద్యోగానికీ, దానికాధారమైన చదువులకీ ఆలంబనగా వెనక నిలిచి, తనువూ బ్రతుకూ ధారబోసి గంజి త్రాగి తనకిన్నాళ్లూ పరవాన్నం తినిపించిన మాతృమూర్తిని ఎంత తేలిగ్గా తీసి పారేశాను' అనిపించి కళ్లకు కట్టిన పొరలొక్కసారి డుల్లిపోయినై. భూదేవివంటి దయనీయమైన ఆమె మూర్తి, ఇక పెళ్లయ్యే యోగ్యత లేదనుకొని నిట్టూర్పుస్తున్న చెల్లెళ్ల దీన వదనాలూ కొరడా కొనలల్లే గుండెలో ఛెళ్లుమన్నాయి. ఛట్ నాకిప్పుడు పెళ్లివద్దు అనుకున్నాడు.

అప్పటికప్పుడు 'పెళ్లిచూపులికి రాను' అని అన్నగారికి టెలిగ్రామూ, అందరికీ ఇల్లు చూసాను సామాన్లు సర్ది సిద్ధంగా వుండమని కమలకి ఎక్స్‌ప్రెస్ డెలివరీ ఉత్తరమూ వ్రాసి పడేశాడు.

ఆశ్చర్యంగా 'ఇదేమిట్రా అధార్తుగా' అని ఎదురొచ్చిన తల్లికి,

'నేను కృతఘ్నుడిని కాకుండా వుండాలంటే మీరు నా ఎదురుగా వుండాలమ్మా' అంటూ నవ్వుతూ సమాధాన మిచ్చాడు మధు.

సీరియల్

ఉన్నవ విజయలక్ష్మి

జ రి గి న క థ

ముకుందం, సుందరం, ప్రకాశం, శకుంతల, ఈ సుభద్రమ్మగారి సంతానం. పొలంమీద వచ్చే ఆదాయమూ, ముకుందం తెచ్చే కొదిపాటి జీతమూ వాళ్ళకి జీవనాధారం. జగన్నాథం ఆ కుటుంబానికి ఆప్తుడు. ముకుందానికి పెళ్ళి అవుతుంది. జగన్నాథం చనిపోవడంతో ఆయన కొడుకు అప్పు తీర్చమని తొందరపెడతారు. సుందరానికి గొప్పింటి సంబంధం కలిసివస్తుంది అతనికి రమణితో అట్టహాసంగా పెళ్ళవుతుంది. ప్రకాశాన్ని సుందరం దగ్గరుంచి మెడిసిన్ చదివించాలని యింట్లోవాళ్ళ అభిలాష. శకుంతల భర్త మోహన్ వుద్యోగం పోతుంది. ముకుందం అతనికి డబ్బు పంపిస్తాడు. ప్రకాశం కళ్యాణితో పరిచయం పెంచుకుంటాడు.

## 11

ఆయన చెప్పిన ఎడ్రసుగుర్తులు చూసుకుంటూ గుమ్మంలో అడుగుపెట్టిన అతనికి మొట్టమొదట ఎదురుగా కనిపించింది కళ్యాణే — ముందుగదిలో చాపవాల్చుకు కూర్చుని, మల్లెమొగ్గలు నిండుగావున్న పళ్ళెం ఒళ్లో పెట్టుకుని మాల కడుతున్న కళ్యాణి అతన్ని చూస్తూనే తనకళ్ళని తనే నమ్మలేనట్లు క్షణం రెప్పవాల్చకుండా చూసి, అంతలో నిగ్రహం తెచ్చుకుని 'రండి, రండి' అని ఆహ్వానిస్తూ పువ్వులూ, దారం ఓ ప్రక్కకి పెట్టేసి వరండాలోకి వచ్చింది.

'కూర్చోండి—నాన్నగారు స్నానం చేస్తున్నారు — ఇప్పుడే వచ్చేస్తారు' అంటూ అతనికి ఓ కుర్చీ చూపించి తనూ మరో కుర్చీలో కూర్చుంది.

వాళ్లు కాలేజీ ఖబుర్లు చెప్పుకుంటూంటే వాసుదేవరావుగారు వచ్చారు షర్టు గుండీలు పెట్టుకుంటూ —

'ఊ—ఏమిటయ్యా — ఆవాళ్టికి వాళా వచ్చావు—భలేవాడివే — సరే పరీక్ష లెలా వ్రాశావు?' అన్నారు కుర్చీలో కూర్చుని; కళ్లజోడుతీసి పంచెకొసలో తుడుచుకుంటూ.

'బాగానే వ్రాశానండీ—ఎప్పటికప్పుడే ఇక్కడికి రావాలనుకుంటూనే అశ్రద్ధ చేశాను—రేపు వూరు వెళ్తున్నాను—మళ్లీ రెండు నెలలదాకా కనిపించటం పడదని...'

'మంచి పనిచేశావు—ఊ— ఇంకేమిటి విశేషాలు,' అంటూ ఖబుర్లలోపడ్డారు.

మధ్యలో లేచివెళ్లిన కళ్యాణి రెండు గ్లాసులలో ఆరెంజి జ్యూస్ తీసుకువచ్చి బల్లమీద పెట్టింది.

'ఇప్పు డిదంతా ఎందుకండీ—శ్రమ ఇచ్చాను మీకు.'

'ఇందులో శ్రమేముంది — కాసిన్ని చల్లటి నీళ్లల్లో ఆ సీసాలో స్క్వాష్ కాస్త కలిపి తెచ్చింది—తీసుకో.' అన్నారు వాసుదేవరావుగారు ఓ గ్లాసు తీసుకుంటూ. కాస్సేపటి తరువాత అతను శలవ తీసుకుని వచ్చేస్తూంటే 'ఊరినుంచి రాగానే కనిపిస్తావుకదూ మరి.' అన్నా రాయన.

'అలాగేనండి ... మరి వస్తాను' అని కళ్యాణికికూడ చెప్పేసి వచ్చేశాడు.

శలవలయి పోయాయి — మరికొంతమంది విద్యార్థులతోపాటు ప్రకాశం, కళ్యాణి, ఇందిర ఎమ్మెస్సీ ఫైనల్‌లోకి వచ్చారు — మాధవరావు చదువయిపోయింది —ఓ కాలేజీలో వుద్యోగంకూడ దొరికింది.

వాసుదేవరావుగారింటికి ప్రకాశం రాకపోకలు మామూలే అయిపోయాయి — ఆయన బలవంతాన్ని తప్పించుకోటం చేతకాక ఒక్కొక్కసారి అక్కడే భోజనానికి వుండిపోతూ వుండేవాడు ప్రకాశం — ఇంట్లో అందరితోనూ కాస్త చనువుగా మెసలటం మాట్లాడటం చేతనయింది.

ఓ సాయంకాలం అతను లైబ్రరీకి వెళ్తానని బయలుదేరుతూంటే, 'నేనూ వస్తాను వుండండి పుస్తకాలు తెచ్చుకోవాలి—వాటికన్నా ముఖ్యం, ముందు ఇవి ఇవ్వకపోతే ఫైను పడుతుంది' అంటూ రెండుపుస్తకాలు తీసుకు వచ్చింది కళ్యాణి.

ఇద్దరూ లైబ్రరీలోంచి ఇవతలకి వచ్చేస్తూంటే 'కాస్సేపు అలా టాంక్‌బండ్ వేపు వెళ్దాం వస్తారా— ఇంట్లో పనేమీ లేకపోతేనే' అన్నాడు ప్రకాశం గొంతు సవరించుకుని.

'పనేం లేదు—పదండి' అంది కళ్యాణి.

హుస్సేన్‌సాగర్ నీటిమీదినుంచి చల్లటి గాలివచ్చి మెత్తగా తాకుతోంది—ఇద్దరూ టాక్సీదిగి అలా ముందుకువెళ్ళి రేలింగు నానుకుని నిలబడ్డారు, నీళ్ళల్లోకి చూస్తూ.

'ఇలా పిలవటం ... మీరేమయినా అనుకుంటారేమోనని భయపడ్డాను — మీరు వచ్చారు — చాలా సంతోషంగా వుంది' అన్నాడు ప్రకాశం సంభాషణకి వుప

క్రమిస్తూ.

'ఒకవేళ నేను రాను అనివుంటే ఏం చేసేవారు?'

'ఏం చేస్తాను — నా దురదృష్టాన్ని నిందించుకుంటూ, కాళ్ళీడ్చుకుంటూ రూమ్ చేరుకునే వాడిని.'

'అంతేనా, మరోసారి గట్టిగా అడిగే వారు కాదన్నమాట—అయినా ఈ మాత్రం దానికే ఓ దురదృష్టంగా భావించాలా.' చూపులు తిప్పకుండానే అడిగింది.

'నేను మనసా కోరుకున్నది కాకపోవటం దురదృష్టం కాక మరేమిటి? అయినా మరోసారి అడిగే చొరవ లేదు' కళ్యాణి సమాధానం చెప్పలేదు—మళ్ళీ ఏం మాట్లాడాలో ప్రకాశానికి తెలియలేదు— కాస్సేపు ఇద్దరిమధ్యా నిశ్శబ్దం రాజ్యం చేసింది.

'ఈ చదువయిపోయాక ఏం చేద్దామనుకుంటున్నారు—లెక్చరర్‌గా వెళ్దామనుకుంటున్నారా' చివరికి కళ్యాణే టాపిక్ మార్చి సంభాషణ మొదలుపెట్టింది.

'లమ్మో—నావల్లకాదు ఆ వుద్యోగం—మరేదైనా చూసుకుంటాను'

'ఏం — ఎందుకిష్టంలేదు' కుతూహలంగా చూసింది అతనివంక.

'ఇష్టం లేకపోవటం కాదు — నేనా లైన్‌లో రాణించలేను— విద్యార్థుల్ని అదుపులో పెట్టటం—నావల్లకాదు' అని అవసరం అవునో కాదో కూడ ఆలోచించకుండా ఆనాడు కాలేజీలో లేబరేటరీలో జరిగిన వుదంతం అంతా చెప్పేశాడు — తీరా చెప్పటం మొదలుపెట్టాక అనిపించింది. 'నన్ను బొత్తిగా ఎందుకూ పనికిరాని వాడిగా జమకట్టేస్తుందేమో— అదివరకువున్న గౌరవంకూడ పోతుంది. ఈ దెబ్బతో.' అని—అయినా మొదలుపెట్టాక పూర్తిచెయ్యక తప్పలేదు...అయితే వింటున్న కళ్యాణి కళ్లల్లో సానుభూతే కనిపించింది—'

'బొత్తిగా అంత నెమ్మది అయితే కష్టం సుమండీ — అవాళ సినీమాలో చూశాం కదూ—మీరు అంత ముందుగా వచ్చి నిలబడికూడ, వెనకవాళ్ళు తోసుకు వచ్చేస్తూంటే వాళ్ళకి దారియిచ్చి మీరు దూరంగా జరిగిపోయారు—' అంది.

తెల్లబోయాడు ప్రకాశం— ఆ సంగతి ఇంకా ఈవిడికి గుర్తుందా అనిపించింది. ఆవాళ్టి నా ప్రవర్తనచూసి వీళ్ళు నవ్వుకుని వుంటారు అనుకుంటూ బిడియపడి పోయాడు—

'ఓ—! మీకది యింకా జ్ఞాపకం వుందన్నమాట—నాలాంటి వాళ్ళు ఓవరి మంచి క్యూలో నిలబడ్డారేకాని చాలామంది గుంపులు గుంపులుగాచేరి ఖబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేశారు — తీరా టిక్కట్లు ఇవ్వడం మొదలుపెట్టేసరికి మాత్రం నేనుముందు నేనుముందు అన్నట్లుగా అంతా ఒక్కసారి కౌంటరుమీదికి ఎగబడ్డారు—నాకు ఏమిటో అలా తోసుకుని వెళ్ళే చొరవ లేదు...'

'ఆ సినిమా టిక్కట్ల విషయం ఏమంత పెద్దది కాదనుకోండి. కాని అలాంటి మనస్తత్వం ఒక విధమైన భయం మనిషిని జీవితంలో పైకి రానివ్వకుండా చేస్తాయి. మీ కాలేజీ అనుభవమే చెప్పారుగా... నేను మిమ్మల్ని విమర్శిస్తున్నాననుకోకండి—లోకంపోకడ చెప్తున్నాను—దూకుడుగా ముందుకు పోయేవాడికే భయంతోనూ భక్తితోనూ బ్రహ్మరథం పడతారు. కాని మర్యాదగా ఓవార నిలబడిపోయిన వాళ్ళని పిలిచి పీటయినా వెయ్యరు—పైనించి అలాంటి వాళ్ళనిచూచి నవ్వుకుంటారు. చేతకానివాళ్ళు అని హేళన



చేస్తారు.' అంది కళ్యాణి.

'మీరలా అంటారా — ఒక్కొక్కసారి అలా ముందుకు పోయేవాడినీ ఆపి, ఆగవయ్యా అతి ఖంగారేమిటి, నీకంటె పెద్దలింకావున్నారు అని గదమాయిస్తూ వెనక్కి నెట్టుతారనుకోండి, అనుకోటం ఏమిటి అలాంటి సందర్భాలు బోలెడుంటాయి— అప్పుడు ఎంత చిన్నతనంగా వుంటుంది— అసలు అలా తోసుకు వెళ్లటం ఎందుకు ఒకరిచేత అనిపించుకోటం ఎందుకు?'

'మీరు చెప్పేది నూటికి కోటికి ఎక్కడో మిగులుతుంది— సర్వ సామాన్య విషయం ఏమిటి అంటే మెత్తని వాడిని చూస్తే మొత్తబుద్ధి అన్నట్లు కాస్త అమాయకంగా లోకువగా కనిపించిన వారిమీదే అందరూ తమ ప్రతాపం చూపించాలనుకుంటారు...'

కళ్యాణి ఆవేశం చూస్తూంటే ప్రకాశానికి నవ్వు వచ్చింది 'మీకు అన్ని విషయాలలోనూ చాలధైర్యం సాహసం వున్నట్లుంది—నాకూ కాస్త నేర్పండిబాబూ—' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

'నేను ఇప్పుడిప్పుడే కొద్దిగా అనుభవం గడించుకున్నాను. మీరు నా శిష్యరికం చేస్తానంటే నాకేం అభ్యంతరంలేదు...'

'గురుదక్షిణ ఏమిమ్మంటారు...' ప్రకాశం కళ్లల్లో తెచ్చిపెట్టుకున్న అమాయకత.

'మీ ఇష్టం—లొక్కించి అడగటం మా అభిమతం కాదు' కళ్యాణి గాంభీర్యం నటించింది.

'అయితే నన్నే సమర్పించుకుంటాను స్వీకరిస్తారా'

కళ్యాణి చటుక్కున కళ్లు వాల్చేసుకుంది— అతను అలాంటి ప్రస్తావన తెస్తాడని కొద్దిరోజులుగా అనుకుంటూనేవున్నా అది వినగానేమాత్రం ఎన్నడూ లేనంతసిగ్గు ముంచుకు వచ్చింది— అనురాగంతో ఆమె కళ్లలోకి చూడబోయిన ప్రకాశం కెంపు రంగు పులుముకున్న ఆ చెక్కిళ్లు చూసి ముగ్ధుడయి పోయాడు.

'నేను బాగా ఆలోచించాను—ఏ విధంగా చూసినా అదే తగినదనిపిస్తోంది—మీరు నూరిపోసిన ధైర్యంతో నేనీ ప్రపంచంలో బ్రతకనేర్చిన వాడిగా తయారవుతా ననుకోండి— అప్పుడు మీకు కృతజ్ఞత

## ఆశలూ అనుభవాలూ

చూపించుకోటానికి నేనింతాక చెప్పిన మార్గం తప్ప మరేమీ కనిపించటం లేదు— సరే, ఒకవేళ మీ శ్రమ అంతా వృధా అయి నాలో పిరికితనం ఇలాగే వుండిపోయి నేనీ ప్రపంచాన్ని మనుష్యులనీ చూసి బెదిరి పోయే స్థితిలోనేవుంటే అలాంటప్పుడు నాకు మీ లాంటివారి అండ ఎంతో అవసరం కదా...' ఎంత అమాయికంగా చెప్పాలనుకున్నా అతని పెదవులు నవ్వు దాచుకోలేక పోయాయి— కళ్లు ఎత్తి ఒక్కసారి అతనివైపు చూసిన కళ్యాణి సమాధానం చెప్పలేదు— అతనిచూపులు తప్పించుకుని బిడియంగా ఎటో చూస్తూండి పోయింది.

'ఈ బండబ్బాయిలో ఇంత చలనం సాహసం ఎలా వచ్చాయా అని ఆశ్చర్యపోతున్నారా.'

తృళ్లి పడినట్లు ఇటు తిరిగింది కళ్యాణి— 'నా విమర్శకి మీకు కోపం వచ్చిందా' అన్నట్లున్నాయి ఆమె చూపులు.

'ఇందులో నా ప్రయోజకత్వం ఏంలేదు. అంతా ఈ గురువుగారి ప్రభావం' మనోహరంగా నవ్వాడు ప్రకాశం.

'ఇందులో ఎవరి ప్రభావమూ ఏమీలేదు— అనుభవాలే మనిషిలో మార్పుని తీసుకువస్తాయి—కాంక్ష తీవ్రమైనదైనప్పుడు సాహసం అదే పుట్టుకువస్తుంది—' నవ్వు దాచుకుంటూ నిగ్రహం నటించింది కళ్యాణి.

'నా కోరికెంత తీవ్రమైనదో అర్థం అయిపోయిందన్న మాట'

రేలింగుని ఆనుకునివున్న ఆమెచేతిమీద చటుక్కున చెయ్యివేశాడు ప్రకాశం. 'మరి మీ కిష్టమేకదూ—నేనేం పొరపాటు పడలేదు నాకు తెలుసు' నాకు సమాధానం కావాలి అన్నట్లున్నాయి అతని చూపులు.

'పొరపాటు పడలేదు అని చెప్తూ ఇంకా అనుమానం ఎందుకు?' కళ్యాణి కళ్లల్లో మెరుపు మిలమిల లాడింది.

'నా కివాళ ఎంత సంతోషంగా వుందో చెప్పలేను.'— పరవశించిపోయిన ప్రకాశం తనభావాల నన్నింటినీ మాటలలో పెట్టటం సాధ్యంకాక, తన చేతిలోవున్న ఆమెచేతిని ఆప్యాయంగా నొక్కాడు—అందంగా నవ్వింది కళ్యాణి.

కొద్ది క్షణాలు మౌనంగా దొర్లి పోయాయి —

'అలావెళ్లి కూర్చుందామా' అని ఆ దగ్గరలోవున్న బెంచివైపు దారి తీయబోయాడు ప్రకాశం.

'ఇంక ఇంటికి వెళ్లిపోవద్దూ— ఇలా ఖబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటే పరీక్షలు...' నవ్వేసింది కళ్యాణి.

'సున్నా చుడతాయి, అదేనా ... నిజంగానే, మనం చదువుమాత్రం అశ్రద్ధ చెయ్యకూడదు—' కళ్యాణి చెయ్యి వదలకుండానే నడక సాగించాడు ప్రకాశం.

'మన సంగతి ఇవాళే మీరు వూరందరికీ దండోరా వేసేలా వున్నారు... ఈ పరీక్షలు అయిపోయిందాకా ఎవ్వరికీ చెప్పటం నా కిష్టంలేదు.' నాలుగడుగులు వేశాక తన చేతిని అతనిచేతిలోంచి మెల్లిగా విడిపించుకుంటూ అంది.

తను చేసినపనికి సిగ్గుపడి పోయాడు ప్రకాశం — ఆమెచెయ్యి వదిలేసి. 'నేనూ అదే అనుకుంటున్నాను —మరో విషయం— చదువయిపోయినా, మా చెల్లాయి పెళ్లి అయేదాకా మనం ఆగుతే బాగుంటుంది — మీ నాన్నగారికి వాళ్లకీ ఏమీ అభ్యంతరం వుండదనుకుంటాను'—ఏమంటావు అన్నట్లు చూశాడు.

'ఫరవాలేదు' అన్నట్లు తలవూగించి తన అంగీకారంకూడ తెలియజేసింది కళ్యాణి—

'రిజల్ట్సు తెలియగానే వచ్చేస్తాను— రిసెర్చికి స్కోపు వుంటుందేమో చూడాలి' అన్నాడు ప్రకాశం బయలుదేరి వచ్చేసే ముందు.

'ఉత్తరాలు వ్రాస్తూండండి.' అని చిరునవ్వుతో సాగనంపింది కళ్యాణి...

'పక్క వేసుకోకుండానే పడుకున్నావేమిటి' అంటూ తల్లి పలకరించటంతో ప్రకాశం కళ్లముందు దృశ్యాలు చెదిరి పోయాయి—వర్తమానంలోకి వస్తూ,

'ఆ—వేసుకుంటాను.' అంటూనే లేచి పరుపు వాల్చుకున్నాడు — వెనక్కి తిరిగి వెళ్లిపోతున్న తల్లినిపిలిచి దగ్గర కూర్చోపెట్టుకుని అంతా చెప్పేస్తేనో అనిపించింది — చుట్టుపక్కలవున్న నాలుగైదు మంచాలకేసీ చూశాడు.

'ఉహు—ఇంకా పిల్లలెవరూ నిద్దర్లు

పోలేదు—రేపు అమ్మ ఒంటరిగా వున్నప్పుడు చెప్పాలి' అనుకుని కళ్ళుమూసుకు పడుకున్నాడు.

* *

'అమ్మా! శశి ఏదీ?'

పెరటి వరండాలో చాప వాల్చుకుని కూర్చుని మనవరాలిచేత పాఠాలు చదివిస్తున్న సుభద్రమ్మగారు ముకుందం మాటవిని వులిక్కి పడింది—అతని గొంతు మామూలుగా లేదు— 'ఇవాళ షాపునుంచి కాస్త త్వరగానే వచ్చినట్టున్నాడు — అయినా—ఏం జరిగిందో — చిరాగ్గా వున్నట్టున్నాడు' అనుకుంటూ.

'వాళ్ళ స్నేహితురాలింటికి వెళ్ళింది. ఏం?' అంది.

'ఇంకా రాలేదా—ఎప్పుడు వెళ్ళింది.' నిలదీసి అడుగుతున్నట్లే వుంది అతని గొంతు. కళ్ళు చిరాకుని వ్యక్తం చేస్తున్నాయి.

'మధ్యాహ్నం అన్నం తినగానే వెళ్ళింది—త్వరగా వచ్చేసేయమని చెప్పానుకూడ.' అంది అయోమయంగా కొడుకువంక చూస్తూ. అతను ఇన్ని ప్రశ్నలు ఎందుకు

## ఆశలా— అనుభవాలా

వేస్తున్నాడో ఆవిడికి అర్థం కావటంలేదు—చెల్లెల్నిగురించి యథాలాపంగానే అడుగుతున్నాడని సరిపెట్టుకోలేక పోతోంది — అతను అడుగుతున్న తీరు, ఆ గొంతు—ఆవిడలో ఏదో చెప్పలేని భయం తల ఎత్తుతోంది.

'ఇంకెప్పుడూ ఆ కాత్యాయనీ వాళ్ళింటికి పంపించకు' కాస్త దూకుడుగానే అనేసి వుసూరుమని నిట్టూరుస్తూ చాప చివర చతికిల బడ్డాడు.

బామ్మ పరధ్యానం కనిపెట్టిన మనవరాలు పలకా పుస్తకాలూ బొత్తిపెట్టి చంకన పెట్టుకుని 'రేపు రాస్తాలే బామ్మా' అని ఆవిడికి చెప్పేసి బిక్కుబిక్కు మంటూ ఓసారి తండ్రికేసి చూసి మెల్లిగా అవతలకి జారుకుంది — తండ్రి వాలకం దానికీ కొత్తగా అనిపించింది.

కొడుకు ఏమైనా చెప్తాడేమోనని ఒక్క నిముషం చూసింది సుభద్రమ్మగారు — అతని మౌనం ఆవిడలో మరీ భయాన్ని రేకెత్తిస్తోంది.

'అసలేం జరిగింది ముకుందం సరిగ్గా చెప్పు. నాకేమిటో, కాళ్ళూచేతులూ దడదడ లాడుతున్నాయి' అందావిడ, అప్పటికప్పుడు నుదిటినిండా పట్టేసిన చమటని పమిటకొంగుతో తుడుచుకుంటూ.

'ఏం జరగలేదులే —అయినా ఆడపిల్ల ఇక్కడా అక్కడా తిరగటం ఏం బాగుంటుంది—వాళ్ళింటికే కాదు ఇంక ఎక్కడికీ కూడ అతిగా వెళ్ళొద్దను'—తల్లి ఖంగారు చూసి కాస్త విదానంగానే అన్నాడు.

'అదిమాత్రం ఎక్కడ తిరుగుతోందిరా బొత్తిగా ఏమీ తోచటంలేదు కథల పుస్తకాలేమయినా తెచ్చుకుంటాను అంటే సరే అన్నాను—ఇవాళ మరీ ఎండ మండిపోవటం లేదుకదా అని అన్నం తినగానే బయలుదేరింది — ఈ కాత్యాయనీ, ఆ బాపిరాజుగారి సరళా తప్పితే దీనికి పదిమంది స్నేహితురాళ్ళు లేనేలేరు...' కూతురు నడవడికి హామీ ఇస్తున్నట్టుగా అంది.

'అందుకనే నేనూ నిశ్చింతగా వుంటున్నాను —మా చెల్లాయి చాలా బుద్ధిమంతురాలు అని అవసరంవస్తే ఎవ్వరితోనైనా గర్వంగా చెప్పుకో గలుగుతున్నాను—కాని—కాని ఇందాకా —ఆ సీతారామయ్యగారు కనిపించి అలా అనేసరికి మనస్సు చివుక్కు మంది...'

'సీతారామయ్యగారా— ఏమన్నారు' సుభద్రమ్మగారి గొంతు వణికింది

'ఆ కాత్యాయనికో అన్నయ్య వున్నాడుట బి. ఇ. ప్యాసయి వుద్యోగంకోసం ప్రయత్నిస్తూ ప్రస్తుతం ఇక్కడే వున్నాడుట—వీళ్ళు ముగ్గుర్ని ఇందాక బజారులో చూశాడట సీతారామయ్యగారు—మొన్న వాడు ఆయన మ్యాటినీకివెళ్తే ఆ సినిమాకి వాళ్ళు వచ్చారుట— ఆయన ఇందాక కనిపించి మాటల సందర్భంలో యాధాలాపంగా చెప్తున్నట్లే ఈ విషయం చెప్పేసరికి నాతల కొట్టేసి నట్లయింది—'ఆ కలెక్టరుగారి అమ్మాయితో మా చెల్లాయికి బాగ స్నేహం— ఆ అమ్మాయి మా యింటికి వచ్చినా మా అందరితోటి సరదాగా మాట్లాడుతూ కలివిడిగా వుంటుంది. అని ఏదో చెప్పేసానుకో—ఈయన అంటే మనకి బాగా తెలుసు కనక ఏ వుద్దేశ్యంతో అయితేనేం ఆ ముక్క మన చెవిని వేశాడు—ఇంకా చూసినవాళ్ళంతా ఏమను

### కుటుంబ నియంత్రణ

* కుటుంబ నియంత్రణమీద కర్చులు

| | | |
|---|---|---|
| మొదటి ప్రణాళిక | ... | రు. 145 లక్షలు |
| రెండవ ప్రణాళిక | ... | రు 2156 లక్షలు |
| మూడవ ప్రణాళిక | ... | రు. 2700.0 లక్షలు |

* మొత్తం కుటుంబ నియంత్రణ కేంద్రాలు—

| | | |
|---|---|---|
| నగరాలలో | ... | 1563 |
| గ్రామాలలో | ... | 4275 |
| ఆసుపత్రులలో | ... | 0893 |

ఉపకేంద్రాల సంఖ్య 10,312 ఇవన్నీ కాక 8400 ఇతర ప్రదేశాలలో కుటుంబ నియంత్రణ సౌకర్యాలు ఉన్నాయి.

* ఇంతదాకా జరిగిన సంతాన నిరోధక శస్త్ర చికిత్స (స్టెరిలయిసేషన్)లు 20 లక్షల పయిన ఉన్నాయట. లూప్‌లవంటివి 15 లక్షలు వేశారుట.

(ఒ. వి)

కుంటున్నారో మనకి తెలియదు—అసలు కరిచేత వేలుఎత్తి చూపించుకునే అవకాశం మనం ఎందుకివ్వాలి—పెళ్ళిచేసి అత్తవారింటికి పంపించాల్సిన పిల్ల. ఎలాంటి పేరయినా వచ్చిందంటే ఎంత అప్రతిష్ఠ చూడు— అసలా అబ్బాయి ఎలాంటి వాడో......'

'ఎలాంటి వాడయితే మనకెందుకు? స్నేహితురాలిని చూసివస్తానని పుస్తకాలు తెచ్చుకుంటానని వెళ్ళిన మనిషి వెంటనే ఇంటికి వచ్చేయొద్దా — ఈ అక్కర్లేని పెత్తనాలన్నీ దాన్నిఎవరు చెయ్యమన్నారు—రానీ— కనుక్కుంటా—' సుభద్రమ్మగారి గొంతులో ఆగ్రహం పరవళ్ళు తొక్కింది. 'అవాళోనాడు—మేమిద్దం సినిమాకి వెళ్తాం అత్తయ్యా అని అడిగితే సరే అని పంపించాను. ఈ గొడవలన్నీ నాకేం తెలుసు—'

'సరేలే—ఇంక వెళ్ళనివ్వకు' అని లేచి వెళ్ళిపోబోతుంటే,

'అసలాయ నేమన్నాడు' అంది సుభద్రమ్మగారు ఆత్రుతగా ఆందోళనగా కొడుకువంక చూస్తూ.

కాళ్ళు కడుక్కోటానికి వెళ్ళబోతున్న వాడల్లా మళ్ళీ వెనక్కివచ్చి కూర్చున్నాడు ముకుందం.

• * *

ఉదయం ఎనిమిది గంటలవేళ సీతారామయ్యగారిని వెంట తీసుకుని కలెక్టరు కనకరాజుగారి బంగళావైపు బయలుదేరాడు ముకుందం—

యాంత్రికంగా అడుగులు పడుతున్నాయి, ఆయన మధ్య మధ్య ఏదో మాట్లాడుతూంటే 'ఆ ఫూ'లతో సమాధానం చెపుతూనే వున్నాడు కాని అతని ఆలోచనలుమాత్రం పరిపరి విధాల పోతున్నాయి.

'తీరా వెళ్తున్నానే కాని ఆయనే మంచివాడో— వాళ్ళలో సరితూగ గల తాహతు నాకు బొత్తిగా లేదు' అని వెనక తీస్తూంటే అడిగివద్దాం దాంట్లో పోయిందేముంది అని సీతారామయ్యగారే బలవంతం చేశారు— అసలు ఆ ఏలూరు సంబంధం ప్రకాశం ఒప్పుకునుంటే ఈపాటికి రెండు శుభకార్యాలూ లక్షణంగా జరిగిపోయేవి—వాడు కాదన్నాడని నాకేం బాధ లేదు—జీవితంలో అతి ముఖ్యమైన విషయంలో ఆ వ్యక్తి అభిప్రాయా

లకి కాక మిగిలినవాటికే ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వాలనే తత్వం కాదు నాది — అయినా అసలు ఆ హైదరాబాదు ఆ సంబంధానికి ఏ వంక వుందని కాదనటం? — ఎటొచ్చీ వాళ్ళు కాని కట్నం ఇవ్వలేరు — వచ్చిన జీతంతో గుట్టుగా కాలక్షేపం చేస్తున్న సంసారం ఓది — ఎలాగో పిల్లలకి కాస్త పెద్ద చదువు మాత్రం చెప్పిస్తున్నాడాయన. ఈ అమ్మాయి స్కాలర్ షిప్ తో చదివి ఎమ్మెస్సీ కూడ అయింది. నేనయినా తమ్ముడని పెద్ద కట్నాలు పుచ్చుకోవాలని ఎప్పుడూ అనుకోలేదు — పెళ్ళి కావలసిన చెల్లెలుంది కదా అక్కడ చేసుకుని ఇక్కడ ఇచ్చేస్తే బాధవుండదు అని ఆశపడ్డాను — కాని తమ్ముడి మనస్సు తెలిసిపోయాక అలా ఒకరితో ఒకరికి లంకె పెట్టటం న్యాయం కాదనిపించింది... చెల్లాయికి ఏదైనా సంబంధం చూడండి. దాని పెళ్ళి అయాకే నేను చేసుకుంటాను అని చెప్పి రిటర్న్ ట్రెయిన్ రాగానే మళ్ళీ హైదరాబాదు వెళ్ళిపోయాడు రీసెర్చికి — ఆ వచ్చిన స్టైఫెండుతో వాడికి బాగానే గడిచిపోతోంది — ఆ అమ్మాయికి ఈ మధ్య ఓ ఆడపిల్లల కాలేజీలో వుద్యోగం కూడ దొరికిందిట — కాబోయే కోడలు వుద్యోగం చేస్తోంది అని తెలియగానే అమ్మ ఆదోలా అయిపోయింది — ఈ రోజుల్లో అదేం తప్పులేదు ముఖ్యంగా అలాంటి పట్నాలలో చాలా మంది చేస్తూనే వుంటారు — ఆడపిల్లలకి ప్రత్యేకంగా కాలేజీలు పెట్టినప్పుడు ఆడవాళ్ళు లెక్చెరర్లుగా చేరకపోతే అక్కడ పాఠాలెవరు చెప్తారు అంటూ ఎన్నోవిధాల నచ్చచెప్తే సమాధానపడింది — ప్రకాశం రీసెర్చి పూర్తి కాకుండా పెళ్ళి చేసుకున్నా వాళ్ళ కుటుంబం ఎలాంటి ఒడిదుడుకులు లేకుండా గడిచి పోతుంది... ఇంక ఆఖరిది ఈ శశి పెళ్ళి ఒకటి చేస్తే నేను భుజం మీద వేసుకున్న బాధ్యతలన్నీ దించుకున్నట్లే — పోసీ అని ఆ ఏలూరు సంబంధమే చూద్దామనుకుంటే వాళ్ళా ముందు వాళ్ళ అమ్మాయి పెళ్ళి కావాలనే వుద్దేశ్యంతో వుండటంవల్ల అదీ కుదరలేదు — పోనీ మరోటేదైనా చూడండి అని సీతారామయ్యగారికి చెప్తే సరే అన్న పెద్దమనిషి రెండునెలలు పోయాక కనిపించి వుళ్ళోనే పెళ్ళికొడుకుని పెట్టుకుని నన్ను ఇక్కడా అక్కడా వెతకమంటావేమిటయ్యా అని అడిగాడు — పెళ్ళికొడుకేమిటి వుళ్ళో

## ఆశలూ అనుభవాలూ

వుండటం ఏమిటి? అని తెల్లబోతుంటే కలెక్టరుగారి అబ్బాయీ అమ్మాయి శశి అంతా కలిసి తిరగటం అదీ చెప్పి — చెప్పదలుచుకున్న ముక్క ఏదో చెవిని వడేసి హడావిడిగా మరో పనిమీద వెళ్ళిపోయాడు — ఆయన మాటల్లో ఏదో వ్యంగ్యం పెక్కిరింత వున్నట్లనిపించి నాకు మాత్రం. ఒళ్ళు మండిపోయింది — ఆ నాడిలోనే ఇంటికి వచ్చి నాలుగూ అనేశాను — తరువాత మెల్లిగా అంతా ఎన్న అమ్మకూడ పోనీ ఒడిగచూస్తే పోయిందేముంది, అబ్బాయి ఇష్టపడితే ఆయనా అంతస్తుల భేదం పట్టించుకోడేమో అంది — చివరికి అందరి ప్రోద్బలంవల్ల ఇలా బయలుదేరివచ్చాను... ఏమవుతుందో —'

కలెక్టరుగారి బంగళాగేటు సమీపించేసరికి పరధ్యానంవదిలి ఈ లోకంలో పడ్డాడు ముకుందం.

వరండాలో అరడజను పేము కుర్చీలూ ఓమూల టీపాయ్‌మీద నాలుగైదు దినపత్రికలూ మరేవో మేగజైనులూ వున్నాయి — అక్కడేవున్న నౌకరు కుర్రాడు 'అయ్యగారు పూజలో వున్నారు కూర్చోండి' అని చెప్పి లోపలికి వెళ్ళిపోయాడు — ఇంతలో ఎందుకో అటువేపు వచ్చిన కాత్యాయని ముకుందాన్ని గుర్తుపట్టి నమస్కారంచేసి 'రా లోపలికి రండి కూర్చోండి — నాన్నగారు ఇప్పుడే వస్తారు' అంటూ వాళ్ళని డ్రాయింగ్ రూములో కూర్చోపెట్టి తను లోపలికి వెళ్ళిపోయింది:

ఖరీదైన సోఫాసెట్లూ గోడలకి బోలెడు ఖరీదుచేసే అందమైన పెయింటింగ్సూ, కిటికీలకీ గుమ్మాలకీ కట్టిన సిల్కు తెరలూ, గదిమధ్యగా పరిచిన కాశ్మీరు తివాసీ, గదిలో మూలగా నిలువెత్తు జర్మన్ సిల్వర్ ఫ్లవర్ కుండీలో రంగురంగుల పూలగుత్తి, పాలరాతి బుద్ధవిగ్రహం ఆ గదిలో ఆడంబరాన్ని బట్టి వాళ్ళ ఐశ్వర్యం అంచనా వేయటానికి ప్రయత్నిస్తున్నట్లు మౌనంగా వుండిపోయాడు —




'చూశావా, ఎన్ని పెద్ద చదువులు చదివినా ఎంత పెద్ద పదవిలో వున్నా మన సాంప్రదాయాలూ ఆచార వ్యవహారాలు వదులుకోలేరు కొంతమంది. ఈయనకి పూజా పునస్కారం అదీ అంతా వున్నట్లుంది — మనం మంచివేళే వచ్చాం.' అన్నాడు సీతారామయ్యగారు మెల్లిగా ముకుందంతో...

కాత్యాయని గబగబ మేడమీదికి పరుగెత్తుకువెళ్ళి ఆవార్త అన్నగారికి అందించేసింది — వింటున్న సారథిగుండె ఒక్క క్షణం ఆగిపోయినట్లయింది.

'శశి వాళ్ళన్నయ్యా? — ఎందుకూ? — అతనికి నాన్నగారితో పరిచయం. ఇలా రావటం అదీ అదివరకెప్పుడయినా వుందా?' అన్నాడు విస్మయంగా చూస్తూ.

'ఉహూఁ — ఆయనకి నేనుతప్ప మనింట్లో మరెవరూ తెలియదు — మరో పెద్దమనిషిని కూడ వెంట పెట్టుకు వచ్చారు మరి — బహుశః శశి పెళ్ళి రాయబారమేమో లే' అంది కాత్యాయని అన్నగారిని కళ్ళతోనే వెక్కిరిస్తూ — ఈ రెండు మూడు నెలలుగా అన్నగారి అవస్థ కనిపెడుతూనే వుందా అమ్మాయి. శశికికూడా ఇష్టమే అని ఆ అమ్మాయి మొహమే చెప్తుంది — చక్కని ఆ శశే వదిన అయితే ఎంత బాగుంటుంది అనుకుంటూ మురిసి పోబోయింది కాని 'నాన్న ఏమంటారో' అన్న ప్రశ్న హఠాత్తుగా వచ్చి మనస్సునిండా ఆక్రమించుకోటంతో మరేమీ ఆలోచించటం సాధ్యం కాలేదు.

'నాన్న ఎక్కడున్నారు' అన్నాడు సారథి.

'పూజలో వున్నారు — అయిపోయిందను కుంటాలే — ఈపాటికి వెళ్ళివుంటారు.' అంది కాత్యాయని.

సారథి కళ్ళలో ఒక రూపు మెరిసింది — అసలు మొట్టమొదటిసారి ఆమెని చూడటం ఆ తరువాత పరిచయంకావటం అంతా చిత్రంగానే వుంటుంది తనికి తలుచుకుంటూంటే......

(ఇంకా ఉంది)

# అలజడిలో అతివలు

అతివలు అబలలము కాము సబలలము అని అన్నిరంగాలలో నేడు నిరూపిస్తున్నారు. ధైర్యసాహసములతో సత్యాగ్రహాలలో, నిరాహారదీక్షలలో పాల్గొంటున్నారు.

ఆనాడు నడిబజారులో అల్లంతదూరాన నా రిక్షా ఆగిపోయింది. స్త్రీలు బారులు తీర్చి పురవీధి నలంకరించారు. నారీమణుల నినాదాలు దిక్కులు పిక్కటిల్లజేసినవి. ఉత్సాహవంతులై, ఉద్రేక పూరితులై, ఆవేశపరులై తమ ఉద్యమాన్ని సాగిస్తున్నారు. నాకు కూడా వారితో కలసిపోవాలనిపించింది. కాని వెంటనే విరమించాను. స్వదేశీయులైన, సహోదరులైన సాటిమానవులపైన వారి దుర్భాషలు, దూషణలు కర్ణకఠోరంగా వినిపించినవి. భరించుట దుశ్శక్యమైనవి. రిక్షా మళ్లించాను

ఆప్యాయతతో, అనురాగంతో. ఆదరాభిమానాలతో, సహనంతో స్నేహాన్ని, స్వదేశాన్ని తీర్చిదిద్ది లోకకల్యాణానికి తోడ్పడవలసిన మహిళామణులు అసహనంతో తోటి మానవాళిని అవహేళన జేయడం గర్హనీయమైన విషయం. గౌరవమర్యాదలతో, క్షమ, శాంతి, దయ అనెడి ఆయుధాలతో ముందంజవేయాలి మగువలు; కాని, విష్ఫురవాక్కులతో పూలహారాలు వేసుకొని, రక్తతిలకాలు దిద్దుకొని వీరాంగనలని పించుకోవడం పొరపాటు.

ఓనాటి అర్ధరాత్రి నాకు బాగా పరిచయమున్న స్త్రీ నలుగురు పిల్లలతో నా యెదుట ప్రత్యక్షమైనది. కారణం? భర్త ఊళ్లో లేడు. తాను జ్వరంతో బాధపడుతోంది. పెరటి గుమ్మాన్ని కొందరు తగులబెట్టేరు. ఆ శబ్దానికి మేల్కొని కార్చిచ్చు నెలాగో ఆర్పి అక్కడ నిలవలేక ఇంటికి తాళంవేసి నా వద్దకు వచ్చింది. ఆమె మేల్కొనకపోతే ఆమె, పిల్లలు ఏమయ్యేవారు? తానా గండం నుండి బయటపడింది కాని ఇంటి విషయం ఏమైనట్లు? దొంగల కాహుతి కావలసిందేనా? కలుషిత వాతావరణంలో చిక్కుకొని ఆస్తిపాస్తుల గోల్పోయి, అవమానాలకి గురి అయి, భయాందోళనలతో కృశించిన స్త్రీలు ఉన్నారంటే అతిశయోక్తి కాదు.

భర్త, పిల్లలు బయటికి వెళ్లినవాళ్లు తిరిగి ఇంటికి వచ్చేవరకు ఎదురుతెన్నులు జూస్తూ, తీరా వచ్చాక, భర్తయొక్క చేతి గడియారము, జేబులోని జీతము కొందరి హస్తగతమైనవని తెలుసుకున్న ఆమె వ్యాకులత వర్ణించలేము.

మా ప్రక్కింటి అమ్మాయిని స్నేహితురాండ్రు ప్రోద్బలంచేసి సత్యాగ్రహం చేయించి కారాగృహశిక్ష ననుభవింపజేసినారు. మూడురోజులవరకు ఆమె జాడ తెలియని తల్లి పడే వ్యథ ఊహించలేము. నాల్గవరోజున ఇంటికి చేరుకున్న అమ్మాయిని జూసి కన్నీరు కార్చింది ఆ మాతృమూర్తి.




ఎదురింట్లో అర్ధరాత్రి టాక్సీ ఆగింది. హార్న్ మ్రోగింది. గేటు తలుపులు తెరుచుకున్నవి. ఒక కుటుంబము కట్టుబట్టలతో దిగారు. వారి ముఖాన నెత్తురుచుక్క లేదు. కారణం? పొరుగూళ్లో స్థిరనివాస మేర్పరచుకొని, ఆస్తిపాస్తులు సంపాదించుకొని హాయిగా కాలం గడుపుతున్న వారింటికి దుండగీడులు జొరబడి హింసించి, భయపెట్టి, బెదిరించి, కట్టుబట్టలతో కదలిపొమ్మంటే పాపం చుట్టాలింటికి చేరుకున్నారు ఆ నిశీథంలో.

తమ అమ్మాయి కాలేజీకి హాజరయినందున జడ కత్తిరింపబడి పరాభవింపబడి ఇంటికి రాగా. ఆమెను జూసి ఎంత విలపించారో ఆ తల్లిదండ్రులు.

జూన్‌లో పాఠశాల తెరుస్తారని, డ్యూటీలో జాయిన్ కావాలని నేను మా సోదరి హైదరాబాదుకి ప్రయాణమయ్యాము. బెజవాడ నుండి రైళ్లు, బస్సులు లేవు కనుక మే మిద్దరము, అక్కడే పరిచయమైన మరో ఇద్దరు స్త్రీలు అక్కడ ఉన్న టాక్సీ రాజధానికి చెందినదేకదా అనే ధీమాతో బయల్దేరాము. త్రోవలో మాపరిస్థితి ముందుకు పోతే నుయ్యి, వెనక్కి పోతే గొయ్యి అయింది. కొంచెందూరంలో ఒక ఊరిలో జనం, అరుపులు పోలీసులు. సైనికులు చెదరగొడుతున్నారు జనాన్ని. ఆ దృశ్యాన్ని జూసి మా ప్రాణాలు పైకి ఎగిరిపోయినవి. స్పీడ్ ఎక్కించాడు డ్రైవరు. కేకలు, రాళ్లు రువ్వారు. ధన్ ధన్ మనే శబ్దం. బీభత్సప్రాంతం నుండి బయటపడ్డాము. కారుకి డామేజీ అయివుంటే? కారు ఆగిపోయివుంటే? తల్చుకుంటే ఇప్పటికీ గుండె దడదడ లాడుతుంది. ఎలాగయితేనేం? భగవంతుని దయవలన స్వస్థలానికి చేరున్నాము.

అశాంతితో, అవమానంతో ఆర్థికంగా మానసికంగా అనేకమంది అతివలు అలజడి, ఆవేదన, ఆందోళన జెందేరంటే అతిశయోక్తి కాదు.

—ఎస్. ఎల్. దేవి




(గత సంచిక తరువాయి)

'ఒక ఊళ్లో ఒక వర్తకుడు ఉండేవాడు. అతను ఉప్పు వ్యాపారం చేసేవాడు. అతనికి ఒక యెద్దు, ఒక గాడిదా ఉండేయి. ఆ ఉప్పు వర్తకుడు పట్నంలో ఉప్పు బస్తాలను కొనేవాడు. ఆ ఉప్పు బస్తాలను యెద్దుమీదవేసి తన గ్రామానికి తెచ్చి అమ్ముతుండేవాడు.

ఒకప్పుడు ఆ వర్తకుడు ఒక యిల్లు కట్టడం ప్రారంభించాడు. ఆ యింటికి కావలసిన యిసుకను బస్తాల్లోవేసి సదరు యిసుక బస్తాలను గాడిదమీద యింటికి తెచ్చేవాడు వర్తకుడు.

'ఒకనాటి సాయంత్రం యెద్దు చాలా సంతోషంగా ఉంది. అప్పుడు గాడిద యెద్దును చూసి యిలాగ ప్రశ్నించింది ఏమిటి యెద్దుఅన్నా? యివ్వాళ నువ్వు చాలా సంత షంగా ఉన్నావు కారణం యేమిటి?'

'ఇవ్వాళ నేను ఉప్పుబస్తాను మోస్తూ యేట్లోనుంచి వస్తున్నాను. అప్పుడు ఆకస్మికంగా యేరువచ్చి, ఉప్పుబస్తా తడిసిపోయింది. దానితో బస్తాలోఉన్న ఉప్పు కరిగిపోవడంవలన నేను మోయవలసిన బరువు తగ్గిపోయింది. అందుకు నాకు యివ్వాళ చాలా సంతోషంగా ఉంది.' అని యెద్దు గాడిదకు సమాధానం యిచ్చింది.

మర్నాడు గాడిద యిసుకబస్తాను మోస్తూ యేట్లోకి దిగింది. అప్పుడు గాడిదకు యెద్దుచెప్పినమాటలు జ్ఞాపకానికి వచ్చాయి. వెంటనే గాడిద తను మోస్తున్న యిసుకబస్తా నీటిలో మునిగేలాగున వంగింది. అప్పుడు యిసుకబస్తా తడిసింది. దానితో యిసుకబస్తా మామూలుకంటె బరువు అయింది. ఆ తడిసిన యిసుక బస్తాను మోయడానికి గాడిద చాలా శ్రమ పడింది.'

'చూ శావా? ఈకథలో గాడిద తన అవివేకంవల్ల శ్రమను పొందింది. నీటిలో తడవడంవలన ఉప్పు కరిగిపోతుంది. దానివలన యెద్దు మోయవలసిన బరువు తగ్గింది. ఇసుక విషయంలో అలాగ జరగదు కదా! ఇసుక తడవడంవలన బరువు పెరుగుతుంది. ఈ విషయాన్ని గమనించకుండా గాడిద యిసుకబస్తాను నీటిలో ముంచింది. దీనివలన ఆ గాడిద మోయవలసిన బరువు పెరిగింది.

'ఈ కథలోని గాడిదయొక్క అవివేకానికి మన ప్రభుత్వపు విధానాలకు పోలిక యెక్కడ ఉంది?' అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'చండీఘర్ పట్టణం తమకే రావాలి' అంటూ హర్యానా పంజాబ్ రాష్ట్రాలు రెండింటిలోను ఆందోళన జరుగుతున్నది. చండీఘర్ వివాద పరిష్కారానికి తనవద్ద పరిష్కారమార్గం ఉన్నదని ప్రధాన మంత్రిణి అయిన యిందిరా నెహ్రూగాంధీ

## లిట్ క్విజ్ నెం 57 – 18 క్లూలు

1. సలహా/సేవ కావలసినప్పుడు మరియు కోరినప్పుడుమాత్రమే ప్రశంసాపాత్రమవుతుంది

2. శిక్ష దీనినిగురించి ప్రతిఒక్కరూ సలహా నిచ్చేందుకు / వివాదపడేందుకు సిద్ధమవుతారు.

3. ప్రతియుగము/వీరగాథ తన నాయకులను కలిగి యుంటుంది. వారు తన స్వీయ దృష్టిలో గతించినవారందరికంటె గొప్పవారే.

4. శ్రీమంతవంశం/ధనం ఈనాడుసహితం కొంతమేరకు గౌరవాన్ని కలిగిస్తుందనే సత్యాన్ని నిరసించుట నిష్ప్రయోజనం.

5. ఎక్కువమంది జనులకు పూర్తిగా ఉద్యమ విరమణ/పరివర్తన సంభవనీయమైన అత్యంత చెడ్డ విషయం.

6. మనుష్యుడు నిర్భయుడు/అమరుడు.

7. పారిశ్రామిక క్రాంతియొక్క చాల గట్టి సామాజిక ప్రభావములలో నొకటి జనాభా యొక్క సాంద్రత/చలనశక్తిలో వృద్ధియే.

8. ఏదైనా నిర్ధారిత విషయంపట్ల భావుక/యుక్తివిరుద్ధ యోచనాపద్ధతియొక్క వికాసమందు ఇతిహాసం ఒక మహత్వపూర్ణ భాగమైయున్నది.

9. ఇతర జీవిత వస్తువులవలెనే మానవ ప్రకృతియొక్క కేంద్రీయ విజ్ఞానం లాలస/వికాస్ అయివున్నది.

10. నిజమైన వినమ్రత/సజ్జనతయొక్క సారం స్వార్థ ఉపేక్ష.

11. మనుష్యుడు అనిసితరూపంలో జిజ్ఞాసు/అన్వేషకుడు అయివున్నాడు.

12. జనులు స్వాతంత్ర్యము / ప్రేమను గోల్పోయినపుడు వారు ప్రేరక శక్తిని గోల్పోవుదురు.

13. ఏ మనుష్యుడు జీవనంపట్ల తన సర్వస్వమును సమర్పణ చేస్తాడో అతడిని స్వయంగా జీవనం/ప్రేమ నిరసించదు.

14. ఏదైనా సమస్య నైతిక/రాజనీతిక ప్రశ్న అయినయెడల అది సామాన్యంగా చాల తీవ్రమైన అభిప్రాయాలకు గురియౌతుంది.

15. సమయం పెద్ద మరియు గాఢ శూన్యతను కల్పిస్తుంది. మరి దానితో రాష్ట్రములు / ధర్మములు మరియు జాతులు పడిపోతాయి.

16. సర్వశ్రేష్ఠ కవిత / నీతి దీర్ఘకాలమందు అత్యధిక సంఖ్యాకులకు ప్రీతికరమవుతుంది.

17. మానవునిలో గల సర్వవ్యాపక న్యూనత ఏమనగా అతడు ఏ వస్తువునైనా దానిపట్ల వంచితుడు గాకుండా వున్నంతవరకు దానిని లెక్కచేయుడు/వాంఛించడు.

18. మానవ అదృష్టం, అతి తీవ్ర జగడం / ఉత్కం[illegible]మును అనుసరించు చున్న యెడల నిరుత్సాహ మరియు నిరాశామయంగా అంతమై తీరుతుంది.

## No. 57: 18 CLUES

(1) Advice / Service is only appreciated when it is wanted and requested.

(2) Education is something everyone is ready to Advise / Argue about.

(3) Each Age / Epic has its own heroes, who in its own eyes are greater than all that went before.

(4) It is no use denying the fact that Birth / Wealth, even today, commands some measure of respect.

(5) To most people, a complete Cessation / Change of activity is the worst thing that can happen.

(6) Man is Dauntless Deathless.

(7) One of the most striking social effects of the industrial revolution has been the increase in Density / Mobility of the population

(8) History is an important component in the developement of Emotional / Irrational thinking on a given topic.

(9) The central law of human nature as of other living things is Greed / Growth.

(10) The essence of true Humility / Nobility is neglect of self

(11) Man is endlessly Inquisitive / Inventive

(12) When men lose Liberty / Love they lose motivation

(13) Life / Love cannot deny itself to the person who gives life his all.

(14) When an issue becomes a Moral / Political question, it generally draws very intense opinions.

(15) Time causes large and deep vacuities, down which Nations / Religions and races descend.

(16) The best Poetry / Policy is that which in the long run pleases the greatest number.

(17) It is a universal failing in man that he does not Value / Want a thing until he has been deprived of it

(18) The human lot is bound to end in disappointment and despair if it pursues the path of passionate Warring / Yearning.

గమనిక: పై క్లూలు ప్రసిద్ధ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తో పాటు లిట్‌క్విజ్ వీక్లీలో ప్రచురించబడును.

## ముగ్గురు మూర్ఖులు

ప్రకటించింది కాని ఆ పరిష్కార మార్గమేమిటో తెలియజేయలేదు.

'చండీఘర్ సమస్యకు పరిష్కార మార్గం నిజంగా ఆమెకు తెలిసి ఉంటే ఆమె చండీఘర్ సమస్యను వెంటనే యెందుకు పరిష్కరించలేదు? ఇటువంటి సమస్యలను వాయిదా వేస్తూ ఉండడం వలన రెండు పక్షాలవారికి మరింత పట్టుదలలు పెరుగుతాయి. దానివలన ఆ ప్రాంతంలో శాంతి భద్రతలకు భంగం కలిగే ప్రమాదం కూడా ఉంది కదా! అందువలన చండీఘర్ వంటి సమస్యల విషయంలో ఆలస్యం పనికిరాదు. ఏదో ఒకవిధంగా వాటిని వెంటనే పరిష్కరించి వేయాలి. అలాగ కాకుండా అటువంటి సమస్యల పరిష్కారాన్ని వాయిదా వేస్తూ ఉంటే దేశానికే నష్టం కలుగుతుంది' అన్నాడు చూడామణి.

'నువ్వు చెప్పింది బాగానే ఉంది కాని చిదంబరం చెప్పిన కథలోని గాడిదకు మన ప్రభుత్వ విధానాలకు పోలిక యేమిటి?' అని ప్రశ్నించాడు చంచలావు.

'అదే నేనూ చెప్పబోతున్నాను' అంటూ చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు

'సమస్యల్లో రెండురకాలు ఉన్నాయి. ఒకరకం సమస్యల పరిష్కారాన్ని వాయిదా వేస్తూఉంటే కాలక్రమంలో ప్రజలు వాటిని మరచిపోతారు. అప్పుడు యిక ఆ సమస్యలను పరిష్కరించవలసిన అవసరమే ఉండదు. ఈ విషయం మన ప్రభుత్వానికి బాగా తెలుసును యెందుచేతనంటే మన ప్రభుత్వం చాలా సమస్యలను ఆ విధంగానే పరిష్కరించింది.

'ఉదాహరణకు 1962 వ సంవత్సరంలో చైనా మనదేశానికి చెందిన కొన్ని భూభాగాలను ఆక్రమించుకొంది పవిత్రమైన మన మాతృదేశపు భూభాగంనుంచి దురాక్రమణదారుని తరిమివేస్తాము' అని మన పార్లమెంటు యేకగ్రీవంగా ఆ సంవత్సరమే తీర్మానించింది. ఆ తీర్మానం జరిగి యిప్పటికి యేడు సంవత్సరాలు అయింది. అయినా మన ప్రభుత్వం ఆ తీర్మానాన్ని అమలుజరపడానికి తీసికొన్న చర్య యేమిటి ఉంది? ప్రజలు ఆ సమస్యను యిప్పుడు మరచిపోలేదా?/

# దీపావళి ప్రత్యేకాకర్షణ . బహుమతిదాయకమైన మినిక్విజ్

LIT QUIZ NO. 57

Rs. 65,000

1ST Rs. 30,000 · 2ND Rs. 10,000 · UP TO 4 ERRORS Rs. 9,000

GIFTFUL MINIQUIZ Rs. 16,000 EVERY ALL-CORRECT MURPHY TRANSISTOR · EVERY ONE-ERROR Silver Spoon · EVERY TWO-ERROR Purse with Diary

## క్రొత్త రికార్డు

శ్రీ ఆర్. సి జోషి, హరీష్కుంజ్, ప్లేగ్రౌండ్ రోడ్, విలెపార్లె (తూర్పు) బొంబాయి — 57 లిట్ క్విజ్ పిక్చె నెం. 55 లో రూ. 30,000/— గెల్చుకొన్నారు.

ఒక తప్పుతో ఎంట్రీలు పంపిన 22 మంది ఒక్కొక్కరు రూ. 455/— పొందిరి. మినిక్విజ్ లో, 189 మంది ఒక్కొక్కరు రూ 61/— పొందిరి.

— లిట్ క్విజ్ నెం. 57 అధికార ఎంట్రీ ఫారము —

బహుమతుల మొత్తం రు. 65,000. ఆఖరు ముగింపు తేదీ 5-11-69 బుధవారం

ADDRESS LITQUIZ No. 57, ALANKAR BALARAM STREET, BOMBAY-7. (WB)

గమనిక: 1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. (2) ఒక కూపన్ మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరించబడును. (4) I. P. O. క్రాస్‌చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం 57, బొంబాయి—7 వారికి చెల్లించునటు ఉండవలెను.

| Re. 1 | | 1 |
|---|---|---|
| 1 | ADVICE | SERVICE |
| 2 | ADVISE | ARGUE |
| 3 | AGE | EPIC |
| 4 | BIRTH | WEALTH |
| 5 | CESSATION | CHANGE |
| 6 | DAUNTLESS | DEATHLESS |
| 7 | DENSITY | MOBILITY |
| 8 | EMOTIONAL | IRRATIONAL |
| 9 | GREED | GROWTH |
| 10 | HUMILITY | NOBILITY |
| 11 | INQUISITIVE | INVENTIVE |
| 12 | LIBERTY | LOVE |
| 13 | LIFE | LOVE |
| 14 | MORAL | POLITICAL |
| 15 | NATIONS | RELIGIONS |
| 16 | POETRY | POLICY |
| 17 | VALUE | WANT |
| 18 | WARRING | YEARNING |

| Re. 1 | | 2 |
|---|---|---|
| 1 | ADVICE | SERVICE |
| 2 | ADVISE | ARGUE |
| 3 | AGE | EPIC |
| 4 | BIRTH | WEALTH |
| 5 | CESSATION | CHANGE |
| 6 | DAUNTLESS | DEATHLESS |
| 7 | DENSITY | MOBILITY |
| 8 | EMOTIONAL | IRRATIONAL |
| 9 | GREED | GROWTH |
| 10 | HUMILITY | NOBILITY |
| 11 | INQUISITIVE | INVENTIVE |
| 12 | LIBERTY | LOVE |
| 13 | LIFE | LOVE |
| 14 | MORAL | POLITICAL |
| 15 | NATIONS | RELIGIONS |
| 16 | POETRY | POLICY |
| 17 | VALUE | WANT |
| 18 | WARRING | YEARNING |

| Re. 1 | | 3 |
|---|---|---|
| 1 | ADVICE | SERVICE |
| 2 | ADVISE | ARGUE |
| 3 | AGE | EPIC |
| 4 | BIRTH | WEALTH |
| 5 | CESSATION | CHANGE |
| 6 | DAUNTLESS | DEATHLESS |
| 7 | DENSITY | MOBILITY |
| 8 | EMOTIONAL | IRRATIONAL |
| 9 | GREED | GROWTH |
| 10 | HUMILITY | NOBILITY |
| 11 | INQUISITIVE | INVENTIVE |
| 12 | LIBERTY | LOVE |
| 13 | LIFE | LOVE |
| 14 | MORAL | POLITICAL |
| 15 | NATIONS | RELIGIONS |
| 16 | POETRY | POLICY |
| 17 | VALUE | WANT |
| 18 | WARRING | YEARNING |

| Re. 1 | | 4 |
|---|---|---|
| 1 | ADVICE | SERVICE |
| 2 | ADVISE | ARGUE |
| 3 | AGE | EPIC |
| 4 | BIRTH | WEALTH |
| 5 | CESSATION | CHANGE |
| 6 | DAUNTLESS | DEATHLESS |
| 7 | DENSITY | MOBILITY |
| 8 | EMOTIONAL | IRRATIONAL |
| 9 | GREED | GROWTH . |
| 10 | HUMILITY | NOBILITY |
| 11 | INQUISITIVE | INVENTIVE |
| 12 | LIBERTY | LOVE |
| 13 | LIFE | LOVE |
| 14 | MORAL | POLITICAL |
| 15 | NATIONS | RELIGIONS |
| 16 | POETRY | POLICY |
| 17 | VALUE | WANT |
| 18 | WARRING | YEARNING |

FREE AFTER 4 COUPONS

57

## MINIQUIZ

| ADVICE | SERVICE | MORAL | POLITICAL |
|---|---|---|---|
| ADVISE | ARGUE | NATIONS | RELIGIONS |
| AGE | EPIC | POETRY | POLICY |
| BIRTH | WEALTH | VALUE | WANT |
| CESSATION | CHANGE | WARRING | YEARNING |

ఈ క్విజ్ ప్రవేశమునకుచెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరుగారి నిర్ణయము తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/— ఈ పూర్తి ఎంట్రీఫారము (4 కూపనులకు) ఫీజు రు 4/— M. O. రసీదు/I.P.O./లిట్‌క్విజ్ క్యాష్ రశీదు/క్రైజు కార్డు జతపరుస్తున్నాను. హాటీ నెం. ..........

57 (ASVP)

CAPITAL LETTERS

NAME ..............................

..............................

ADDRESS ..............................

..............................

..............................

— ఈ ఫారం ... పూర్తిచేయవలెను —

లిట్‌క్విజ్ నెం. ... ఫారములు మరియు ... ఎంట్రీ ఫారములు:— Eskay Enterprises, C/o. G. V. S. SAIKUMAR, 4-1-213, ... హైదరాబాదు.

* లిట్‌క్విజ్ ... 26—10—69 తే ... మా వద్ద ఉచితంగా లభించును.

ఆఖరు ముగింపు తేదీ: 5—11—69 ఫలితాలు ప్రకటించు తేదీ 9—11—69

* సొల్యూషన్ ... 10 ... పైసల స్టాంపు ... పంపవలెను.

# ముగ్గురు మూర్ఖులు

'అలాగే యింకొక సమస్యను గురించి కూడా ఆలోచించు. దేశవిభజన సమయంలో పాకిస్థాన్ మనదేశానికి సుమారు యాభై కోట్ల రూపాయలు యివ్వవలసింది. ఆ బాకీ వసూలు విషయంలో మన ప్రభుత్వం 'అదిగో, ఇదిగో' అంటూ కాలయాపన చేసింది. ఇప్పటికి యిరవైరెండు సంవత్సరాలు గడచిపోయినా కూడా మన ప్రభుత్వం ఆ బాకీలో ఒక్క రూపాయను కూడా వసూలు చేయలేక పోయింది. 'మనదేశానికి పాకిస్థాను బాకీ ఉన్నది' అనే విషయాన్నికూడా చాలా మంది ప్రజలు మరచిపోయారు. మన ప్రభుత్వం ఆ సమస్యను కాలయాపన చేయడంద్వారా పరిష్కరించలేదా? ఇప్పుడు మనదేశంలో యెవరైనా పాకిస్థాను మనకు యివ్వవలసిన బాకీని జ్ఞాపకం చేస్తే, వాళ్లను 'హిందూ మతోన్మాదులు' అని ప్రభుత్వనాయకులు, యీ సెక్యులరిస్టులు అనబడేవాళ్లు తిట్టే పరిస్థితి యేర్పడింది.

'ఇంకొక సమస్యకూడా ఆలోచించు. దేశంలోని ప్రజలందరికి వర్తించే 'సివిల్ కోడు' ఉండాలని మన రాజ్యాంగంలో స్పష్టంగా చెప్పబడిఉంది. కాని 'హిందూ కోడు' మాత్రం ఉండాలి' అని యెక్కడా మన రాజ్యాంగంలో లేదు. అయినా మన ప్రభుత్వం హిందూ వివాహం మొదలైన వాటిని సంస్కరిస్తూ కొన్ని శాసనాలను చేసింది. కాని మహమ్మదీయుల వివాహం మొదలైనవాటిని సంస్కరించే శాసనాలను చేసే ధైర్యం మన ప్రభుత్వానికి లేదు.

'హిందూ' ఆచారాలను సంస్కరిస్తూ శాసనాలను చేయడం మంచిదే కాని హిందూ ఆచారాలను మాత్రమే సంస్కరించి మహమ్మదీయుల ఆచారాలను యధాతధంగా వదలివేయడం వలన హిందూమతానికి నష్టం కలుగుతూ ఉంది. హిందూ వివాహశాసనం మొదలైన వాటిని ఆమోదించి యిప్పటికి సుమారు పధ్నాలుగు సంవత్సరాలు అయింది. కాని యింతవరకు మహమ్మదీయుల ఆచారాలను సంస్కరించే శాసనాన్ని మనప్రభుత్వం చేయలేక పోయింది. ప్రజలు కూడా యీ విషయాన్ని క్రమంగా మరచిపోతున్నారు. కాలయాపన చేయడంద్వారా మన ప్రభుత్వం 'ముస్లిం కోడ్' సమస్యను పరిష్కరించగలిగింది.

'ఇలాగే కాలయాపన చేయడంద్వారా చండీఘుర్ సమస్యను పరిష్కరించ వచ్చునని భావిస్తున్న మన ప్రభుత్వ విధానానికి చిదంబరం చెప్పిన కథలోని గాడిద ప్రాతినిధ్యం వహించడంలేదా?'

'నీళ్లలో తడిసినందువలన ఉప్పు కరిగిపోతుంది కాని యిసుక కరిగిపోదు. అంతే కాకుండా యిసుక బరువు పెరుగుతుంది. ఈ వివేకం ఆ గాడిదకు లేకపోయింది.

అలాగే మొత్తం దేశానికి సంబంధించిన సమస్యలనైతే కాలయాపన చెయ్యడంద్వారా వాటిని పరిష్కరించవచ్చును. అఖిలభారత సమస్యల నన్నింటినీ కాలక్రమంలో ప్రజలు మరచిపోతారు. దేశంలో ఒక ప్రాంతానికి చెందిన సమస్యల విషయంలో కాలయాపన పనికిరాదు. ఆ ప్రాంతానికి చెందిన ప్రజలు ఆ విషయంలో ఆందోళన చేస్తూనే ఉంటారు. ఈ వివేకం మన ప్రభుత్వానికి లేదు.

'అందుచేత చిదంబరం చెప్పిన కథలోని గాడిదకు మన ప్రభుత్వ విధానాలకు చాలా దగ్గర పోలికలు లేవా?' అని చూడామణి ప్రశ్నించాడు.

'అయితే నేను యింకో గాడిదకథ చెబుతాను' అంటూ చంద్రలావు చెప్పడం ప్రారంభించాడు.

'ఒక ఊళ్లో ఒక చాకలి ఉండేవాడు. అతనికి ఒక గాడిద ఉండేది డబ్బుఖర్చు లేకుండా గాడిదకు గడ్డి సంపాదిద్దామని చాకలి అనుకొన్నాడు. రాత్రిపూట గాడిదకు పులితోలుకప్పి మేతనిమిత్తం పొలాల్లోనికి దానిని చాకలి తోలేవాడు. రాత్రిపూట ప్రజలు దానినిచూసి 'పులి' అని భయపడి పారిపోయేవారు. గాడిద నిర్భయంగా ఆ పొలాల్లో మేసేది. ఆ 'పులి' యెప్పుడూ పొలాల్లోనే ఉండడంవలన కొంతమంది ప్రజలకు అనుమానంకలిగి దానికి కొంచెం దగ్గరగా వెళ్లేరు. ఆ గాడిద వారినిచూసి ఓండ్రపెట్టింది. దానితో ప్రజలు దాని నిజస్వరూపాన్ని తెల్సుకొని చావగొట్టేరు. ఈ కథలోని గాడిదకు మన ప్రభుత్వపు విధానాలకు పోలిక యేమిటి?' అని చంద్రలావు ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన వెంటనే మనదేశాన్ని ప్రపంచంలోని అన్ని దేశాలు గౌరవించాయి. 'భారత దేశానికి మహత్తరమైన ప్రాచీన సంస్కృతి ఉంది అందుచేత భారతదేశం తన సంస్కృతికి అనుగుణంగా అంతర్జాతీయ వ్యవహారాల్లో సముచితమైన పాత్రను నిర్వహిస్తుంది' అని అన్నిదేశాలు ఆశించాయి.

'భారతదేశం అంతర్జాతీయ వ్యవహారాల్లో తటస్థ విధానాన్ని అవలంబిస్తుంది' అని మనదేశానికి మొదటి ప్రధానమంత్రి అయిన నెహ్రూ చెప్పాడు. దేశంలోని ప్రజలు విదేశాలూకూడా మొట్టమొదట ఆ మాటలను నమ్మాయి.

'మన విదేశాంగ విధానం రష్యాకు అనుకులంగా ఉండాలని నెహ్రూ అనుకొన్నాడు కాని దానికి ప్రజలు అంగీకరించరు' అని అతనికి బాగా తెలుసును. అందుచేత తను అనుసరించబోయే విధానానికి 'తటస్థవిధానం' అనే ముసుగును కప్పాడు. హంగరీలో రష్యా జరిపిన దురాక్రమణ సందర్భంలో ఆముసుగు కాస్త తొలగిపోయింది. అప్పుడు ప్రజలు మన విదేశాంగ విధానపు అసలురూపాన్ని తెలుసుకొన్నారు. ఇటీవల చెకోస్లోవేకియాను రష్యా ఆక్రమించుకొన్నప్పుడు కూడా మన విదేశాంగ విధానపుగుట్టు బట్టబయలు అయింది.

'పశ్చిమ ఆసియాలో కూడా మనకు ఒకవిధానం అంటూ యేమీలేదు. ఈ విషయంలో ఐక్యఅరబిక్ రిపబ్లిక్ అధ్యక్షుడు అయిన నాజర్ మన ప్రభుత్వానికి గురువు. అతని కనుసన్నల్లో నడవడమే మన ప్రభుత్వపు లక్ష్యం.'

'మన విదేశాంగ విధానంయొక్క నిజస్వరూపం బయటపడిన తరువాత మన దేశానికి పూర్వం ఉండిన గౌరవం పోయింది. ఇటీవల వరుసగా మనదేశానికి జరుగుతున్న అవమానాలే దానికి సాక్ష్యం.

'నువ్వు చెప్పిన కథలో చాకలియొక్క గాడిద పులితోలు కప్పుకొని కొంతకాలం పాటు నిర్భయంగా గడ్డిమేసింది. కాని ప్రజలు దాని అసలురూపాన్ని తెల్సుకొన్న తరువాత అది అవమానాన్ని పొందింది.

'ఇక్కడ మన ప్రభుత్వం 'తటస్థ విదేశాంగ విధానం' అనే వినాదంతో కొంతకాలంపాటు ప్రపంచంలో గౌరవాన్ని పొందింది. ఈ తటస్థవిధానం అనేది కేవలం రష్యా అనుకూల్యవిధానానికి ముసుగు మాత్రమే అనేవిషయం తేలిపోయిన తరువాత మనదేశానికి గౌరవం తగ్గిపోయింది.'

'అందుచేత ఆ గాడిద మన ప్రభుత్వ విధానాలకు ప్రాతినిధ్యాన్ని వహించడంలేదా?' అని చూడామణి ప్రశ్నించి తిరిగి చెప్పడం ప్రారంభించారు.

'ఒక్క తటస్థవిధానం విషయంలోనే కాదు మన ప్రభుత్వం ఆకర్షణీయమైన వినాదాలతో అమలుజరిపే విధానాలను గురించి చెప్పాలంటే యెంతకాలమైనా పడుతుంది.'

'కొంతకాలం మనప్రభుత్వం సోషలిస్టిక్ పేటర్న్ సొసైటీ అంది. తరువాత 'ప్రజాస్వామిక సోషలిజం', మధ్యమార్గం, కుడికి యెడమ, యెడమకు కుడి, మధ్యకు యెడమ' మొదలైన వినాదాలను మన ప్రభుత్వం యిచ్చింది.

'ఈ వినాదాల వెనుక మన ప్రభుత్వం అవలంబించిన విధానాలవలన మనదేశానికి విదేశాల్లో అవమానం లభించింది. దేశపు సరిహద్దులను మనం కాపాడుకొనలేక పోయాము. దేశంలో శాంతిభద్రతలు రుస్సై పోతున్నాయి. ప్రజల మాన ప్రాణాలకు రక్షణలేకుండా పోతున్నది. ధనికులు మరింత ధనికులు అవుతున్నారు. పేదలు మరింత పేదరికంతో బాధపడుతున్నాము. ఇదేనా ప్రభుత్వం యిచ్చే వినాదాల ఫలితం?

'ఇప్పుడు నువ్వే ఆలోచించు. నువ్వు చెప్పిన కథలోని గాడిదకు, మన ప్రభుత్వపు విధానాలకు యేమైనా తేడా ఉందా?' అని ప్రశ్నించాడు చూడామణి.

'అది సరేకాని, అడ్డగాడిదలాగ తిరుగుతున్నాడు' అనే సామెత ఒకటి మనభాషలో ఉంది. ఆ సామెత మన ప్రభుత్వానికి యెలాగ వర్తిస్తుంది?' అని ప్రశ్నించాడు చిదంబరం.

'అడ్డగాడిదలాగ తిరుగుతున్నాడు' అంటే పనిలేకుండా తిరుగుతున్నాడు అని అర్థం అందుచేత పనిలేకుండా తిరిగేవాళ్ల నందరనూ అడ్డగాడిదల్లాగ తిరుగుతున్నారని అనవచ్చును.



పిరుపల్లి రతీమన్మథరావు (చిట్టిబాబు)
B.Sc. S.Q.C. శిక్షితులు. పశ్చిమ జర్మనీలోని HORNBERGER ఇంజనీరింగ్ సంస్థలో తర్ఫీదుకై ఎయిర్ ఇండియా విమానంలో బయలుదేరి వెళ్ళారు. స్వస్థలం: కాకినాడ. నివాసం: జెంషడ్పూర్. ఉక్కు విపణాల కుటుంబానికి చెందిన యువకుడు.

# ప్రశ్నావళి

1. భారత దేశంలోకెల్లా నారీమణులు అధికంగా పూజింపబడే నగరం.

అ. మదరాసు
ఆ. డార్జిలింగ్
ఇ. హైదరాబాదు
ఈ. తిరువనంతపురం

2. ఉత్తమ సాహిత్యం అధికంగా కనిపించేది.

అ. పుస్తకాలలో
ఆ పాయిఖానా గోడలమీద
ఇ భాగ్యనగరపు గోడలమీద
ఈ. రేడియో దీవంలో.

3 కొందరు యువతుల జడలు హఠాత్తుగా కోసివెయ్యబడ్డాయి, ఒక పెద్ద నగరంలో. దానికి కారణం—

అ. మొక్కుబడి కారణం
ఆ. తలకి నూనె రాసుకొనక పోవటం
ఇ. మంచి దువ్వెన్నలు వాడకపోవటం
ఈ. కొందరు ప్రదేశభక్తులు విజృంభించటం

4 కలకంఠి కన్నీరు ఒలికితే వచ్చేది—

అ. నవ్వు
ఆ. విసుగు
ఇ 100 కోట్ల రూపాయల మిగులు
ఈ. జాతి

5. అసభ్య దూషణకి గురిఅయి సంతోషించేది—

అ. చెవిటివారు
ఆ. తెలుగు ఆడవారు
ఇ. సాధువులు
ఈ. అందరూ

ఉ. వనితా వస్త్రాపహరణ దృశ్యం అనాలోచితంగా చూడగలిగినది—

అ. ఒక ఇతిహాసంలో.
ఆ నైట్‌క్లబ్‌లో.
ఇ. భాగ్యనగరం వీధులలో.
ఈ. విజయనపురం కలలో.

—కూర్పు: అంధపురవాసి.

ఈ ప్రశ్నావళికి సరయిన సమాధానాలు ఎవరికి తోచినట్లు వారే ఇచ్చుకోవచ్చు. అన్నీ రైటయితే ఫెయిల్—ఒకటి తప్పినా చాలు పాస్ కిందే లెక్క!— సంపాదకుడు.

# ముగ్గురు మూర్ఖులు

'మనకు కేంద్రంలోను రాష్ట్రాల్లోను డజన్లకొద్దీ మంత్రులు ఉన్నారు వీరందరూ యెప్పుడూ పర్యటనలను చేస్తూనే ఉంటారు. ఈ పర్యటనల ప్రయోజనం యేమిటి? అసలు యింతమంది మంత్రులు అవసరమా? వీరు చేస్తున్న పనియేమిటి?

'ఆంధ్రప్రదేశ్ విషయాన్నే ఆలోచిద్దాం. సాధారణ యెన్నికల తరువాత బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గం యేర్పడింది. అది రాష్ట్రాన్ని పాలిస్తూ ఉంది. రెండున్నర సంవత్సరాలు గడచిన తరువాత అనగా 1969 జూలై నెలలో మంత్రివర్గ విస్తరణ జరిగింది. సుమారు డజనుమంది మంత్రులను అదనంగా నియమించారు'

'ఈ అదనపు మంత్రులు పరిపాలనకు అవసరమా? నిజంగా వీరి అవసరమే ఉంటే, మొట్టమొదటనే వీరినికూడా నియమించి ఉండేవారుకదా. అందుచేత పని లేకుండానే యీ అదనపు మంత్రులను నియమించారు' అని మనం భావించవలసి ఉంది. లేదా కొత్తగా నియమించబడిన మంత్రులకు పని ఉందంటే, వీరి నియామకం వలన పాతమంత్రుల్లో కొంతమందికి పనిలేకుండా పోయిందన్నమాట. మొత్తానికి మన రాష్ట్రప్రభుత్వంలో కొంతమంది పని లేని మంత్రులు ఉన్నారని మనం అంగీకరించవలసి ఉంది. ఈ విషయంలో మన రాష్ట్రాన్నే అనుకోవలసిన అవసరం ప్రత్యేకంగా యేమీ లేదు. అన్నిరాష్ట్రాల్లోను, కేంద్రంలోనూ కూడా యిదే పరిస్థితి ఉండవచ్చు.

'ఈ పరిస్థితిలో మంత్రులందరూ ఒకరిమీద ఒకరు పోటీ అన్నట్లుగా పర్యటనలు చేస్తున్నారు. పర్యటన చేయని మంత్రి అంటూ లేడు. కాబట్టి మనం మిదను అనుకొన్న పనిలేని మంత్రులు కూడా పర్యటనలు చేస్తున్నారని మనం యిక్కడ అంగీకరించాలి.'

'ఇప్పటికే ఆలస్యం అయింది' అంటూ చంచలావు లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు.

# ధర్మపత్ని

ఇది చంద్రుడిమీద కాలూనిన శకలం? ఏ రంగంలో చూసినా—అభ్యుదయం ఆకాశాన్ని అంటాలని ప్రయత్నం చేస్తున్న కాలమిది. ఇంకా మరీ ఆకాశానికి ఎగిరిపోకుండా తమ వునికిని తెలియజెయ్యడానికి గౌస్తా అండ్ కంపెనీవారు 'ధర్మపత్ని' చిత్రాన్ని తెలుగువారికి సమర్పించారు.

ఇది ఒక కుటుంబ కథాచిత్రం. పిల్లలులేని పత్నుల యాతి బాధల గురించిన చిత్రం కథాంశం కొత్తదిలా కనిపించక పోవచ్చు కాని, కథ చెప్పడంలో వేరున్నది. పాత్ర చిత్రణలో అగినంత ఉదాత్తత వుంది.

పిల్లలంటే అత్తగారికి ఎంతో అపేక్ష. వంశోద్ధారకుడి కోసం కోడలు అలమటించిపోతుంది అన్నిటికీ అతీతుడుగా భార్యే సర్వంగా ఎంచుకుంటాడు భర్త. అయితే, ఈ కథ గట్టెక్కేదెలా? కోడలు గొడ్రాలుగా జీవిస్తే వంశం ఏమయిపోతుంది?— ఈ సమస్యలకి కొడుక్కి రెండోపెళ్ళి చెయ్యడమే జవాబని సూర్యకాంతం ఆ అత్తగారికి బోధిస్తుంది. ఆమె కొడుక్కి నచ్చచెప్పజూస్తుంది. ధర్మపత్ని అంటే 'సంస్కార'మైన వాక్చాతుర్యంతో మనల్నొకసారి పురాణయుగంలోకి తీసుకుపోతాడు కథానాయకుడు! ససేమిరా మరో పెళ్ళి చేసుకోనంటాడు. ధర్మపత్నికి వేరే దారి లేదు. ఆత్మహత్య చేసుకుందామని రైలెక్కుతుంది! ఆత్మరక్షణ కోసం రైలెక్కిన ఒక దగాపడిన తమ్ముడు ఆమెని రక్షిస్తాడు. ఇద్దరూ ఒకే రైల్లో ప్రయాణిస్తున్నవారు గనక, దిగిపోయి ఒకచోట సాహచరం ఏర్పరచుకుంటారు. జైలునుంచి తప్పించుకొచ్చిన ఆ తమ్ముడు ధర్మపత్ని భర్తని హత్య చేద్దామని చూస్తాడు. ధర్మపత్ని అడ్డుకుని తన వారి ధర్మాన్ని కాపాడుతుంది. మలుపులూ మెరుపులూ వున్న ఇంతమంచి కథా కొన్నిచోట్ల కప్పదాట్లు వెయ్యకపోలేదు.

ఇందులో ఉదాత్తమైన పాత్ర ధర్మపత్నిదే కాదు, ఆమె భర్తదీ కూడాను భార్యని అంతగా ప్రేమించిన అతనిపాత్ర 'ధర్మభర్త'గా సార్థకం కాకపోదు! ఎప్పుడో జరిపిన పరీక్షకి ఒక 'ఫైన్ మోర్నింగ్' తీరిక జూసుకుని 'మీ భార్య గర్భవతి' అని డాక్టరు చెప్పడం హాస్యాస్పదంగా వున్నా, యిదే కథాగమనానికి ఆయువుపట్టు గనక చూసేవాళ్ళకు బాగానే అనిపిస్తుంది.

పాత్ర పోషణలో దేవిక ఈ చిత్రంతో ఒకమెట్టు పైకెక్కిందనే చెప్పాలి. పాత్ర అవధుల మేరకు జగ్గయ్య నటన బాగానే వుంది. కథ నడవడానికి నాగభూషణం కారణభూతుడే. అతని నటనలో ప్రత్యేకత లేదుగాని చూడ ముచ్చటగానే వుంది. కొత్తనటి మంజులలో కొత్తదనం వుంది. నటనలో కొత్తదనం పోయి ముదిరుముందు మంచి నటిగా రాణించగల అవకాశాలు వున్నాయి. రాజబాబు, రమాప్రభ పాత్రోచితంగా నటించి హాస్యాన్ని అందించారు. అల్లు రామలింగయ్య నటన పాత్ర అవధుల మేరకు బాగానే వుంది. గ్లామర్ లేకపోయినా ఆ పాత్రలోనే బాగ నప్పించాడు హరనాథ్.

ఎడిటింగ్‌లో మరి కాస్త శ్రద్ధ తీసుకున్నట్టయితే చిత్రం మరింత బాగా రాణించి వుండేది. బియ్యే సుబ్బారావు దర్శకత్వం చిత్రాన్ని చూడతగ్గ విధంగా రూపొందించింది. పినిసెట్టి మాటలు పదునుగా వున్నాయి. కథ ఆర్. కె. ధర్మరాజు. కూర్పు సి. హెచ్. వెంకటేశ్వర్లు.

ఎస్. రాజేశ్వరరావు సంగీతంలో పాటలన్నీ వినసొంపుగా వున్నాయి. స్త్రీలని ఎక్కువగా ఆకర్షించగల ఈ చిత్రానికి నిర్మాత ఎం. జగన్నాథరెడ్డి.

—శీకర్ రాజా


'ధర్మపత్ని'లో దేవిక

## సినిమా డైరీ

● సినీ పిక్చర్స్ పతాకాన తారా సాంపిక చిత్రం యొక్క షూటింగు అక్టోబరు 8 నుండి ఎ వి ఎం లో జరిగింది. శ్రీ నాగేశ్వరరావు పాల్గొన్న దృశ్యాలను శ్రీ వి. మధుసూదనరావు చిత్రీకరించారు

● లలితా ఆర్ట్సు ''మహాగ్రసీమ'' షూటింగు అక్టోబరు 6 నుండి 15 వరకు జరిగింది. శ్రీ రామినీడు దర్శకత్వంలో వాణిశ్రీ, విజయలలిత, శోభన్‌బాబు, ప్రభాకరరెడ్డి నటించారు

● ఎ. ఎం. ప్రొడక్షన్స్ ''మా మంచి అక్కయ్య'' షూటింగు అక్టోబరు 6 నుండి 12 వరకు జరిగింది. కె. ఆర్. విజయ, రాజశ్రీ, గీతాంజలి, సూర్యకాంతం, కృష్ణ, కాంతారావు, పద్మనాభం, మరియు శోభన్ పాల్గొన్నారు. ఈ చిత్రానికి వి. రామచంద్రరావు దర్శకుడు

● గౌస్తా అండ్ కంపెనీవారి ''ధర్మపత్ని'' పూర్ణా పిక్చర్స్ ద్వారా అక్టోబరు 9 న విడుదలయింది ఈ చిత్రానికి బి. ఎ. సుబ్బారావు దర్శకుడు

# లేఖావాణి

లేఖావాణికి తే

## విజయనిర్మల

లేఖావాణి లేఖావాణి లేఖావాణి





**బద్దాం సత్యవతి, ఉత్తపురం**

ప్రధానమంత్రి స్త్రీయే కాబట్టి రాష్ట్రాల ముఖ్యమంత్రుల పదవులనికూడా మహిళలే నిర్వహిస్తే బాగుంటుందేమో? మీ అభిప్రాయం?



నిర్వహిస్తే బాగానే వుంటుంది. కాని, ప్రధానమంత్రి స్త్రీయే కాబట్టి అన్నారు ఈ సందర్భంలో ఆమె నెహ్రూగారి కుమార్తె అన్న సంగతి మరచిపోకూడదు తండ్రితో పాటు రాజకీయరంగంలో కొన్నేళ్లు నిర్విరామంగా తిరిగి—ఆ రంగంలో ఎంతో పరిజ్ఞానం, చతురత ఎన్నో మెళుకువలూ, సులువులూ తెలుసుకోగలిగారామె. అంతటి సమర్థత మన మహిళల్లో ఎంతమందికి ఉంటుంది?

**విరక్టర కళావతి, మైదరాబాద్**

చిత్రం సగం పూర్తయింతర్వాత "అంతరాత్మ" పేరు పెడితే?

అంతరాత్మ పేరు పెట్టినా చిత్రం పూర్తిచేయాల్సిందే. తప్పదు ఇదేమన్నా 'భవనాని'కి ఎన్నిక అనుకున్నారా?

**ఏనుగు లతాంగి, కరినగరం**

మంత్రివర్గంలో సినిమా ప్రతినిధి ఒకరువుంటే మంచిదంటారా?

మంచిదని మెల్లిగా అంటారేమిటి?... చాలా మంచిది చలనచిత్ర పరిశ్రమ బాగోగుల్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకొని అభివృద్ధికి తోడ్పడేవారు.



**గట్టు సుకుమారి, రతివాడ**

మీరీమధ్య చాలా బిజీగా వుంటున్నారని విన్నాను. పన్నులు సరిగా కట్టగలుగుతున్నారా?





ఇంకా నయం; నేనేమన్నా పెద్ద 'బాబూ' జీననుకున్నారా, మళ్ళీ మరుపు సాకు చెప్పటానికి?

**కరకంఠ సంగీతరాణి, మోతాబద్**

మేకప్ వేసుకుంటే మన రాజకీయ నాయకులుకూడా (ఫొటోల్లో) యింకా అందంగా పడతారుకదా?

మేకప్ వేసుకోనక్కరలేకుండానే ఫొటోల్లో అందంగా పడుతున్న రాజకీయనాయకులు లేకపోవడమేమిటి? ఉన్నారు. బాబూ జగజీవనరామ్, మదిఅళగన్, హనుమంతయ్య, పి. సి. ఘోష్...



'మెరుపు వీరుడు' లో కాంతారావు, రాజశ్రీ

# సినిమా

శ్రీ జి రామినీడు అభ్యుదయ భావాలు, ఉత్తమ ఆశయాలు కల్గిన దర్శకుడు అనడానికి 'చివరకు మిగిలేది,' 'కలిమి లేములు', 'బంగారు సంకెళ్ళు' చిత్రాలే నిదర్శనం 'పొరుగింటి పుల్లకూర రుచి' అంటారు; అలాగే మన వాళ్ళు పరభాషా దర్శకులను విలువెత్తున పొగడ్తారు నాటికి నేటికి దేశకాల మాన పరిస్థితులలో ఎంతో తేడా కనిపిస్తోంది నేటి సామాజిక ప్రగతికి ఉపయోగపడే కథా వస్తువులను ఎన్నుకోవడంలో శ్రీ రామినీడు గణనీయులు 'కలిమి లేములు' చిత్రంలో కుటుంబ నియంత్రణ ఆవశ్యకతను చూపెట్టాలనుకున్నారట. కానీ, ఆ చిత్రంలో వారి సంకల్పం నెరవేరలేదు.

ప్రస్తుతం శ్రీ రామినీడు తెలుగు ప్రేక్షకులకు ఒక అపూర్వమయిన కరుణామయి విచిత్రగాథను త్వరలో చూపించనున్నారు ఈ కథాంశంగల చిత్రాన్ని లలితా ఆర్ట్స్ వారి నిర్మిస్తున్నారు. చిత్రానికి 'మూగప్రేమ' అని పేరుపెట్టారు

* * *

ఒక యువకుడ్ని యిద్దరు యువతులు ప్రేమిస్తారు; ఒకరు తన ప్రియుడ్ని మనసులోనే దాచుకుంటుంది తన్ను కూడా ఆయన ప్రేమిస్తున్నాడని ఊహించుకుంటూ, గాలిమేడలు కట్టుకుంటుంది. మరొకతె తన ప్రేమను బట్టబయలు చేస్తుంది. తన ప్రేమగాథను మొదటి యువతికే వెల్లడిస్తుంది; ఇద్దరూ ప్రాణ స్నేహితులు కావడంవల్ల, తన ప్రియుడ్ని తన స్నేహితురాలికి అర్పిస్తుంది. 'మూగప్రేమ'ను వెల్లడించలేని అబలగా, తను ఆరాధించిన దైవాన్ని తన నెచ్చెలికి అర్పించవలసిన త్యాగమూర్తిగా కుమారి వాణిశ్రీ మహోన్నతంగా నటిస్తున్నదని 'మూగప్రేమ' నిర్దేశకుడు శ్రీ రామినీడు వెల్లడించారు 'వాణిశ్రీ యింతవరకు ఎన్నో చిత్రాలలో ఉన్నతంగా నటించి వుండవచ్చు కానీ యీ చిత్రం విడుదలయితే ఆమె నటన యావద్భారత ఖ్యాతినందుకోగలదని ఊహించవచ్చు. వాణిశ్రీకి ఏ పాత్ర ఇచ్చినా, అద్భుతంగా నటించగలదనే అభిప్రాయం యేర్పడగలదని ఘంటాపథంగా చెప్పగలనన్నారు శ్రీ రామినీడు. 'మూగప్రేమ'ను శ్రీ శేషమల్ నిర్మిస్తున్నారు శ్రీ చటర్జీ నిర్వహణలో తయారవుతున్న యీ చిత్రంలో విజయలలిత, శోభన్‌బాబు, చలం ప్రభాకరరెడ్డి ముఖ్య పాత్రధారులు.

* * *

'కథానాయకుడు' చిత్రంలో ఇల్లరికపు టల్లుళ్ళుగా నటించిన శ్రీయుతులు పద్మనాభం, రాజబాబులు 'పచ్చని సంసారం'లో బావమరదులుగా నటిస్తున్నారు 'కథానాయకుడు' చిత్రానికి శ్రీ, హేమాంబరధరరావు దర్శకులయితే, 'పచ్చని సంసారం'కు వారి శిష్యుడు శ్రీ లక్ష్మీ దీపక్ నిర్దేశకుడు

* * *

పద్మనాభం రాజబాబులిద్దరూ తిరుగుబోతులు మరియు సోమరిపోతులు వారికి ఉద్యోగం సద్యోగం లేదు ఊరంతా అప్పు చేసి తమకడుపులు నింపుకుంటారు; చేతిలో డబ్బులేదు, ఏం చేద్దాం? ఊళ్ళో మనల్ని బతకనివ్వరు; టీ కొట్టుకు సిగరెట్టు కొట్టుకు బాకీ కట్టకపోతే మన పీపు విమానమే లే, డబ్బునెలా సంపాదించాలి? అంటూ యిద్దరూ తల గోక్కుంటారు. 'మా అమ్మను అడుగుదాం పద' అంటాడు రాజబాబు; ఎవర్ని మీ అమ్మనా? ఏదైనా వుంది నీ వరస. మీ అమ్మ అంత మంచిదయితే మీ నాన్న సన్యాసుల్లో ఎందుకు కలుస్తాడు వెళ్ళాలి చెప్పి పోడుస్తాడు పద్మ



'శ్రీదేవి' లో కె. ఆర్. విజయ, హరనాథ్

వేషం. "కట్" అన్నారు దర్శకుడు శ్రీ దీపక్, రాజబాబు అమ్మ ఎవరనుకుంటు న్నారు 'అమ్మలగన్నయమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ చాలా పెద్దమ్మ శ్రీమతి సూర్యకాంతమ్మ' ఆమెధాటికి ఆగలేక సన్యాసుల్లో కలసిన ఆ మగధీరుడు శ్రీ రమణారెడ్డి; ఈ సన్నివేశం బిఎన్ మూవీస్ 'వచ్చిన సంసారం'లో మీకు కని పిస్తుంది.

*  *  *

'వచ్చిన సంసారం' కథ నటుడు శ్రీ ప్రభాకరరెడ్డిది. మాటలను నడి



'అగ్గివీరుడు'లో రాజశ్రీ

పిస్తున్నది శ్రీ సూరి కలం; చిత్రంలో కనిపించే దృశ్యాలను శ్రీ వెంకటరత్నం ఛాయా గ్రహణం నిండుగా కనిపింప చెస్తుంది. చిత్రంలో వినిపించే పాటలను శ్రీ కోదండపాణి సంగీతం మయూ రంలా నాట్యం చెయిస్తుంది ఈ చిత్రం లో కనిపించే భూమికలను కృష్ణ, గుమ్మడి, రామకృష్ణ, పద్మ నాభం, రాజబాబు రమణారెడ్డి, ధూళిపాళ, మిక్కిలినేని, పెరుమాళ్ళు, వాణిశ్రీ, కె ఆర్. విజయ, గీతాంజలి, సూర్య కాంతం, సంధ్యారాణి నిర్వహిస్తున్నారు.

# తెరపై "ముద్దు"

# కావాలా? వద్దా?

**ముద్దులేకుండానే శృంగారం...**

కుమారి వాణిశ్రీ: 'ముద్దా! ఛీ! మనకా! వద్దనే వద్దు



ఒక చిత్రంలో బాగా నటించామనుకోండి వాణిశ్రీగారు మీరు అద్భుతంగా నటించారండీ అని ప్రశంసిస్తారు. చిత్రంలో అందంగా కనిపిస్తే, మీరు చాలా అందంగా వున్నారండీ అంటారు. అలాగే 'ముద్దు' దృశ్యాలను ప్రవేశపెడితే, మీరుపెట్టిన 'ముద్దు' అబ్బా! ఎంత ముద్దుగా వుందండీ అని చెప్పడం ఖాయం. మనం అంత దిగజారవలసిన అవసరంలేదు, 'ముద్దు' లేకుండానే శృంగారరసాన్ని పొలికించ వచ్చు.

*  *  *

**సభ్యత—గౌరవం?...'**

శ్రీ జి రామినీడు [illegible] మనకు ముద్దుకు చాలా దూరమండీ భర్తను ఏరోడ్రోంకు సాగనంపే భార్య 'ముద్దు పెట్టుకుంటుందా? లేక భర్తను ముద్దివ్వమని అడుగుతుందా? మన చిత్రాలకు, మన సభ్యతకు వున్న గౌరవాన్ని మనం మంటగలుపు కుంటామా?

*  *  *

**నిమిత్త మాత్రులం...**

'విజయలలిత' మీకు ముద్దంటే



యిష్టమేనా?' అని ప్రశ్నించాను — 'ఇప్పుడు మేము చేస్తున్న వ్యాల్యాలు, వేస్తున్న దుస్తులు మాయిష్టం కొద్దేనా చెప్పండీ, అలాగే ఎప్పుడు ఏది, ఎలా జరగాల్సి వుంటుందో అలా జరిగి తీరుతుంది. మనం నిమిత్త మాత్రులమే' అంది.

సేకరణ శ్రీనివాస్

ఈ చిత్రానికి అనంతరామ్ కళా దర్శకత్వాన్ని, లక్ష్మీదీపక్ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

* * *

శ్రీ ఆదుర్తి సుబ్బారావువద్ద, శ్రీ వి. మధుసూదనరావు వద్ద సుశిక్షితుడయినవాడే శ్రీ పి. సి. రెడ్డి; శ్రీ రెడ్డి యొక్క శక్తిని రక్తి కట్టించాలనే వుద్దేశం ఒక నిర్మాతకు కలిగింది. దాని పర్యవసానమే 'అనురాధా ఆర్ట్సు ప్రొడక్షన్స్' పుట్టుక. ఈ సంస్థకు శ్రీ ఎస్. వి. ప్రభాకర రెడ్డి అధినేత; వీరి చిత్రం యొక్క మొదటిపాట రికార్డింగు అక్టోబరు ఏడవ రోజున విజయగార్డెన్స్ థియేటర్లో జరిగింది. పాటను శ్రీ ఆత్రేయ వ్రాసారు శ్రీ కె. వి. మహాదేవన్ ట్యూన్ చేసారు. శ్రీ ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

## సినిమా

పాడారు. శ్రీ స్వామినాథన్ రికార్డు చేశారు.

'ఇంతలేసికళ్లతో అంతలేత మనసుతో చేస్తున్నా వెంత వింత గారడీ — రోజూ చూస్తున్నా కొత్తగానే వున్నది.'— ఈ పాటను హీరో కృష్ణపై చిత్రీకరిస్తారు

ఈ చిత్రంలో కృష్ణ, గుమ్మడి, నాగభూషణం, కృష్ణంరాజు రాజబాబు, అల్లు రామలింగయ్య, చంద్రమోహన్, విజయనిర్మల, మంజుల, రమాప్రభ ప్రధాన పాత్రలను పోషిస్తారు రచన శ్రీ ఆత్రేయది; కథను శ్రీ ఎస్. కృష్ణారావు, ఛాయాగ్రహణాన్ని శ్రీ వెంకట రత్నం, నృత్యాన్ని శ్రీ కె. ఎస్. రెడ్డి, కూర్పును



'పిల్లాయి చిన్నయ్య'లో కె. ఆర్. విజయ

### మీకు తెలుసా?

బొంబాయిలో నిర్మింపబడుతున్న ఒక హిందీ చిత్రంలో 12 మంది హాస్య నటులు నటిస్తున్నారట.

మద్రాసులోని జెమినీ స్టుడియోలో ఒక రాజస్థానీ చిత్రం నిర్మింపబడుతున్నది.

హిందీ నటుడు శ్రీ బిశ్వజిత్‌ను ఆయన నిర్మాతలు తమ చిత్రాలలో ఆయనచేతనే పాటలు పాడించాలనుకుంటున్నారట

హాలివుడ్ దంపతులు శ్రీమతి ఎలిజబెత్ టైలర్, రిచర్డ్ బర్టన్‌లు తమ వద్దనున్న జెట్ విమానానికి విపరీతమయిన ఖర్చు అవుతున్నదని ఎంచి, దాన్ని అమ్మేశారట.

ప్రముఖగాయకి లతామంగేష్కర్ 60 రోజులవిశ్రాంతికోసం లండన్ వెళ్లారట

శ్రీ సత్యం నిర్వహించే యీ చిత్రం యొక్క షూటింగు (అవుట్‌డోర్‌తో) అక్టోబరు 11 న ప్రారంభ మవుతుంది. ఇన్‌డోర్ షూటింగు అక్టోబరు 21 నుండి వాహినీలో వరుసగా జరుగగలదని తెలుస్తోంది.

*

విజయ నందన్యోద్యానంలో నేను కన్న ఒక సుందరదృశ్యాన్ని మీ ముందుంచుతా. గీతాంజలిని పద్మనాభం సూటిగా (ఆమె కళ్లలోకి) చూస్తున్నాడు: ఆమె ఆ చూపులకు తట్టుకోలేక పోయింది ఆయన్ను ఓరగా చూడసాగింది; ఇద్దరికళ్లూ కలిసి నృత్యం చెయ్యసాగాయి: ఆ ఆనంద పారవశ్యంలో ఒకర్నొకరు గట్టిగా కౌగలించుకున్నారు; మరుక్షణంలోనే ప్రేమికులిద్దరి పెదవులు కదిలాయి:

గీత: జాబులు పనిచేస్తున్నాయ్

పద్మనాభం: జంటను కలిపేస్తున్నాయ్

గీత: కళ్లారా చూశాను.

పద్మనాభం: విరహంలో నిలిచాను — అంటూ గీతాంజలిని అమాంతంగా వాటేసుకున్నాడు పద్మనాభం; ఈ శృంగార ఘట్టాన్ని 'మా మంచి అక్కయ్య' చిత్రంలో చూస్తారుగా: ఈ పాటను పాడినవారు ఎల్. ఆర్. ఈశ్వరి, పిఠాపురం.



శ్రీవిఠల్ కంబైన్స్

# అగ్గివీరుడు

నిర్వహణ: కథ,స్క్రీన్‌ప్లే,నిర్మాత,దర్శకుడు:

బి.విఠలాచార్య • బి.వి.శ్రీనివాస్

ఆంధ్రావిజయ కంబైన్స్,
నైజాం విద్యాదత్తా
సీడెడ్ నవభారత్
ఒరిస్సా విఘ్నేశ్వరా
మైసూరు నవరంగ్

VIJAYA

# 'మా యింట్లో ఎవరికీ యిష్టంలేదు...'

## — విజయలలిత



గిరి రోడ్డులోవున్న విజయలలిత యింటికెళ్ళాను ఆమె అప్పుడే షూటింగుకు బయల్దేర బోతూంది 'సారీ మ్యాడమ్, ఒక పది నిమిషాలు మీతో'; 'ఓ. ఎస్, అలాగే' అంటూ కుర్చీ చూపించింది.

ప్ర: ఎవరిది షూటింగు? చాలా హడావిడిగా వున్నట్టున్నారే?

జ: లలితా ఆర్ట్స్‌వారి 'మూగ ప్రేమ' షూటింగు; నాకు శ్రీరామి రెడ్డిగారు సరికొత్త పాత్ర నిచ్చారు. ఆ పాత్రలో నాకు మంచిపేరు రావాలిగా. అందుకే ముందుగా సెట్టుకి వెళ్ళి, డైలాగులు, ఎక్స్‌ప్రెషన్స్‌ను దర్శకునివద్ద నేర్చుకుంటున్నాను.

ప్ర: దసరా వచ్చిందిగదా. మీ యింట్లో పేరంటాలు, బొమ్మల కొలవు?

జ: క్షమించండి; దసరా అంటేనే మా యింట్లో వాళ్ళందరికీ అయిష్టం; ఏహ్యం కూడా.

ప్ర: కారణం?

జ: కొన్ని సంవత్సరాల్రకితం మేము బొమ్మలకొలువు పెట్టాము. పది వరుసల్లో వివిధ ఆకృతులు కలిగిన అందమయిన బొమ్మలను అమర్చి వూళ్ళోని ముత్తయిదువులను, పిల్లలను పేరంటాలకు పిలవడానికి వెళ్ళాము. కాని!

ప్ర: కాని?

జ. మేము తిరిగొచ్చేసరికి మా యింట్లో గావుకేకలు, ఏడ్పులు విన వచ్చాయి.

ప్ర: ఏం జరిగింది?

జ: మా అత్తకూతురు పదేండ్ల పిల్ల, దీపారాధన చేస్తుంటే, ఆ దీపానికి ఆ పాపాయి ఒళ్ళు ఆహుతి అయింది అప్పట్నుండి దసరా ఎందుకొస్తుందిరా అనిపిస్తుంది—అని చెప్తుంటే ఆమె మొఖం దుఃఖంతో నిండిపోయింది. సారీ. మీ మనస్సును క్షోభపెట్టడం నా కిష్టంలేదు మరోసారి కలుద్దాం అని వచ్చేసాను.

ఇంటర్వ్యూ: శ్రీనివాస్.

# సినిమా

శ్రీ వి. రామచంద్రరావు దర్శకత్వంలో నిర్మితమయ్యే యీ చిత్రంలో కృష్ణ రాజశ్రీ యువప్రేమికులుగా నటిస్తున్నారు. వారిద్దరూ పాడేపాటను కూడా తెలుసుకోండి.

కృష్ణ: ఏమోఏమో అడగాలనుకున్నావు.
ఏమిరాని పసిపాప వైనావు.

రాజశ్రీ: ఏదోఏదో చేయాలనుకున్నావు.
మాటేరాని పసివాడ వైనావు.



'విచిత్ర పిడుగు'లో జ్యోతిలక్ష్మి

ఈ పాటను శ్రీ అప్పలాచార్య వ్రాసారు. శ్రీ కోదండపాణి స్వర కల్పన చేసారు. ఈ పాటను పాడినవారు: ఘంటసాల, జానకి. ఈ చిత్రం రామణి ఫిలింస్‌ద్వారా విడుదలవుతుంది. విజయ, శోభన్ల దంప

తులుగా నటిస్తున్న ఈ చిత్రాన్ని శ్రీ ఆనందమోహన్ నిర్మిస్తున్నారు.

* * *

సురేష్‌మూవీస్ 'సిపాయి చిన్నయ్య' షూటింగు (అవుట్‌డోర్‌తోసహా) పూర్తయింది: అక్టోబరు 4 నుండి 7 వరకు కేరళ మరియు పరిసర ప్రదేశాలలో రెండు పాటల చిత్రీకరణ జరిగింది. హీరో శ్రీ నాగేశ్వరరావు, కె. ఆర్. విజయలు పాల్గొన్న రెండు ప్రేమ పాటలను శ్రీ ఎస్. ఎస్. లాల్ ఛాయాగ్రహణ సహాయంతో, శ్రీ జి. వి. ఆర్. శేషగిరిరావు వివిధ కోణాల్లో చిత్రీకరించారు. భారీ ఎత్తున నిర్మింపబడ్డ ఈ సాంఘిక చిత్రంలో శ్రీ అక్కినేని రెండు పాత్రలను (విభిన్నమయినవి) అశేష ప్రజ్ఞతో పోషించారు. శ్రీ రామానాయుడు నిర్మించిన ఈ చిత్రం నవయుగా ద్వారా ఈ నెలలోనే విడుదలవుతుంది.

**ముద్దులపై శ్రీ నహతా అభిప్రాయం**

'భారతదేశానికి, భారతీయ సంస్కృతికి, సంప్రదాయానికి విదేశాలలో విశిష్టమయిన స్థానం వుంది అలాగే మన చిత్రాలకు ఒక ప్రత్యేకత వుంది. ఇపుడు కోస్లా కమిటీ సిఫారసులను ఆచరణలో పెట్టి, ముద్దులను నగ్న దృశ్యాలను ప్రవేశ పెడితే మనకున్న గౌరవమర్యాదలు ఏమవుతాయో చెప్పలేం కాబట్టి నిర్మాతలందరూ కడు జాగ్రత్తతో, మెళకువతో తమకిచ్చే స్వాతంత్ర్యాన్ని వుపయోగ పర్చుకోవాలి. ప్రణయ సన్నివేశ చిత్రీకరణలో నయితేనేమి, ప్రణయగాథలను తెరకెక్కించే సమయంలో నయితేనేమి అవసరమయిన జాగ్రత్తలను తీసుకోవాలి' అని ప్రముఖ నిర్మాత, మద్రాసునగర షెరీఫ్, భారతదేశ ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షులు మరియు ప్రబల పంపిణీదారులు అయిన శ్రీ సుందరలాల్ నహతా అభిప్రాయ పడుతున్నారు.

* * *

మనదేశంలో 'సినిమా' ప్రతివాని జీవితంలో అంతర్భాగమై వుంది; సామాన్య పౌరుడ్ని సాధ్యమయినంత వరకు విజ్ఞానవంతుణ్ని చెయ్యడమేగాక, అతనికి వినోదాన్ని, విశ్రాంతిని కలుగచేసే ముఖ్యసాధనంగా సినిమా వుంది. భారతీయ చిత్రాలకు విదేశాలలో గల ప్రాశస్త్యాన్ని వివరిస్తూ, మనదేశపు విలువలను ద్విగుణీకృతం చెయ్యడానికి కారణభూతులయిన చిత్ర నిర్మాతలను, దర్శకులను, కళాకారులను శ్రీ సుందర్‌లాల్ నహతా అభినందిస్తూ, ప్రత్యేకించి తెలుగుచిత్రాలు యితర దేశాల్లో ప్రదర్శింపబడి, వ్యాపార రంగంలో కృషిసాగించే శుభదినాన్ని తాము యెదురు చూస్తున్నట్టు తెలియచేసారు.

* * *

సినిమారంగానికి ఏదో ఒక విధమయిన 'సెల్ఫ్ రెగ్యులేషన్' చాలా అవసరమని తద్వారా పరిశ్రమలో క్రమశిక్షణ యేర్పడి, అన్ని వర్గాలవారికి ప్రయోజనకారి కావటమే గాక, వుత్తమచిత్ర నిర్మాణానికి పూలబాట వెయ్యగలదనే ఆశాభావాన్ని వెల్లడించారు; ఫిలిం కౌన్సిల్ స్థాపన ద్వారా పరిశ్రమకు ఎనలేని మేలు జరగడం నిజమయితే, తాము కౌన్సిల్‌ను తిరస్కరించమని శ్రీ నహతా చెప్పారు.

* * *

పద్మశ్రీ పిక్చర్స్ నిర్మించిన 'వింత కాపురం' మిమ్మల్ని చక్కిలిగింతలు పెట్టింది. ఇపుడు 'అల్లుడే మేనల్లుడే' ముస్తాబవుతున్నాడు. ఈ చిత్రానికికూడ శ్రీ భమిడిపాటి రాధాక్రిష్ణ సంభాషణలను

## సినివార్త

[illegible] సంగీత సారథ్యం శ్రీ శంకర్‌కు అప్పగించబడింది. అక్టోబరు 6 వ విజయాగార్డెన్స్‌లో మొదటి పాట రికార్డింగు జరిగింది. శ్రీ శంకర్ 'అనాయకుడు' చిత్రానికి సంగీతాన్ని విని పించిపున్నారు. శ్రీ అబ్బి దర్శకత్వంలో తయారవుతున్న రెండవచిత్రం యిది; శ్రీ పి పుల్లయ్యగారివద్ద దర్శకత్వశాఖలోని [illegible] విశేషంగా అభ్యసించిన దర్శకుడిగా 'చింతకాపురం'లోనే మంచి పేరు తెచ్చుకున్నారు. 'అల్లుడే మేనల్లుడే' చిత్రాన్ని ప్రేక్షకజన రంజకంగా రక్తి కట్టించగలరని ఆశించడంలో తప్పు లేదేమో! ఈ వినోదాత్మకమయిన సాంఘిక చిత్రంలోని ప్రధానపాత్రలను కృష్ణ, నాగభూషణం, కృష్ణంరాజు, రాజబాబు, అల్లు రామలింగయ్య, విజయనిర్మల, సూర్యకాంతం పోషిస్తారు షూటింగు శారదా స్టూడియోలో అక్టోబరు 11 సాయంత్రం





'మెరుపు వీరుడు' లో విజయలలిత

మంచి ప్రారంభమయింది. ఈ చిత్రాన్ని శ్రీ వి. వెంకటేశ్వర్లు నిర్మిస్తున్నారు.

* * *

నిర్మాత శ్రీ వి. కె. ప్రసాద్ అదృష్టవంతుడు. అందుకే 'పత్తేకాలవు పత్తేయ్య' విజయవంతమైంది. ప్రస్తుతం రెండవ చిత్ర నిర్మాణానికి ఉపక్రమించారు. డిసెంబరుకు కథ రెడీ అవుతుందని, జనవరిలో సెట్స్‌కు వెళ్లగలమని ప్రసాద్ వెల్లడించారు. పాలుకు ఒక చక్కటి చిత్రాన్ని

# "పదిరోజులు పండుగ చేసుకుంటాను"



## — గీతాంజలి

పియన్ హిల్‌లోని గీతాంజలి యింటికి వెళ్ళాను. నిగనిగలాడె నీలి పట్టుచీరె, ఊదాకాంబరం పట్టు జాకెట్టు ధరించి, టిప్‌టాప్‌గా షాపింగుకు బయల్దేర పోతున్న ముద్దుబంతిలాంటి గీతాంజలి నన్ను చూచి సడన్‌బ్రేక్ వేసింది; హలో మ్యాడమ్, బొమ్మలు కొనడానికి బయల్దేరినట్టుందే?

గీతాంజలి: నో, నో మా చెల్లెలి పెండ్లి! ఆమెకు ఆభరణాలు చూచి వద్దామని.

ప్రశ్న: మరి దసరాకు 'కొలువు' ఎప్పట్నుండి పెడతారు?

జ: 'బొమ్మల కొలువు'కు వెళ్ళడమే గాని పెట్టడం అలవాటు లేదండీ.

ప్ర: ఆ పదిరోజులు పండుగ చేసుకుంటారా?

జ: అవునండీ. ప్రతిరోజూ మంగళ స్నానంచేసి, మడిగా దేముడికి ప్రసాదం పెట్టి, ఒకపూట ఉపవాసం వుంటాము.

ప్ర: ప్రసాదమంటే?

జ: ప్రతిదినం ఒక్కొక్క పుష్పంతో దేమునికి అంజలి ఘటించి ఆ పదిరోజులు ఒక్కొక్క రకమయిన పిండి వంటలను భగవంతునికి ప్రసాదంగా పెడతాము.

ప్ర: దసరాకు మీరు ప్రాముఖ్యత యివ్వడానికి కారణం?

జ: హైందవులు జరుపుకునే ముఖ్యమయిన పండుగలలో యిదొకటి; ఈ మంచి సమయాన వచ్చి స్వర్గాన వున్న మాఅమ్మ ఆత్మ శాంతించాలనే కోరికతో పండు ముత్తయిదువులకు తాంబూలం రవికెగుడ్డ యిచ్చి సత్కరిస్తుంటాము.

ఇంటర్వ్యూ: శ్రీనివాస్

నిర్మించడానికి నిశ్చయించినట్టు కూడా తెలిపారు.

* * *

శ్రీ నటరాజ సంగీత నాటకకళా పరిషత్తు (ప్రొద్దుటూరు) ద్వితీయ వార్షికోత్సవం అక్టోబరు 4 నుండి 10 వరకు జరిగింది. ఈ సందర్భంగా నాటక నాటిక (పోటీ) ప్రదర్శనలు జరిగాయి. అక్టోబరు 10 వ తేదీన చలనచిత్ర కథానాయకుడు



'మళ్ళీ పెళ్ళి'లో కృష్ణంరాజు, అనిత

శ్రీ ఎన్. టి. రామారావుగారిని గండపెండేరంతో ఘనంగా సత్కరించారు. ఆనాటి సభకు ఆంధ్రప్రదేశ్ ఇరిగేషన్ మంత్రి శ్రీ శీలం పెద్దారెడ్డిగారు అధ్యక్షత వహించారు. మహాకవి శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రి సభను ప్రారంభించారు. ప్రసిద్ధ నాటక రచయిత

శ్రీ గొల్లపూడి మారుతీరావును, యావద్భారత కీర్తినార్జించిన దర్శకుడు శ్రీ తాపీ చాణక్యను సన్మానించారు. ఆనాటిరాత్రి పది గంటలకు ఈలపాట శ్రీ కె. రఘురామయ్య కృష్ణుడుగా నటించిన 'కృష్ణతులాభారం' నాటక ప్రదర్శన జరిగింది.

* * *

అహింసను బాణంగా, సత్యాగ్రహాన్ని ఆయుధంగా వుపయోగించి మనకు దాని సత్వాన్ని నిర్మూలించిన దివ్యపురుషుడే పూజ్యబాపూజీ. ఇపుడు మహాత్ముని శతజయంత్యుత్సవాన్ని జరుపుకుంటున్నాము. ఈ శుభసమయాన విజయవాడలో మధూ గార్డెన్స్‌లో గాంధీజీ చిత్రకళా ప్రదర్శనం ఏర్పాటు చెయ్యబడింది. సబర్మతి వెళ్ళి చూడలేనివారికి యిది చక్కటి అవకాశాన్ని కలిగించింది. ఈ ప్రదర్శనశాలలో మనల్ని ముఖ్యంగా ఆకట్టుకునే అంశాలు రెండున్నాయి. 1933లో గాంధిజీ తెనాలి వచ్చినప్పుడు వారి కాలిచెప్పును దక్కించుకున్న భాగాన్ని పొందిన శిల్పి శ్రీ నారాయణరావు స్వయంగా ఆ మహాత్ముని పాదరక్షను తెచ్చి వుంచడం ఒకటి, మహాత్మాగాంధి స్వదస్తూరితో వ్రాసిన వుత్తరాన్ని శ్రీ యస్. వి. కృష్ణారావు తెచ్చి వుంచడం మరొకటి. పవిత్రమూర్తి, నిరాడంబరజీవి మన జాతిపిత శతజయంతి సందర్భంగా యీ ప్రదర్శనశాలను యేర్పాటు చేసిన ఆంధ్రా అకాడమి ఆఫ్‌ఆర్ట్సు, మధూ గార్డెన్స్, గాంధీహిల్ సొసైటీ, గాంధీ పీస్ ఫౌండేషన్ సొసైటీ కృషి అభినందించదగినది.

* * *

సెప్టెంబరు 28 న శ్రీ నాగేశ్వరరావు 46 వ పుట్టినరోజు పండుగను చిత్తూరు శ్రీ నాగేశ్వరరావు సాంస్కృతిక సంఘం ఘనంగా జరిపారు. ఈ సందర్భంగా 500 మంది పేదలకు అన్నదానం చెయ్యబడింది. శ్రీ పి. నరసింహారెడ్డి ఎం. ఎల్. సి. అధ్యక్షత వహించారు. సాంస్కృతిక సంఘ అధ్యక్షులు శ్రీ టి. రాధాకృష్ణ అధ్యక్షులను వుపన్యాసకులను పరిచయం చేసారు. ఉపన్యాసకు లందరూ శ్రీ నాగేశ్వరరావు నటనా ప్రతిభను, సేవా నిరతిని శ్లాఘించారు. ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమీ అధ్యక్షులు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజా ముఖ్యప్రతినిధిగా పాల్గొన్నారు. శ్రీ సి వి. కుమార్ వందన సమర్పణ చేసారు. శ్రీ కె. వి. వీరయ్య ఎం.పి వెండికప్పులను బహూకరించారు.

—శ్రీనివాస్

# పుస్తకాలు

## అభిజ్ఞాన శాకుంతలము

ఆంధ్రీకరణం: నిష్మల సీతారామశాస్త్రి. సంస్థాన బహుళార్థ సాధక పాఠశాల., బొబ్బిలి, 144 పేజీలు, వెల 2 రూ.

"కావ్యేషు నాటకం రమ్యం
నాటకేషు శకుంతలా"

అని అభిజ్ఞాన శాకుంతలం అన్యదుర్లభమైన ప్రసిద్ధి పొందింది. దీనికి తెలుగు అనువాదాలు ఇంతకుమునుపే అనేకం వచ్చినప్పటికీ ఇందులోని రచనా సౌందర్య సౌకుమార్యాదులు తమలో కలిగించిన ఆనందానుభూతిని ప్రకటింప దలచి దీనిని ఆంధ్రీకరించామని పీఠికలో చెప్పుకున్నారు.

అనువాదకుని ప్రజ్ఞ ముఖ్యంగా శ్లోక భావాన్ని పద్యంలోకి కుదించడంలో కనబడుతుంది. ఈ విషయంలో శ్రీ శాస్త్రిగారు కృతకృత్యులు కాలేక పోయారని చెప్పడానికి చింతిస్తున్నాను.

మూల శ్లోక భావాన్ని నాలుగు పాదాలు గల పద్యంలో ఇముడ్చలేక 'పంచ పాదులు' దించడం మెచ్చుకోదగ్గ విషయం కాదు. అటువంటి పంచ పాదులు ఈ పుస్తకంలో పదిహేనుదాకా ఉన్నాయి. ప్రసిద్ధులైన తెలుగు కవులు ఎవ్వరూ ఐదు పాదాల పద్యాలు వ్రాయలేదు.

అరయు, తలప, ఎలిమి, కూర్మివంటి వ్యర్థ పదములను పాదపూరణార్థం వాడడం చాలా చోట్ల కనిపిస్తుంది.

100వ పేజీలో 'గడ గడ వణకి పోయెను అతాంగి' అన్నచోట, 101వ పేజీలో 'కష్టమో అంతవరకె సంప్రాప్తమయ్యె' 'పుణ్యఫలమాయె రాబోవుటరయ గల్గ' అనే పాదములయందూ యతి పడలేదు.

5వ పేజీలో 9వ పద్యం చివరి పాదంలో గణభంగం అయింది.

44వ పేజీలో 15 వ పద్యంలో

'కలదు నీయందె అన్యథాగాదటంచు' అని వ్రాశారు. అన్యథా అంటే చాలు. యతికోసమని అనవసరంగా 'గా' చేర్చారు.

134 వ పేజీలు 'అప్డు' అనీ, 78వ పేజీలో 'ఎంత్రు' (ఎంతురు అనడానికి) అనీ వ్రాశారు. ఈవిధంగా కవిత్వరచనకు ప్రాథమికదశలో ఉన్నవారు వ్రాస్తే వ్రాస్తారేమో గాని ప్రౌఢ కవులు ఎక్కడా వ్రాయలేదు.

గణయతి ప్రాసల కోసం వ్యర్థపదప్రయోగాలు చాలా చోట్ల జరిగి ధార కుంటుపడింది.

వీరేశలింగం పంతులు గారి అనువాదం అంత చక్కనిది మళ్లీరాలేదు ఇంత వరకూ. మళ్లీ మళ్లీ అదే ఫక్కీలో ప్రయత్నించడం కన్న, గ్రాంథిక భాషనీ పద్యాలనీ వదిలేసి, స్టేజి చేయడానికి అనువుగా వ్యావహారికంలో శాకుంతలాన్ని ఉపువ దించడం అవసరం.

—కుమార ధూర్జటి

## కథలు

రచన: శ్రీ ముద్దుకృష్ణ. క్రౌను 119 పుటలు. వెల సాదా ప్రతి రు. 2లు. మేలు ప్రతి రు. 3లు. ప్రకాశకులు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ—2.

శ్రీ ముద్దుకృష్ణ వ్రాసిన 13 కథల సంపుటి యిది. ఇందులోని కొన్ని కథలు ముప్ఫయి మూడేళ్ల క్రిందట ఆయన సంపాదకత్వంలో వెలువడుతూ వుండిన 'జ్వాల' పత్రికలో ప్రకటించబడినవేనట!

'ఒక దేవుడి పుట్టుక' అనే మొదటి కథలో దేవుడి పేరు చెప్పి లోకాన్ని మోసగించే కపట భక్తుల ప్రవృత్తి విమర్శించబడింది. 'వింతప్రకృతి' అనే కథలో పునర్వివాహాన్ని ప్రేరించిన ప్రియుని అభిప్రాయానికి అడ్డు తగిలి వివాహం లేకుండానే అతనితో జీవితం గడపదలచిన ఒక వితంతువు విచిత్ర స్వభావం చిత్రించబడింది. 'అహింస'లో తామున్న యింటిలో కాపురమున్న దుండగులు చేసిన మానభంగానికి గురైన యువతి విరక్తి వివరించబడింది. 'ప్రథమ కబళే' అనే కథ, నూతన దంపతుల జీవిత మాధుర్యాన్ని, మగవాని వింత ఆలోచనలనూ వెల్లడిస్తున్నది. 'కాలం కల్పించే మార్పు'లో స్వార్థపరులైన కక్కుర్తికి గడ్డితినే నీచుల స్వభావం చిత్రితమైంది. 'క్లియోపాత్రా' పాశ్చాత్య నాటకాన్ననుసరించి వ్రాసిన కథ. 'తెలివి'లో ఒక అమాయకురాలైన బాలిక యొక్క విషాదాంత గాథ వర్ణించబడింది. 'పది రూపాయిల టిక్కెట్'లో రైల్వేవాళ్లను మోసగించే ప్రబుద్ధుల తెలివితేటలు చూపబడినవి. 'ఎక్కడికి?' అనేది పాశ్చాత్య దేశీయుల విచిత్ర ప్రవృత్తికి మచ్చుతునక. 'దురాశ'లో దొంగనోట్లు తయారు చేసే వారి యుక్తులు, ఉపాయాలు వ్యక్తమవుతున్నవి. 'నా మంత్రి' కథలో అధికారానికి వచ్చిన కాంగ్రెస్ మంత్రుల ప్రవర్తన విమర్శింపబడింది. 'పిచ్చి నమ్మకాలు' పిచ్చి నమ్మకాలయినా దాఖలా యిస్తాయని చక్కగా వివరించబడింది. 'అంటరాని పాలం'లో పల్లెటూళ్లలో జరిగే అన్యాయం కళ్లకు కట్టినట్టు చూపబడింది.

శ్రీ ముద్దుకృష్ణ సాహిత్యంలోని వివిధరంగాల్లో కృషి చేసి పేరుప్రతిష్ఠలు సంపాదించారు. కథానికా రచయితగా మాత్రం ప్రసిద్ధి కెక్కలేదు. ఏదో ఆదర్శం, ఆశయం మనస్సులో పెట్టుకుని, దాన్ని అనుసరించి కథలు అల్లినట్లు కానవస్తున్నది. ఇవి పాత పద్ధతిలో వున్నాయి. ఇప్పటి వాళ్లకు ఆట్టే రుచిస్తాయని అనుకోలేము.

—ఆంగీరస.

## పరాజిత

నాటిక శ్రీపుద్దిపెడి రాధాకృష్ణమూర్తి రచన. ఉత్తమ రచనకి బహుమతి అందుకున్నది. 52 పేజీలు వెల రూపాయి. పద్మశ్రీ పబ్లికేషన్సు, చిలకలూరిపేట, గుంటూరుజిల్లా.

# వార్తలలో వనితలు

(12 వ పేజీ తరువాయి)

కాని, 1967 నుంచీ నేటిదాకా అరబ్బుదేశాల కోట్లమంది ఇస్రాయిల్ లక్షలని జయించలేకపోయారు! నేటికి ఎన్ని జండాలు పట్టుకినా ఇస్రాయిల్‌మీద దాడి తియ్యలేకపోతున్నారు. ఇస్రాయిల్ స్థాపన జరిగి ఇప్పటికి రెండు దశాబ్దాలు దాటింది అయినప్పటికీ ఆదేశం ఉనికినే కాదంటున్నారు, అరబ్బు నాయకులూ, వారిని బలపరిచేవారూ. ఇంత ప్రమాదకరంగా జీవిస్తున్న ఇస్రాయిల్ నాయకత్వం వహిస్తున్న వ్యక్తి ఒక నడివయస్సు వనిత, పిల్లలతల్లి, వారి పిల్లలకి అమ్మమ్మ, బామ్మ...



విచిత్రం ఏమిటంటే శ్రీమతి గోల్డా మెయిర్ నేడు ఇస్రాయిల్ శత్రువనిపించుకుంటున్న రష్యాలో పుట్టారు! అమెరికాలో పెరిగి ఇస్రాయిల్‌కి వలస వెళ్లిపోయారు, దేశ ప్రధానమంత్రి అయ్యారు...

శ్రీమతి గోల్డామెయిర్‌కి ఒక కుమార్తె సారా, ఒక కొడుకు మెనాచెమ్. సారా తన కుటుంబంతో బీర్షెబా అనేచోటు దగ్గిర ఉంటుంది; మెనా చెమ్ చెల్లో (ఫిడేలువంటి వాద్యం) విద్వాంసుడు, ప్రస్తుతం అమెరికాలోని కనెక్టికట్ విశ్వవిద్యాలయంలో చదువుకుంటున్నాడు...

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

B.కృష్ణారావు సమర్పించు

మిత్రా ప్రొడక్షన్స్

# మళ్ళీ పెళ్ళి

దర్శకత్వం C.S.రావు B.A(Litt) సంగీతం K.V.మహాదేవన్

నిర్మాత : T.సూర్యనారాయణ

